# నవలలు

| | | రూ | అ |
|---|---|---|---|
| శిశుహృదయము | | 1 | 0 |
| వలపులరాణి | | 1 | 0 |
| నేనెవరిభార్యనా ? | | 1 | 4 |
| నేనెవరిభర్తను ? | | 1 | 4 |
| తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి గారి | | | |
| జీవనప్రభాతము (రఘునాథ్) | | 1 | 8 |
| జీవనసంధ్య (తేజసింగు | | 1 | 8 |
| అగ్నిరాముడు | | 1 | 0 |
| భయంకరుడు | 1 భా | 1 | 0 |
| [illegible] | 2 భా | 1 | 0 |
| రమేశబాబు | | 1 | 0 |
| సర్కిల్ రంగనాథన్ | | 1 | 0 |
| శకుంతల బి. ఏ. | | 1 | 0 |
| చదువుకున్న భార్య | | 1 | 0 |
| నీవేనా ? | | 1 | 0 |
| [illegible] | | 1 | 0 |
| కృష్ణకుమారి | | 1 | 0 |
| [illegible]బాబు మోయిల్ | | 1 | 0 |
| [illegible] | 1 భా | 1 | 0 |
| పగటిచుక్క | 2 భా | 1 | 0 |
| డిట్టో | 3 భా | 1 | 0 |
| (పైమూడుభాగములుచదివిన కథ పూర్తియగును) | | | |
| రమాసుందరి | 1 భా | 1 | 0 |
| డిట్టో | 2 భా | 1 | 0 |
| రక్తవాహిని (ఐదు హత్యలు) | | 1 | 0 |
| ఇంద్రజాలము | | 1 | 0 |
| రాజద్రోహి | | 1 | 0 |
| అర్ధరాత్రపువింత (3 హత్యలు | | 1 | 0 |
| దురాశ | 1 భా | 1 | 0 |
| డిట్టో | 2 భా | 1 | 0 |

| | | రూ | అ |
|---|---|---|---|
| గొంగళినాగకథ | | 1 | 0 |
| మోహనపిశాచము 270 పే॥ | | 1 | 8 |
| కాలసర్పము | 1 భా | 1 | 0 |
| డిట్టో | 2 భా | 1 | 0 |
| ఆనందభవనము | | 1 | 0 |
| అల్లరిపిల్ల | | 1 | 0 |
| మగడుకానిమగడు | | 0 | 12 |
| దగ్ధరాజు | | 1 | 0 |
| [illegible] | | 1 | 0 |
| కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి | | | |
| అహల్యాబాయి | | 1 | 0 |
| రాజరత్నం | | 1 | [illegible] |
| కృష్ణవేణి | | 0 | 1[illegible] |
| హేమలత | | 1 | 4 |
| కర్పూరమంజరి | 1 భా | 1 | 8 |
| డిట్టో | 2 భా | 1 | 8 |
| రామచంద్రవిజయం | | 1 | 4 |
| వినోదములు | 1 భా | 0 | 12 |
| డిట్టో | 2 భా | 0 | 12 |
| Tales of Rajasthan అను రాజస్థాన కథావళి | 1 భా | 1 | 8 |
| డిట్టో | 2 భా | 1 | 8 |
| మణిమంజరి | | 0 | 6 |
| సువర్ణగుప్తుడు | | 0 | 6 |
| చమత్కారమంజరి | 1 భా | 1 | 0 |
| డిట్టో | 2 భా | 1 | 0 |
| Lives of Great Men మహాపురుషుల జీవితచరిత్రలు | 1 భా | 1 | [illegible] |
| డిట్టో | 2 భా | 1 | [illegible] |
| డిట్టో | 3 భా | 1 | |

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

# ఉపోద్ఘాతము.

మనయాంధ్రదేశమున ప్రజలకు విశేషలాభము సమకూర్చినది నవలలతో నిండిన గద్యవాఙ్మయమని చెప్పక తప్పదు. ఆంగ్లదేశమందు నవల లనేకవత్సరములనుండి ప్రచురింపబడుచు Vicar of-Wakefield కాలమునుండి, యిప్పటివఱకును మానవుల యాదర్శనములను మార్చుటయందు విశేష ముపయోగించినవి. ఇట్టి నవలల రూపమున హిందూదేశ చరిత్రమంతయును శతాబ్దమున కొక్క నవల చొప్పున వ్రాయవలయు నని నా యూహయుండెడిది. అట్టి యూహ యొక్క మొదటిఫలమిా నవల.

ఈగ్రంథమునందు నిరూపింపబడిన యక్బరుకాలమునే మొదట నెంచుకొనుటలో కొన్ని కారణములున్నవి. అశోకచక్రవర్తి యస్తమించిన తరువాత నింతసామ్రాజ్యము నేలినవారు హిందూదేశమున లేరు. ప్రస్తుతకాలమున మానవులయాశయముల నొకమార్గమునకుఁ దెచ్చుట కిందలి కథాంశములెంతయు నుపకారకములని యెంచితిని. ఈ రెండు కారణములచేతను అక్బరుకాలమునందలి కథనే తొలుత నెంచుకొంటిని.

ఇందు తెలుపబడిన యంశములన్నియును నూటికి తొంబది తొమ్మిదిపాళ్లు చరిత్రయందలి యంశములు. పాత్రలస్వభావముకూడ చరిత్రాంతర్గతముగాని కల్పితముగాదు. ఇది సాంఘికగ్రంథమా లేక చారిత్రాత్మకమా యని యెవ్వరును సందియముఁ జెందనక్కఱలేదు. సాంఘికముగా గొందఱికిఁ దోచినతోఁచవచ్చునుగాని, వాస్తవమున కిది కేవలము చరిత్రాత్మకము. ఇందుకు గావలసిన ప్రమాణము లన్నియు నుత్కృష్టగ్రంథమునుండి సేకరింపబడినవి.

... ... ... ... ... ... ... ... ... ... ...

ఇట్లు విన్నవించువిధేయుడు,

కృతికర్త.

# మనవి

ఈ ధర్మసామ్రాజ్యము హిందూరాజన్యశిఖామణియగు యశోకచక్రవర్తి యస్తమించినతర్వాత హిందూదేశమున తనబుద్ధిచాతుర్యమునను, సర్వమత సమభావౌదార్యమునను మహాసామ్రాజ్యమును స్థాపించిన యక్బరుసార్వభౌముని కాలమునాటి చరిత్రాత్మక నవల. ఇది చారిత్రాత్మక నవలలం దగ్రస్థాన మలంకరింపదగి యున్నది. ఒకవేళ చదువరులు గొందఱు కిది సాంఘికమని తోచినను పరిశీలకులు మాత్రము చారిత్రాత్మకమని యంగీకరింపక తీరదు. ఈ నవలయందు విశేషముగా సర్వమతసమభావకుడైన యక్బరుచక్రవర్తి యొక్క సాహసౌదార్యగుణశీలాదులు వర్ణితములు మఱియు మానవాశయముల నొకవిశిష్టమార్గమునకు దేవలెనని యొకవాక్యముగూడ కల్పింపబడక కేవలచరిత్రాంశములే యుపుగడున కుల్లేఖింపబడి సప్రమాణముగ ఋజువు చేయబడినవి. వేయేల? ధర్మసామ్రాజ్యమను నామము నీనవల సార్థక మొనరించుకొన్నది.

దీనిని కొలది కాలము క్రిందటనే మేము మఱికొన్ని సాంఘిక చారిత్రకాపరాధ నిరూపకనవలలతోపాటు సర్వహక్కులను బడసి పునర్ముద్రణకు దెచ్చితిమి. దీనియందలి యితోషిక చారిత్రకాంశములు ప్రాచీనములైనను చదువరులదృష్టికి నవీనములుగా గన్పట్టుచు వారి నాకర్షించుచుండు ననుటలో నతిశయోక్తి లేదు. అక్బరు చక్రవర్తికి సారస్వతంబునందును, గాన, శిల్ప, చిత్రకళలందును కవిపండిత బృందమునందును గల యాదరాభిమానములు నీనవల యుగ్గడించును. ఇయ్యది సామాన్యమానవులకుగూడ జ్ఞానదృష్టి నిచ్చునటులుండుటయే యిందలి యపూర్వవిశేషము. దీనిని విద్యా కులును, విద్యార్జనాసక్తులును, చారిత్రకాభిమానులను నాదరిం నచో మాకు గొంతప్రోత్సాహ మొసంగినవారగుదురు.

ఇట్లు

ప్రకాశకులు

# అల్లాహో అక్బరు

## మొదటి ప్రకరణము

### 1 ఆగ్రానగరము

ఉదయము కాలేఁకుప్రొద్దెక్కినది. బాలభానుని కిరణములు సన్నని మబ్బులచేఁ గప్పఁబడి కుంఠీభూతము లయ్యెను. చల్లనిగాలి వీచుచున్నది. యమునానది మెల్లగా ప్రవహించుచుండఁ జిన్నచిన్న పిల్లకెరటములచే జలోపరిభాగము చంచలమై యొప్పుచుండెను. పై నుండి చూచినవారలకు జలమంతయు నిలిచి తటాకమువలెఁ గన్పట్టుచున్నను దృఢమనస్కుని యూహలంబోలె నంతర్భాగమున జలము ప్రవహించుచునే యున్నది. అందు ప్రతిఫలించు నాకాశమును సహావాసదోషముచేతఁ జలించుచున్నట్లే కనుపట్టుచున్నది. ఆసమయమున నానదీతీరమున నాగ్రానగర మొంతయును సుందరమై కన్పడకపోదు. ఏటియొడ్డున మెట్లదొంతరలు నింతాపటుల మనుష్యులుండి తమతమ కార్యముల 'నిర్వర్తించుకొనుచుండిరి. కొందఱు వస్త్రముల నుదికికొనువారును, గొందఱు జలములను గుండికలలో నింపువారును నింకఁ గొందఱు పాత్రలను దోముకొనువారునై యుండిరి. కొన్నిటియందు దురకలును మఱికొన్నిటియందు హిందువులును నింకఁ గొన్నింటియందు హిందూమహమ్మదీయులును జలంబుల గ్రహించి సుకృతవంతులైన జనులకుఁ బరమపావనమై సర్వజనులకు మహానందదాయకమగు నానదియొడ్డుననుండి మొగలుసామ్రాజ్యమున కత్యంత సన్నిహితమై పాదుషాకు నివాసమైన యాగ్రాకంటె మనోహర మగు

పట్టణ మింకొకటి యుండునా యను సందేహ మెవ్వరికిని గూడఁ గలుగకమానదు. పోకలుపోసిన సున్నపు రాసులవలె నెక్కడఁ గాంచినను సౌధములే! కొన్ని భవనములు నదియొడ్డుననే కట్టఁబడి జలములయందుఁ బ్రతిఫలించుచు నతి మనోహరముగా నున్నవి. రాజవీథు లన్నియును విశాలములై నిత్యజలసేచనముచే గట్టిపడి గచ్చు చేసిన ట్లొప్పుచుండెను. బజారుప్రదేశము లెప్పుడును గొలగొలలాడుచు, వచ్చిపోవుచుండు జనులచేతను, గుఱ్ఱపుబండ్లచేతను, నలంకరింపఁబడిన యెద్దుబండ్లచేతను నిండి యిసుకవైచినను గూడ రాలకుండెను. ఉదయ మైదుగంటలు మొదలు రాత్రి రెండుగంటలవఱకును బ్రశాంతి యనునది యాభాగమునం దుండనేరదు. మార్గమునందు జనులు గుంపులుగూడి నడచునప్పుడు ప్రమాదములు జరుగకుండఁ జూచుటకును, దొంగతనములు, దోపిడులు జరుగకుండ జాగ్రత్త తీసికొనుటకును, నావీధులయందు నూటయేఁబది గజముల కొక్కవ్యక్తివంతున నాయుధధారులై రక్షకభటు లెప్పుడును పహరాల నిచ్చుచునే యుందురు. నగరము చుట్టుప్రక్కల నుండు భాగమంతయును బ్రశాంతమై యుండును. అందు నుద్యోగులు, చిన్నచిన్న సంసారులును కాపురముండిరి. అందు గృహములు బారులుదీరి ముందు వెనుకలకుఁ బోకుండ సౌరైనవీధులతో నొప్పుచుండును. వానియందు చిన్నచిన్న మేడలు, పెంకుటిండ్లు, నక్కడక్కడ చిన్నచిన్న కుటీరములును గన్పట్టుచునే యుండును.

అయ్యాగ్రాపట్టణమునం దుదయము సుమారు తొమ్మిదిగంటలప్పుడు నత్యంతము పొట్టియై, విశాలమైన వక్షస్థలము గలిగి నల్లని మేనిచాయతో నొప్పు నొకానొక పురుషుఁడు నడచి యొకమూలనుండి యింకొకమూల కతివేగముగ నడచుచుండెను. అతడు బజారునుండి పోవుచు మిఠాయి యంగళ్లను, ఫలములదుకాణములును, బంగారు

రత్నములునమ్ము చోట్లను, ఆయుధాగారములును, భోజనసామగ్రుల యంగళ్ళును. కిరాణాదుకాణములును, కార్మికశాలలును మొదలగువివిధములైన దుకాణములను దాటి ముందునకుఁ బోవుచుండెను. ఆవీథులప్రక్క దీపస్తంభములు నిలుపఁబడి యుండెను. ప్రతియంగడికిని ముందుభాగముఖాళీగానుంపబడి బేరగాండ్ర కుచితములగునాసనములు పరుపులును వేయఁబడియున్నవి. కొన్ని పెద్దయంగళ్ళలో లేఖరులు ముందు గూరుచుండి లెక్కలను వ్రాయుచుండిరి.

మన బాటసారి తలకొక యెఱ్ఱనికుచ్చుటోపీయును, దేహముపై నొక షేర్వానికోటును, కాళ్ళ కొక తెల్లనిషరాయియును, పాదములకొక చడావులజతయును దాల్చియుండెను. దుస్తులనుబట్టి యాతనిని మనము తురకగానే భావింపవచ్చును గాని యక్కడ మహమ్మదీయుఁడెవఁడో హిందువుఁడెవఁడో దుస్తులనుబట్టి నిర్ణయించుట ప్రమాదకరముగాఁ గన్పట్టుచున్నది. ఎల్లరును నొకరకముగుదుస్తులనే ధరియించి యొకభాషనే మాటలాడుచుండిరి. అతఁడట్లు బజారంతయు నించుమించుగా దాటి యొకయంగడిలోనికిఁ బోయెను. ఆయంగడియందు బంగారును రత్నములును వ్యాపారముచేయుచుందురు. అందుండు పెద్దమందసము ముందర వేయఁబడిన యొక తెల్లనిపరుపుపై నాతఁడు గూరుచుండుటంబట్టి యాతఁడే యాయంగడియజమానుఁడని మనము గ్రహింపవచ్చును. ఆపెట్టెకు ముందుభాగమున నొకనున్నతమైన త్రాసును గొన్ని తూనిక కట్టెలనుగూడ నుండెను. మసల్మానుమతగురువుల చిత్తరువులును, హిందూమతగురువుల చిత్తరువులును నాయంగడి ముంగిట ప్రేలాడదీయఁబడి యక్కడికరుదెంచు బేరగాండ్రమనస్సుల నాకర్షించుచుండెను. పెట్టెలో వ్రాయఁబడిన కొన్ని లెక్కల పుస్తకముల దొంతరయు [illegible] నుంచి

కొని యొకపిట్టకలముతో నొకపతేఖుం మున్షిసిరాబుద్దిలోనిసరాను గ్రహించి బరబర వ్రాయుచుండెను. అంగడియజమానుఁడు లోనికి బోయి 'కరీమ్' అని సేవకుని బిలిచి లోనిగదిని శుభ్రపఱచితివా యని యడిగెను. దాని కాతఁడు 'అవును' అని జవాబిచ్చినతరువాత నాయంగడి యజమానుఁడు జాగ్రత్త యని చెప్పి బైటి కేగునూహ తో నంగడి వీడి వచ్చుచుండఁగా, నొక రాజకీయోద్యోగి, యొక నౌఖరు ముందు నడచి దారి చూపుచుండఁగా నెదురుపడెను. అతని గాంచి యీవర్తకుఁడు సలామొనరించి తనయంగడివైపు మరలి వచ్చెను. వీరు మువ్వురును నాయంగడిలోని కేగిన తరువాత నక్కడి విలేఖరి లేచి వీరికి వందన మొనరించి ముందసముదగ్గఱనుండు కట్టెలను తూనికచేయుత్రాసును దెచ్చి వీరిముందుపెట్టెను. రాజకీయో ద్యోగి వెనువెంటవచ్చిన సేవకుఁడు తన మెడలో నొకపటకాకు కట్టఁ బడిన యొక సంచిని విప్పి దానిలో నున్న కొన్నితూనికరాళ్ళనునొక చక్కని త్రాసును బైటికి తీసెను. ఇంతలో నాయధికారి దుకాణము యొక్క నాలుగుమూలలనుగూడఁ బరీక్షించి క్రింద వేయఁబడినతివా సీలనుగూడ నెత్తించి మురికి లేకుండ నుంపఁబడినవో లేదో యని పరీక్షించి యీతూనికరాళ్ళు వేయఁబడినచోటునకు వచ్చి కూరుచుం డెను. అంత నొక్కొక్క కట్టెచొప్పున వాని నన్నిటినిగూడ నాతఁడు పరీక్షించి సంతుష్టాంతరంగుఁడై తనదారినిబోయి మఱియొకయంగ డిం బ్రవేశించెను. ఆదుకాణదారుఁడును నాతని వీడ్కొలిపి తన మార్గమున ననుసరించి చనెను.

మన బాటసారియు బజారున్నచోటు వచ్చి యఱుపురెండవవీధి నతిగి యక్కడ నొక రెండంతస్తులమేడ యింటి గుమ్మమువద్ద నిలువబడి తలుపు దీయుమని రెండు మూడు మారులు పలుకఁగ లోనుండి 'యెవ రవారు' అని [illegible] [illegible] నెలుఁగు వచ్చెను, 'నేనునాధుఁడ నని

నుండి యిక్కడికి వచ్చుటకు బయలుదేఱుసరికి కొత్వాలు మా యంగడిని బరీక్షింపసాగెను. అంగడిపరీక్ష యైనతరువాత నేను బయలుదేరి యిచ్చటికి వచ్చితిని.

రహీమ్—అయినచో నీకు బాగుగా లాభముదొరికి యుండును. నిన్న నేమాత్రము వ్యాపారము జరిగినది.

రామ—నిన్న నెనిమిదిలక్షల రూపాయల రత్నములును, ముత్యములును నాతఁడు మాత్రఁడే గొని నాలుగులక్షలు చెల్లించి, తక్కిన నాలుగులక్షలకును బాకీయని చెప్పిపోయినాఁడు. ఆతఁడేగోసరకు నిచ్చుట విక్రయించుకొని మాసామ్మున కంకోకనిచే మాట యిప్పించినాఁడు. నాకు నిన్నటివ్యాపారమునం దొక యెనుబది వేలరూప్యములు లాభము వచ్చియుండును గాని యిదివఱకు జరిగినరత్నపరీక్షలో నా యంగడిలోని కొన్నిరత్నములను పగులఁగొట్టించుటచే వచ్చిననష్టముచే లాభము తగ్గిపోయినది. నాకు మొత్తము బేరములోఁ గొన్ని గాజుముక్కలవంటివి ముప్పది వేలకుఁ గొనవలసవచ్చినది. అవి పగుల గొట్టిర గావున నాకొక యేబది వేలుమాత్రమే లాభము.

రహీ—వర్తకముమాట యటుండనిమ్ముగాని రేపు జరుగఁబోవు యుద్ధక్రీడ కెవరెవరు వత్తురో నీవెఱుఁగుదువా!

రామ—మనతాలిమ్‌ఖానానుండి పోవువాఁడవు నీవొక్కఁడవే గదా! పట్టణములో నెన్ని తాలిమ్‌ఖానాలో యున్నప్పటికిని నీతో సరసమానుఁడైనవాఁ డొక్కఁడును లేకపోవుటచే వారు నీపేరు వినినంత భయమంది ముందునకురుక మానెదరుగాని, యెవరో యొకరిద్దఱు ధైర్యముచేసి ముందునకు వత్తురు. వారికి తప్పక యెముకలు విఱుగును. అందఱిని జయించి పట్టణవాసులయొక్క మన్ననసు నీవు పడయువాఁడ వనుట తప్పదు. అప్పుడు గదా! నీయదృష్టరేఖ బయలుపడును!

రహీం—అట్టి యదృష్టము మనకు పట్టునా యని నాకు సంశయము. అయినను పరీక్షించి చూతముగాక! కాని రేపటియుదయమునకుఁ గొన్నిదుస్తులు కావలెను. కాని నిప్పుడే బజారునుండి తెప్పించుకొనక తప్పదు కావున నాకుఁ గొంచెము రొక్కమిమ్ము!

ఆమాట వినినతోడనే రామనాథుఁడు తన చొక్కా జేబులో నుండి కొన్ని నాణెములను దీసి యాయన కొసంగి యిట్లు చెప్పెను.

రామ—రేపుదయము మేఁడుగంటలకు సభ తప్పక సమావేశము కాఁగలదు. కావున మన మచ్చోటి కంతకొక గంటముందుగనే పోవలయును. భాయ్! నాకింకను అంగడిలో పని యున్నది. మా తండ్రివచ్చి నాకొఱకచ్చట వేచియుండును. నేను పోయివచ్చెదను. నీదుస్తులను జాగ్రత్తచేసికొని సిద్ధముగా నుండుము.

అని చెప్పి రామనాథుఁడు తన యంగడివైపునకుఁ బోయెను.

పై సంభాషణమునుబట్టి రహీంఖునకును రామనాథునకును మంచిస్నేహ మని పాఠకులకు చెప్పకయే తెలియుచున్నది. రహీము ధనికుఁడు కాఁడు. పిత్రార్జితమైన యిల్లు తప్ప నాతని కేయాస్తియును లేదు. ఆయింటినిగూడ నెవ్వరికిని నాతఁడు బాడుగ కీయక తానే వాసము చేయుచుండును. చిన్నవయసునందుఁ దలిదండ్రులు గతించుటచే నాతనికి విద్యాబుద్ధులు చెప్పించువారు లేకపోయిరి. దగ్గఱనున్న ధర్మపాఠశాలలో నాతఁడు చదువుటకు వ్రాయుటకు మాత్రమే నేర్చికొనెను. తల్లిదండ్రులు చనిపోయినతరువాత నీతనిని బెంచి పెద్దవానిని జేసిన మేనయత్తమాట వినక చదువుమాని బడికి పోక తాలింఖానాలలో దిరుగుచు కసరత్తుచేసి సొగసైన దేహపాటవము నమర్చుకొని బలమైన కండరములను సంపాదించి కుస్తీ, సాము మొదలగు విద్యలందు గడిదేరి ఆగ్రాయందే గాక చుట్టుపట్ల నెచ్చటనుగూడ నీతనితో సరిగా కుస్తీచేయువస్తాదు లేఁడని ప్రఖ్యాతి

గానము వినవచ్చెను. ఆసౌధ మొక పెద్దఖాళీస్థలమునకు నడుమఁగట్టబడి రహీమునింటి కెడమప్రక్క నుండెను. ఆసౌధమునకును సీతని యింటికిని నడుమ నేఁబదిగజములదూరముమాత్ర ముండెను. ఈస్థల మంతయును నాసౌధమునకుఁ జేరినదే యగుటచే నానేకములగుఫల వృక్షములును, పూలమొక్కలును వేసి పెంపఁబడుచుండెను. అందు చల్లనిచంద్రకాంత వేదికలును, చక్కని లతాకుడుంగములును, విదేశమునుండి తెప్పించినచక్కని చినచిన్నయాకులు గలమొక్కలునునిండియుండి యాయింటి కెంతయును శోభను గూర్చుచుండెను. రహీమునియొక్క చిన్న మేడనుండి తొంగిచూచినయెడల నిందలి వృక్షములు గన్పించుచుండుటయే గాక, యిందలిపుష్పసౌరభములను మందపవనంపుఁగొదమ లపహరించి తెచ్చి యక్కడివారి కొసంగుచుండును. ఈనాఁడాసౌరభములతోఁ పాటు అవ్యక్తమధురమై, మదించినగండుగోయిలపాటవలె మనోహరమై, ఆనందమయమై, యమాయకమై, చింతారహితమై యొప్పుహృదయమునుండి బయల్వెడలిన నిర్మలసంతోష ప్రవాహం బట్టులుండునని చూపించుచు గానలహరియుఁగూడ పవన కుమారుని యొరకలపై స్థలాంతరమున కేగుచు శ్రోతలహృదయమును దన్మయ మొనరించుచుండెను. రౌతనుమాట సెలుగక కట్టునకుఁగాని ఖాలీసునకుఁగాని యెన్నఁడును లోఁబడక, పర్వతాగ్రములనుండి క్రిందచరియలలోనికి దుముకుచుండు సెలయేళ్ళతో పందెములు వైచునట్లు చంగున దాటుచుండు నడవిగుఱ్ఱములగు సైతము చెవులు రిక్కించుకొని స్థిరదృష్టులను నిగిడింపఁ జేయుటకుఁ జాలిన గానసుధామాధురీ ధ్వనియెవ్వని హృదయమునకు సంతోషమును గలిగింపఁ జాలదు. ప్రకృతియం దుండునణువులసహితము తమ నిత్యచాలనములో నఖండగానసంపత్తిచే తాండవమాడుచుండును. మన భూగోళమునకంటె నెన్నియో వేలకొలఁదిరెట్లు పెద్దవై, యసంఖ్యాక

ములైన గోళములు ఆధారరహితములై యనంతాకాశమునఁ జరించుచు నత్యుత్తమమైనగానామృతమును జనింపఁ జేయుచుండును. ప్రకృతి యం దెల్లను లీనమై, సాక్ష్యదర్శకుల కందుటకి నతిసులభముగాఁ దోచుచుండునీగాన మెవ్వని వశము గాఁ జేయఁజాలును. రహీము తనకుర్చీని కిటికీయొద్దకుఁ దీసికొని శ్రద్ధానదసాస్వాదన మొనరించు చుండెను. అది పారసీకభాషకుఁ జెంది భక్తిరసప్రధాన మగుటచే వినువారల కెంతయు హృదయాకర్షకముగా నున్నది. అతఁడు తన్మయుఁడై యుండ భావప్రవాహములందు నిజమనోహంసము దూఁగు చుండెను. మనోవేగంబునకు విద్యుచ్ఛక్తి వేగ మొందును దులఁదూఁగ దని చెప్పుట యతిశయోక్తి గానేరదు. ఒకనిమిషంబు నొక్క క్షణము ననే యెట్లు విద్యుద్దీపములుగాని విద్యుత్సంబంధములగు కొలిమిగాని తేజోవంత మగుచున్నదో యట్లే భావనాప్రవాహమున నొక్క విజాతీయానుభవము లన్నియును మనస్సునకు స్ఫురించి యాత్మశక్తిని వందలకొలఁది సంవత్సరములకు వెనుకకుఁగాని ముందునకుఁగాని, వేల కొలఁదిమైళ్ళదూరమునఁగాని దీసికొనిపోవును. ఈగానరవ మాతనిశ్రవణకుహరమును జొచ్చి యెంతయో నాతనిమనస్సుఁ బట్టి తత్సౌధగవాక్షములం జొచ్చి వాయుమార్గమున నేగియున్న యా గాయనీమణియొక్క ముఖసరోజమున కెదురుగఁ దాండవమాడుచుండెను. వేయేల? ఆతనికి సంపరిచితమైన యాసుందరీమణిరూప సందర్శనము నొక్కసారి యాతని మనస్సున నుద్భవించి కళవళపెట్టసాగెను. ఆతని హృదయమునం దొకతాపము పుట్టెను. దానితో నాతఁడు కూరుచున్న ప్రదేశమునుండి లేచెను. ఇటునటు బ్రచారము సలిపెను! మరల నిస్పృహఁ జెందెను. దుస్సహముగ నిట్టూర్పు విడిచెను. మరల నాశాంకురము లాతని హృదయసీమను మొలకలెత్తెను. వృద్ధియై యల్లుకొనెను; ముఖమున వికాసము పుట్టెను; తిరిగి ధైర్యముఁ

వని యెండలో జనులు గుంపులుగూడి వచ్చుచుండిరి. మన రామనాథరహీములును వారిలో నుండిరి.

రామనాథరహీములు కోటదరికిం బోవుసరికి సుమారు రెండుగంటలగుచుండెను. మొదట వారు రాజమార్గము ననుసరించినవారై కోటగోడలను సమీపించిరి. అత్యున్నతమై విశాలమైన ప్రాకారముల నడుమనుండు సౌధరాజములను దిలకించునప్పు డవి నక్షత్రమండలముతో వియ్యమందుచున్నవా యని మనస్సునకుం దోచక మానదు. ఆరాచనగరుచుట్టును నుండు నగడ్త గంభీరమై యెల్లప్పుడును జలముతో నిండియుండుటచే నందు జలచరము లనేకములు నివసించుచుండును. అందు తామరలును విశేషముగా నుండుటచే వానిపైం బ్రసరించు వాయువులు తద్గంధము నను వహించి దారిం బోవువారి మనసుల నాకర్షింపంగా వారా కోటవైపు చూచి జలవలయితమైన యీస్థితి యుట్టి యున్నతప్రాకారమున కెట్లు సంభవించె నని సంశయించుచు నది మనుష్యనిర్మితము గాదనియు దేవనిర్మితమనియును చింతించుచుందురు. అగడ్తచుట్టును మఱియొక్క పెద్దగోడ కలదు. ఈ రెండుగోడలను గలుపుచు కందకము దాటుటకుగా నొక సుదృఢవంతెన నిర్మింపంబడి యున్నది. ఇష్టమువచ్చినప్పు డెత్తుటకుంగాని దింపుటకుగాని వీలైన యావంతెన యెప్పుడు వాల్చంబడి యుండుటచే నాజనులందఱును దానిపై నెక్కి పోవుటకు వీలుపడెను. ప్రథమద్వారము మొదలుకొని యన్నిప్రాకారములకడను సిపాయిలు కావలి కాచుచుండి యనుమానమునుబుట్టించు సవారి నెవ్వరిని లోనికిం బోనీకుండం జూచుచుందురు.

తీర్థప్రజవలె లోనికిం బోవుచున్న జనుల నెవ్వరును నడ్డగింపలేదు. కొంచెముదూర మేగినతోడనే పండిన ప్రాకారముగలదు. దానికిరుప్రక్కల నున్న పెద్దగాలిగోపురములలో సిపాయి లెల్లప్పుడును పాటలం బాడుకొనుచు వినోదించుచుందురు. అందొక గోపురముల

చిగురుభాగమున నెప్పుడును నొకసిపాయి యప్రమత్తుఁడై కావలిగా చుచు నలుదిక్కులకు సింహద్వారములనుండి శత్రువులు చేరకుండ బరీక్షించుచుండును. ఆగోపురమునుండి యెన్నియోజనముల దూరమువ ఱకును నన్నిదిక్కులకును దృష్టిబఱపి తిలకింపవచ్చును. కావలిగోపుర ములను దాటి జనులు లోనికిఁ బోయి నడుమనున్న యొక పెద్దసౌధ మున నొక ప్రక్కనున్న కిటికీక్రింద తక్కినగుంపులతోఁ గలసి నిలువఁ బడిరి. ఆగవాక్షమున నొకమనుష్యుఁడు నిలువంబడినయెడల నాతఁ డందఱికిని దప్పక దృగ్గోచరుఁడగుటయే గాక క్రింద జరుగునదంతయు ను నాతనికిఁగూడ విస్పష్టముగాఁ గనుపింపఁగలదు. అప్పుడే యీశ్వరు పాదుషా యాగవాక్షముకడఁ జేరెను.

ఆయన యనుదినమును పడకనుండి సూర్యోదయము కాకుండ గనే లేచి స్నానమొనర్చి యాగవాక్షముకడ కరుదెంచు వేళకుసూర్య భగవానుఁడు ప్రపంచములోనితంద్రతను బోఁగొట్టి యందఱకును జీవ కళ నొసంగుటకై తనసహస్రకరముల నాలుగుదిక్కులకును బంపి యె ల్లరను స్పృశించును. పాదుషా యాగవాక్షమునఁ గూర్చుండుకాల మునకు సూర్యబింబ మాతనికన్నులకుఁ గన్పట్టుచుండును. ప్రపంచము నందలి సర్వదేవతలలోను బ్రత్యక్షరూపియై, ప్రపంచవృద్ధికి కారకుఁడై దయామయుఁడై యొప్పుకర్మసాక్షియొక్క సహస్రకిరణాంచితమై, పవిత్రమై, జ్యోతిస్స్వరూపమైన మహామూర్తిని గన్నులారఁ గనుఁ గొనునప్పటికి శరీరము పులకరించి తన్మయుఁడై పాదుషా యానంద సముద్రమున నోలలాడుచుండును. ఆసూర్యబింబములో గోచరించు చున్న పరమేశ్వరప్రభావ మాయనమానసమున తాండవమాడి యొక్క సారి యాతనిని భక్తిప్రపంచచక్రవర్తినిగా నొనరించి పులకాంకురముల బుట్టించును. ఆపరంజ్యోతి నర్చించుచు వచ్చినపాదుషాయొక్క ముఖ కమలమును జూచుచు తనివిదీఱఁ గన్నులతోఁ దదేకదృష్టితో జనులంద

టును నుండెను. ప్రతిమానవ్రునియునస్సును లోచనగోళంబుల ద్వారా
తేజోరూపమునఁ బ్రసరించు యీపాదుషాముఖమున లీనమగుచుం
డెను. ప్రతిదినమును నాతఁడు పూజపూర్తియైన తరువాత, జను లా
కోటలోఁ బ్రదర్శించు చిత్రప్రదర్శనములం గాంచి, యందుత్తములగు
వారికిఁ దగు బహుమానముల నొసంగుచునే యుండును. ప్రజలంద
ఱును "అల్లాహో అక్బర్" అని కేకలు వేయుచుందురు. ఒకొక్క
దినమున సైనికులు వచ్చి తమవ్యాయామరచనాకౌశల్యమును, ఆయు
ధోపయోగసామర్థ్యంబును జూపింపఁగా నానందించి వారందఱకును
బహుమానములను నున్నతోద్యోగములను నొసంగుచుండును. అంత
టితో నుదయచర్య నాసి యాతఁ డభ్యంతరగృహమునకుఁ బోవును.

ఈదినమున నట్టిపద్ధతులకుఁ గొంచెము భిన్నత వచ్చెను. పాదుషా పూజ ముగించి లోనికిఁ బోయిన వెంటనే మహలుతలుపు తెఱవఁబడెను. ఆమార్గ మొక చంద్రకాంతశిలానిర్మితమైన బయలులోనికిఁ బోవును. అం దనేకములైన పూలమొక్కలును, వివిధములైన జలయంత్రములును, రకరకములైన ప్రతిమలును, చిన్నచిన్న రమ్యమైన జలకుండములును, చక్కని సోపానములును నొప్పుచుండును. నలుప్రక్కల సత్యున్నతములైన సౌధమాలికలచేఁ జుట్టఁబడియున్న యీ బయలునందు నడుమ విశాలములైన గుడారములు వేయఁబడి యుండెను. అందొకప్రక్క సామాన్యులగు ప్రేక్షకులకును, మఱియొక ప్రక్క జనానా స్త్రీలకును గూరుచుండుటకు స్థలము నిర్ణయింపఁబడెను. వీనికన్నిటికిని నడుమ నొక కొంతస్థలము పోటీదారులకొఱకు నిర్దేశింపఁబడెను. ఒకరుండు స్థలమునుండి యింకొకస్థలమునకు జనులు దాఁటిపోకుండ మోకు లడ్డముగాఁ గట్టఁబడినవి. మఱియొక ప్రక్కనున్న గుడారముల క్రింద రత్నకంబళ్లు పఱచి వానిపై నెన్నియో యాసనములు సిద్ధమొనరించి యుంచిరి. నిర్దిష్టకాలమున కండలి

యాసనము లన్నియును నున్నతరాజకీయోద్యోగులచే నలంకరింపఁబడెను. నడుమ నవరత్నఖచితమై వేలకువేలు వెలగలిగి పాదుషా కొఱకు వేయఁబడిన యున్నతాసనముతప్ప, తక్కినవన్నియును వాని వాని కనుగుణములగు నుద్యోగులతో నిండెను. సర్వసేనాపతి యగు రాజామాన్‌సింగు, రాజాతోడర్‌మాల్, రాజాభగవాన్‌దాస్ మొదలగు హిందూయోధులును, కొత్వాల్, ఖాన్, మీర్‌ఆదిల్ మొదలగు నుద్యోగములలో నుండు హిందూమహమ్మదీయులును, ఆబుల్‌ఫైజీ మొదలగు కవులును, పండితులును వచ్చి యెవరిచోటున వారు కూరుచుండిరి. అన్నిదిక్కులనుండియు నాయుధపాణులైన రాజభటులు పహారాలనిచ్చుచుండఁగా, సభ యంతయును నిశ్శబ్దమై పాదుషా రాకకు వేచియుండెను. ఇంతలో నొక మహలుప్రక్క తలుపులు తెఱవఁబడఁగా నందుండి పాదుషా బయటకరుగుదెంచెను. ఆయనను గాంచి యెల్లరును సగౌరవముగా లేచి నిలువఁబడి సలాము లొనరింపఁగాఁ బాదుషాయును, వారలకుఁ దిరిగి వంగి సలామొనరించి తన యాసనముపై నాసీనుఁడయ్యెను. అట్లు కూరుచున్న చక్రవర్తి వెనుకఁ గొంతమంది రాజపుత్రులును, కొందఱుమహమ్మదీయులును నాయుధపాణులై నిలువంబడిరి. వారు చక్రవర్తి కంగరక్షకులని తేటపెల్లనగుచున్నది.

ఇట్లాతఁ డుపవిష్టుఁడైన తరువాత నచ్చటి సైనికోద్యోగులలో నొకఁడు ముందున కరుదెంచి, పాదుషాకు వంగిసలాము చేసి యొక పెద్దబాకా నూదిన తక్షణమే నలువురుపురుషు లాపోటీదారులకొఱకు ప్రత్యేకింపఁబడిన మూలలనుండి బయలుదేఱి నడుమకు వచ్చి నిలువఁబడిరి. "ఎందఱోజను లామూలలనుండినను గూడ నల్వురుమాత్రమే యిచ్చోటికి వచ్చి నిలుచుటకుఁ గారణ మేమైయుండును" అని యాతఁ డంగరక్షకులలో నొకని నడుగగా పాదుషాతో వారిట్లనిరి.

"మహాప్రభూ! ఇంతమంది వచ్చియున్నగూడ ముందు నిలిచిన నలువు రితోడ బోరాడజాల మనుపదైర్యముచే వారందఱును నిలిచిపోయిరి. వీరిలో నొక మహావ్యాస్కీడుపీరుడు, 'రహీమ్' అనువాడు దుర్వార బలసంపన్నుడగుటచే నింక జాలమంది వానిపేరు విని భయపడి పోయిరి." ఈమాట జైనసెంటుసో నజీరొకసారి బాకా యూదం బడెను. ముందునిలిచిన నలుగురిలోను నొక యిరువురు వెంటనే రంగస్థలములోనికివచ్చి నిలువంబడిరి. వారిరువురును గుస్తీ కనుకూల మగునట్లు నాభి మొదలు మోకాలువఱకును గొప్ప చల్లడమును, కాసెకోకను మాత్రమే ధరించి యుండిరి. రంగస్థలమున కరుగుదెం చినతోడనే బాదుషాకు సలాముచేసి వారుభయులును నొకరి నొక రదేవిధముగా గౌరవించుకొని యొకరిహస్తము నింకొకరు పట్టుకొని కుస్తీకి బ్రారంభించిరి. చేయియు చేయియు కలిపిన వెంటనే వా రొకరి నొకరు లాగి క్రిందం బడవేయుటకు బ్రయత్నించిరి గాని పట్టు జాఱిపోవుటవలన మరల చేతులు రెండును గలిపిరి. ఇంతలో నొకడు కుడిచేయినందించి వానిని లాగివేయుటకు బ్రయత్నించుచుండగా రెండవవాడు చక్రము తిరిగినట్లు తిరిగి కాలుతో మండకొట్టెను. దానికి కాలువిరిగి గాని మడతపడిగాని యాతడు పడిపోవు నని యందఱనుకొనుచుండగా వాడు పడిపోవు చున్నట్లే తోచునంతటిక్రిందకు వంగి యూతనికాలు పట్టుకొని లాగి వేసెను. కాని యాతడు మహావేగముతో దనకాలును విడిలించు కొనియెను. ఇట్లిరువురును హస్తలాఘవములను బాదలాఘవములను బ్రదర్శించుచు కొంతసేపు యుద్ధ మొనర్చినతరువాత వారిలో మొదటి వాడు క్రిందబడియెను. వెంటనే పాగాధరించినయాయుద్యోగి వారి పోరాట మాపివేయుట కొకబాకా నూదగావే వారిరువురును రంగ స్థలమువీడి వెనుకకు మరలిరి. మరల నాతడు తనబాకా నూదగా

మిగిలిన యిరువురును బోరాడుటకు రంగస్థలములోనికి వచ్చిరి. వీరిలో మనకు పరిచితుఁడగు రహీము నుండెను. రహీము మిక్కిలిబలశాలి నల్లని దృఢకాయము గలవాఁడు. శరీరము బాగుగానున్నను చురుకుదనమునకు లోటు లేనివాఁడు. విశేషము పొడగరి కాఁడు. అతని వక్షస్స్థల మొక బోసుపెట్టెవలె నల్లనిదై బలిష్ఠమై యొప్పుచుండెను. కుస్తీపట్టుటకుముం దూపిరి తిత్తులనిండ గాలిని బూరించుసరికి మేని కండలు పూర్తిగా నుబ్బి శరీరపరిశ్రమను సువ్యక్త మొనరించెను. వీరిరువురును గొంతసేపు పోరాడిరి. అయిదునిమిషములకంటె నెక్కుడుకాలము చూపరు లాతురతతో నిరీక్షింపలేదు, పోరాటము ముగిసెను. రహీముయొక్క ప్రతిశక్తియును బలశాలియే యైనను రహీముచే నోటువడియెను. నిలువఁబడిన రహీము నిలిచినట్లుండఁగానే సునాయాసముగా రెండవవాడు నేలపైఁ బడియెను. అతఁడు మొగము నేలవేసి వెల్లకిల చాపచుట్టఁబడినట్లు నేలపైఁ బడినవెంటనే మల్లయుద్ధ మాఁపవలసినదని యాజ్ఞ యయ్యెను. వారిరువురును లేచి వెనుకకుఁ బోయిరి.

కొంచెముసేపుండినతరువాతఁ దిరిగి బాకా యూదినసన్నగైకొని గెలుకాండ్రిరువురును రంగము ప్రవేశించిరి. ఈపర్యాయము తొలుత గెలిచినవానిని వానిస్నేహితు లుత్సాహపూరితములగు సైగలతో మంచిమంచిసలహాలతోఁ బంపిరి. వారిరువురును కుస్తీ ప్రారంభించిరి గాని యదియెంతయో సేపు జరుగలేదు. ప్రథమావస్థతోనే రహీము తనశత్రువు నవలీలగాఁ బడఁగొట్టెను. ఈమహాద్భుతకార్యమును గాంచి చూపరులాశ్చర్యమగ్నమానసులైరి. ఎల్లరును వాని కౌశల్యమునకు నచ్చెరువంది యెంతయు నభినందించిరి. ఇంకెవ్వరును నాతనితోఁ బోరాడుటకు రాకుండుటచే నింకెందైనను నీకు నైపుణ్యమున్నయెడల నావిద్యను బ్రదర్శింపవలసినదని పాదుషా రహీ

మున కాన్పించెను. అంత నాతఁ డొకయిరువదడుగుల పొడవుకఱ్ఱను గైకొని సాముచేయ నారంభించెను. తిరుగునప్పుడు కఱ్ఱగాని మనుష్యుఁడుగాని చూపరులకుఁ గన్పింపకుండుటయేగాక, తిరుగుచున్న కఱ్ఱ యొక్క ఛాయ చంద్రునిచుట్టునుండు పరివేషమువలె, కదంబపుష్పమున కన్నిప్రక్కల గన్పట్టుచుండు కేసరములవలె, వానిచుట్టును గన్పడుచుండెను. కఱ్ఱలతోను కత్తులతోను నొనరింపవలసినసాములును, కేవల శరీరలాఘవమువలన భూమిపైని, అంతరాళమునందును నొనరించుపల్టీలును, లక్ష్యసాధనము లగువివిధకార్యములను నాతఁడు ప్రదర్శింపఁగాఁ జూచుచు జనులందఱును లుత్సాహపూరితములైన ధ్వనులు నొనరించినతరువాత నీకుస్తీలను నియమించుచు సరిగా నడపుచుండు నుద్యోగి బయటి కరుదెంచి, యీరహీముతో కుస్తీచేసి పోరాడించుటకు శక్తిగలవారెవరైన నున్న యెడల వారి కవకాశ మొసంగఁబడు నని సభయందు పెద్దపెట్టున నరచెను. సభవారందఱు నిశ్శబ్దముగా నేదిక్కునుండియైనను నెవ్వఁడైనను వచ్చుటకు సాహసించునో యని రెప్పవాల్పక చూచుచుండిరి. మొదటిపిల్పునకు సర్వదిశలనుండు నెలకొనియుండు మూకీభావమును, ఉద్వేగులైయుండు ప్రేక్షకుల హృదయచలనమును దప్ప మఱియేవిధమగునుత్తరమును లేకపోవుటచే నాయధికారి తిరిగి యాప్రశ్ననే రెట్టించెను. అతనిముఖమునుండి బయలుదేఱిన యాశబ్దముకోటగోడలకుఁ బోయి తిరిగి గాలిచేఁ గొనిరాఁబడి ప్రతిధ్వనిరూపమును దాల్చనే గాని జవాబు లేకపోయెను. కొంచెముసేపు మౌనము ధరించి యాతఁడు తిరిగి యాప్రశ్ననే వేసెను. మూఁడవప్రశ్న వేసినతరువాత నొక్కనిమిషము పూర్తికాకుండఁగనే, యొకసన్ననిపొడుగరి యగు మనుష్యుఁ డెక్కడనుండియో త్రోసుకొనుచుఁ బరువెత్తికొని వచ్చి నేనుంటి నని జవాబిచ్చెను. కూరుచుండియుండు జనులనడుమనుండియా

తఁడు దారిచేసికొనుచు ముందునకు వచ్చుచుండుటచే నాతనివ్యక్తియు ను, ముఖమునందుండు నాత్రమును, పరుగెత్తుకొని వచ్చుటవలనఁ బుట్టినయూపిరితిత్తులయొక్కయా వేగముచేఁగలిగినవక్షస్థలముయొక్క చలనమును, గలసి యెల్లరదృష్టిని నాతనిపై పె త్రిప్పునట్లొనరించెను. సాధారణముగా జనులు ప్రపంచమునందు "రూపమేవాస్యైతన్మహి మానంవ్యాచష్టె" యని చెప్పి రూపమువలననే లోనిశక్తిని గనుఁ గొన నెంతురు గావున, నక్కడనుండినవారందఱును నానూతన పురు షుని గాంచి యాతఁ డోడిపోవునని నిశ్చయించుకొనిరి. కాని యాతని ముఖవర్చస్సును, రూపమహిమయును ప్రేక్షకులహృదయములయం దనుకంపను గలిగించుటచే "పాప మీపిల్లకాయ వీనితో పోరాడి యపాయమును గాంచునేమో"యని చింతిల్లుచుండిరి. ఆతఁడు మెల్లగా కూరుచున్నజనులలో నుండి మార్గముఁ జేసికొనుచు రంగస్థలమునకు వచ్చి పాదుషా కభివాదన మొనరించెను. ఆతఁడును నీనూతనవ్యక్తిని గాంచి యిట్లు ప్రశ్నించెను.

చక్రవర్తి—చూడు మాతఁ డెంతబలశాలియో శరీరము గడి దేరి యేనుఁగుగున్నవలె నున్నాఁడు. నీకంటె నెన్నిరెట్లోబలముగలిగి యున్నవారినందఱిని నవలీలగ జయించెను. అట్టివానితో నీవుపోరాడి యపజయముఁ బొందుటయేగాక శరీరమునకుఁగూడ నేలయపాయము దెచ్చికొందువు? పాపము కోమలమైనశరీరము నేల బాధించెదవు?

నూతనపురుషుఁడు—మహాప్రభూ! తామిట్లానతిచ్చిన నేనేమి యనఁగలవాఁడను. నాపైఁ గొంచెము తమకనుగ్రహముండిన నాతఁడే కాదు? ఆతనికంటె బలశాలు లార్గురు వచ్చినను బోరాడుటకు సిద్ధముగ నున్నాఁడను. కేవల కాయస్థౌల్యమును, మూర్తియొక్కయు దాత్తతయును గాంచి భయపడుట క్షీరజనుల కసహజమని తమకుఁ దెలిసినదియేగదా! మహాబలసంపన్నమైనమత్తగజముతోఁ బో

రాజీ, దానిని సమతో పరాజయము కెరగాఁ జేయఁజాలిన పీనగవరులు తామ యథార్థముగ, గురుదేవా! సిద్ధ్యము చేగల శరీరాసత్త్వమును బట్టియే నిర్ణయించుటకు సాధ్యమగునా! కుస్తీచేయుటకు నాకనుజ్ఞ యిచ్చిన యెడల నేను నేర్చిన కుస్తీ నేర్పునఁ, శరీర పాటవమును జూపించి వాని నోడించుట కృత్రిమయత్నము నొనరింపఁగలను. పైని జయాపజయములు దైవాధీనములు'' అనియెను.

ఆమాటలు విని చక్రవర్తి యానూతన పురుషుని ధైర్యమునకును కార్యదీక్షకును లోపల సంతసించి యిట్లు జవాబిచ్చెను.

పాదుషా—నీవు కృతనిశ్చయుఁడవైన యెడల తిరుగ పోరాటము రేపుదయమున నారంభింపఁబడును. ఈదినము ఆలస్యమైనది.

చక్రవర్తి లేచి యభ్యంతరమందిరమున కేగినతోడనే గుంపంతయును జెదరి యెవరియిండ్లకు వారు పోవుటకు బయలుదేఱిరి. కుస్తీకి వచ్చిన వారందఱిని జయించి సర్వవిధములఁ దనసామర్థ్యము నెల్లఁ జూపించి రమస్నేహితుఁడు మహాగౌరవము నందవలసిన కాలమునకు సరిగాఁ గానకములోని పుల్లవలె నెక్కడనుండివచ్చెనొ వీఁడెవఁడురా! యని తలంచుచు రహీముస్నేహితు లందఱును నందు ముఖ్యముగా రామనాథుఁడును నితని నసూయాపూరితములైన చూపులతోఁ జూడ సాగిరి. జయము నందనతరువాత పాదుషా యొసంగిన బహుమానముతోఁ దన మిత్రుని బట్టణమంతయును వాద్యములతో నూరేగింప వలయునని యొక మేళమును బయట సిద్ధముగా నుంచిన రామనాథునకు, కొంచెమాశాభంగ మగుట తటస్థించెను. అయినను పుల్లవలె నున్న వీనిని రహీము సులభముగా బ్రక్కకుఁ ద్రోసివేయఁగలఁడను ధైర్యముతో వారందఱును ఆనాఁటి కొయుత్సవము నిలుపు చేసిరి. ప్రాణస్నేహితుఁడైన జయమందని మిత్రుని గురించి కలిగిన యసూయ కంప నశింపలేదు. అందుచే క్రొత్తస్నేహితుని రాగమును యూహింపవచ్చును.

నగఱుగాఁ జుడచముచున యథాకాలముఁ జెల్లచును వచ్చి చూచుచుండిరి. జనానాలోని దాసీలును, రాజకీయోద్యోగులును, నెక్కువ ప్రేక్షకులును గూడ సమావేశమైరి. చక్రవర్తి తన యుపాసనాదులను బూర్తిచేసికొని సభ నలంకరించెను. ఆ నూతనసన్యాసి కులనామములు గనుంగొనఁబడెను. పేరు చందనదాసు. కులము బ్రాహ్మణకులము. వయస్సు సుమా రిరువదియైదు సంవత్సరములు. కాపురం బాగ్రాకు నలువదిమైళ్ళ దూరమున నున్న పల్లెటూరు. విశాలమైన యాతని ముఖమును, కన్నులును, హృదయముపై శౌర్యమును దెలుపు సూచికలో యమున యుండెను. కాషాయవస్త్రములను ధరించి ముందువచ్చిన యాతని శరీరలావణ్య మంతయును మేఘప్రతిసీర వెల్వడి వచ్చుచుండు సుధామూర్తి కాంతివలె చూపరుల కన్నులఁగనపఁ గొనుచుండెను. చేతులు పొడుగై మోకాళ్ళవఱకును వ్రేలాడుచుండెను. రహీమువలె నతఁడు సౌకుమార్యము గలవాఁడు గాకున్నను తెల్లగాఁ బెరుగుటచే నేత్రప్రియమంగములైన పేటికండ లాతనికిఁ గల శరీరాటవమును కసరత్తును జెప్పక చెప్పుచుండెను. వారిరువురును ముఖాముఖి నిలువఁబడునప్పు డొక నల్లని పెద్దమంటిగోడ యిల్లునకు నిందొక చక్కని వెల్లవేసిన పెంకుటిల్లు మనస్సునకు వచ్చును. కారణ మేమియో గాని ద్రష్టలమనస్సు లన్నియు నాతనివైపునకే లాగఁబడుచుండెను. పాపము సంపంగిపూవువలె నున్న యాతఁ డెక్కడికిద్దవంటి రహీము హస్తములోఁ బడి కాలో చేయో విఱుగఁ గొట్టుకొనునేమో యని చూపరు లెంతయును భయమును జెందుచుండిరి. స్త్రీలమధ్యను పదునెనిమిది సంవత్సరములు వయస్సుగలిగిన యొక యువతి మాత్ర మాతనివైపు నిశ్చలములైన చూపులఁ బరపుచు నాతని మూర్తినే ధ్యానించుచున్నట్లుండెను. చేతులయందు సన్నని నగిషీపని యొనరించిన యొక్క మురుగులజతయును, మెడలో

నొక్క మంచిముత్యముల హారమును దప్ప సాధారణముగా హిందూ మహమ్మదీయ వనితలు ధరించుచుండు భూషణము లెవ్వియును నామె శరీరముచే వన్నెం దాల్చి యుండలేదు. ఆమెతోఁ గూడుచున్న స్త్రీలయం దనేకమహమ్మదీయ వనితలును హిందూయువతులును భూషణముల నపరిమితముగాఁ దాల్చియుండిరి. రంగురంగుల చీరలఁ దాల్చిరి. కాని యీతరుణి మాత్రము పెద్దజరీకొంగు గల తెల్లనిచీరఁ ధరించి తన హృదయనైర్మల్యమును, నిష్కాపట్యమును, పవిత్రతయును జాటుచున్న దేమో యన్నట్లుండెను. జాతులను గుర్తించుట బట్టలకట్టును బట్టిగాని, ధరించు భూషణముల నాధారము చేసికొనిగాని, మాటలాడు భాషామూలమునగాని, మన మొనరించుచుండుట కలవాటుపడుట తప్ప పరమేశ్వరుఁ డాయాజాతి వ్యక్తులయందు శాశ్వతమయి, సహజమైన చిహ్నముల నుంపక పోవుటవలన మనమా స్త్రీ యేజాతికి జేరినదో తెలిసికొనుటదుర్ఘటము. ఆ స్త్రీరత్నములగనిలోఁ గొందఱు బ్రాహ్మణజాతి యనియును, గొందఱు తదితరజాతులకుఁ జేరినవారనియును వేషముచేతనే మనము గ్రహింపవచ్చును గాని కొందఱుమాత్ర మేవంగడమువారో తెలిసికొనుటకు వీలుగాదు. ఈమెశరీరము జ్యోతిర్లతవలె ప్రకాశించుచుండెను. పూర్ణవికాసమును బొంది యనేక పత్రసహితమైన కదళీతరువువలె నావిలాసవతి కన్నుల కింపుగా నుండెను. కన్నులు ముత్తెపుచిప్పలవలె తెల్లనై విశాలములై గంభీరముగా నుండెను. ముక్కుకొంచెమెత్తుగానుండి జ్ఞానవృద్ధిని సూచించుచున్నది. ఆమెకుఁ జందనదాసనుగాంచినప్పటినుండియును మనస్సునం దిదివఱ కెఱుఁగని యొక నూతనభావ ముప్పతిల్లి యాతని జయాపజయములయం దుత్సాహ విచారములు గలుగునట్లు చేసెను.

మల్లయుద్ధమున కనుజ్ఞ యొసంగినవెంటనే వారిరువురును రంగస్థలమునఁ గుస్తి నారంభించిరి. మొదటి రెండునిముషములలో

రహీముయొక్క పదాఘాతమునకో హస్తలాఘవమునకో యీలేఁత మొక్క యాహుతియైపోవక తప్పదన్నవారల యభిప్రాయములు కొంచెము కొంచెముగా మాఱఁజొచ్చెను. చందనదాసు పొడగఁ యగుటచే కొంచెము మాగమున నుండి రహీమును బట్టుకొనఁగలిగెను. తనకంటెఁ గొన్నివిధముల స్వాభావికసదుపాయములుగల వానితో పోరాటము సలుపవలసివచ్చె నని రహీము గుర్తించెను. ఏనుఁగంతటివాఁ డగురహీము నమాంతముగా నెత్తి నేలపైఁ జందనదాసు విసరివైచెను గాని యాతఁడుమాత్రము క్రిందఁ బడకుండ చెంగున రబ్బరుబంతివలెఁ దూలి నిలువంబడి యుండుటచే సభయంతయు నిరావేశమునుజెంది యత్యాశ్చర్యమగ్నమానసులై నిద్రాకుతూహలులై యుండిరి. వారిరువురును సుమారొక యరగంటకాలము పోరాడినను గూడ పర్యవసానము తేలక యొకసారి రహీము గెలువఁగలఁడనియు నింకొకసారి చందనదాసే గెలువఁగలఁడనియు, ప్రేక్షకుల యభిప్రాయములు సముద్రతరంగములవలె డోలాయమానములై యుండెను. వారొనరించుచుండిన బాహాబాహియుద్ధమునం దెట్లుపడిరో గాని యిరువురును గట్టకట్టికొని యొక్కసారిగా నేలపైఁబడిరి. అట్లుండి యెవ్వ రేమేమి యొనర్చిరో సభ్యు లెవ్వరును గుర్తెఱుఁగఁజాలనంత వేగముగాఁ బోరాడిరి. తుట్టతుదకెట్లు పడెనో రహీము నేలపై వెల్లకిలఁ బడిపోగా నాతనిపైఁ జందనదాసు కూరుచుండెను. వెంటనే పోరు నాఁపుటకు బాకా యూదిరి. వారిరువురును లేచి నిలువఁబడిరి. రహీముముఖ మంతయును నవమానముచేతను వలెనే ధూళిచేతను స్వేదముచేతను గప్పివేయఁబడెను. రహీముమిత్త్రులగు గ్రామనాథుఁడు మొదలగువార లందఱును మొగములు వ్రేలవేసికొనిరి. జనానాలోని స్త్రీల మొగము లన్నియును సంతోషపూరితములయ్యెను. సభవారిముఖమున నభినందనములు చిఱునవ్వులతో మొల

కలిగెను. చందనదాసును గాంచుచు స్త్రీలలో గూరుచుండిన యా పదునెన్మిది సంవత్సరముల వయసుగల తన్వియొక్క హృదయము నుండి యొకభారము తొలఁగింపఁబడుటవలన సులభముగా నిశ్వసించెను.

చందనదాసును గాంచి పాదుషా 'ఇంకేమైన నీవు నేర్చియుంటివా' యని ప్రశ్నించెను. దానికి బదులుగా నాతఁడొక కత్తినిగొని దానితో రహీమువలెనే సాము చేసెను గాని, యాతఁడు సామునొనరించునప్పుడు తనప్రక్కనుండువారు నలుదిక్కులనుండి విసరుచుండు నిమ్మపండ్లన్నియును రెండురెండుఖండములుగా తెగి పడిపోవుచుండెను. తనశరసంధానకౌశలమును, బాణవిసర్జనమునందలిశక్తిని జూపించుటకై యొకనిమ్మపండును దీసికొని పైనొక బంగారునాణెము నిలిపి, శరముచే నా నాణెమును నిమ్మపండునకు హానిలేకుండునట్లు రెండుగా ఖండించెను. అత్యద్భుతమైన యాతనిశక్తి నందఱును వేనోళ్ళఁ గొనియాడిరి. పాదుషా వానికౌశలమును మెచ్చుకొనెను.

రహీముమాత్రము నిస్పృహతో వెనుకకుఁ బోయి తనవారలలో తల వాల్చుకొని కూరుచుండెను. అక్బరు నాజ్ఞచే నాతఁడు గూడ రంగస్థలమునకు బిలువఁబడెను. చందనదాసు రహీము లిరువురు తమతమ దుస్తులను ధరించి పేటాలను జుట్టుకొని ముందునకు వచ్చి నిలువఁబడిరి. సువర్ణమయమైన యొకపతకముతోఁ గూడిన యొక మెడగొలుసును పాదుషా చందనదాసునకు బహుమానమొసంగెను. రహీమునుగూడ తగినట్లు బహూకరించి యోటమి వచ్చినను దగినట్లు పనిచేసియుండె నని యెంతయుఁ బ్రశంసించెను. తరువాత వారికుద్యోగమునం దిష్టముండినయెడల సైనికోద్యోగము లీయఁబడు ననియును తెలుపఁబడెను. మహానందముతో వారిరువురును వల్లె యనుటచే నొక మనసబ్దారుక్రింద చెఱినూర్గురు సైనికులకు నధికారులుగా

నియమింపఁబడిరి. వీరిరువురును సైనికులకుఁ గావలసిన తరిఫీదు నొక నెలదినములు పొందినతరువాతఁ దమ యుద్యోగములను స్వీకరింప వలసినది. ఇరువురును సమానముగ గౌరవింపఁబడుటచే సభయందలి వారందఱును సంతుష్టాంతరంగులైరి. సాహసానంబడి నందఱును లేచి పోవుచుండఁగా నాబులోసైజీయను నాస్తానకవీంద్రుఁడు రేవుదయ మొకసారి తన్నుఁజూచిపొమ్మని చందనదాసునకుఁ గబురంపెను.

ఇదివఱకు స్త్రీలలో ముఖ్యముగా చందనదాసునం దనుకంప గలిగినయువతి సైజీతోఁ గలసి యొకగుఱ్ఱపుబండి నెక్కి పోవుచుండెను. దారిలో వారిరువురకును వివిధముగ సంభాషణ జరిగెను.

సైజీ—పహామీనాదా! నీవు చందనదాసను గెలిచిన పురుషుని గాంచి యుంటివి గదా! వానిగుఱించి నీయభిప్రాయ మేమి?

పహామీనాదా—ఆతఁడు మంచి విద్వాంసుఁడని ముఖవర్చస్సును బట్టి తోఁచుచున్నది.

సైజీ—అవును - లెస్సగా నూహించితివి. నీయభిప్రాయమే నాకును గలదు. ఆతఁ డిట్టిసామర్థ్యము నెట్లు సంపాదించెనో తెలియ కున్నది. ఆకారణముననే యాతనిజన్మాదిక మెట్టిదో పాండిత్య మెట్టిదో కనుఁగొనుటకు రేపు రమ్మని వర్తమాన మంపితిని" అని చెప్పెను.

ఆమాట వినినతోడనే పహామీనాదాకు గుండెలో మరల దడ ప్రారంభించెను. "సరే" యని మాత్రము జవాబిచ్చెను. అంతటితో సంభాషణ యంతమొందెను. గృహముఁ జేరువఱకును నింకొకమాట లేకుండ నిశ్శబ్దముగా వారిరువురును బండిలో ప్రయాణమొన రించిరి.

"మహాప్రభూ! ఇంతమంది వచ్చియునుగూడ ముందు నిలిచిన వలు: రితోఁ బోరాడఁజాల కమునధైర్యముచే వారందఱును నిలిచిపోయిరి. వీరిలో నొక మహమ్మదీయవీరుఁడు, 'రహీమ్' అనువాఁడు దుర్వారుణసంపన్నుఁడగుటచే సింకఁ జాలమంది వానిపేరు విని భయపడి పోయిరి." ఈమాట వినిన వెంటనే మాటిమాటికి బాకా యూఁదబడెను. ముందునిలిచిన వస్తాదులలోను నొక యిరువురు వెంటనే రంగస్థలములోనికివచ్చి నిలువఁబడిరి. వారిరువురును గుస్తీ కసుకూల మగునట్లు నాభి మొదలు మోకాళ్లవఱకును నొప్పు చల్లడమును, కాసెకోకను మాత్రమే ధరించి యుండిరి. రంగస్థలమున కరుగుదెంచినతోడనే బాదుషాకు సలాముచేసి వారుభయులును నొకరి నొకరదేవిధముగా గౌరవించుకొని యొకరిహస్తము నింకొకరు పట్టుకొని కుస్తీకిఁ బ్రారంభించిరి. చేయియు చేయియు కలిపిన వెంటనే వారొకరి నొకరు లాగి క్రిందఁ బడవేయుటకుఁ బ్రయత్నించిరి గాని పట్టు జాఱిపోవుటవలన మరల చేతులు రెండును గలిపిరి. ఇంతలో నొకఁడు కుడిచేయినందించి వానిని లాగివేయుటకు బ్రయత్నించుచుండఁగా రెండవవాఁడు చక్రము తిరిగినట్లు తిరిగి కాలుతో మండకొట్టెను. దానికి కాలువిరిగి గాని మడతపడిగాని యాతఁడు పడిపోవు నని యందఱనుకొనుచుండఁగా వాఁడు పడిపోవు మన్నట్లే తోఁచునంతటి క్రిందకు వంగి యాతని కాలు పట్టుకొని లాగివేసెను. కాని యాతఁడు మహావేగముతోఁ దనకాలును విడిలించుకొనియెను. ఇట్లిరువురును హస్తలాఘవములను బాదలాఘవములను బ్రదర్శించుచు కొంతసేపు యుద్ధ మొనర్చినతరువాత వారిలో మొదటివాఁడు క్రిందఁబడియెను. వెంటనే పాగాధరించినయాయుద్యోగి వారి పోరాట మాఁపివేయుట కొకబాకా నూదఁగానే వారిరువురును రంగస్థలమువీడి వెనుకకు మరలిరి. మరల నాతఁడు తనగా—

మిగిలిన యిరువురును బోరాడుటకు రంగస్థలములోనికి వచ్చిరి. వీరిలో మనకు పరిచితుఁడగు రహీ ముండెను. రహీము మిక్కిలిబలశాలి నల్లని దృఢకాయము గలవాఁడు. శరీరము భాగముగానున్న నుదురు కుదనమునకు లోటు లేనివాఁడు. విశేషము పొడగరి కాఁడు. అతని వక్షస్స్థల మొకబోనుపెట్టినట్లె నల్లనిదై బలిష్ఠమై యొప్పుచుండెను. కుస్తీపట్టుటకుముం దూపిరితిత్తులనిండ గాలిని బూరించుసరికి మేని కండలు పూర్తిగా నుబ్బి శరీరపరిమాణము సువ్యక్త మొనరించెను. వీరిరువురును గొంతసేపు పోరాడిరి. అయినను నిమిషములకంటె నెక్కుడుకాలము చూపరు లాత్రముతో నిరీక్షింపలేరు. పోరాటము ముగిసెను. రహీముయొక్క ప్రతిపక్షియును బలశాలియే యైనను రహీముచే నోటువడియెను. నిలువఁబడిన రహీము నిలిచినట్లుండఁగానే సునాయాసముగా రెండవవాఁడు నేలపైఁ బడియెను. అతఁడు మొగము తేలవేసి వెల్లకిల చాపచుట్టబడినట్లు నేలపైఁ బడినవెంటనే మల్లయుద్ధ మాఁపవలసినదని యాజ్ఞ యయ్యెను. వారిరువురును లేచి వెనుకకుఁ బోయిరి.

కొంచెముసేపుండినతరువాతఁ దిరిగి బాకా యూదినసన్నగైకొని గెలుకాండ్రిరువురును రంగము బ్రవేశించిరి. ఈపర్యాయము తొలుత గెలిచినవానిని వానిస్నేహితు లుత్సాహపూరితములగు సైగలతో మంచిమంచిసలహాలతోఁ బంపిరి. వారిరువురును గుస్తీ బ్రారంభించిరి గాని యదియెంతయూ సేపు జరుగలేదు. ప్రథమావస్థతోనే రహీము తనశత్రువు నవలీలగాఁ బడఁగొట్టెను. ఈమహాద్భుతకార్యమును గాంచి చూపరులాశ్చర్యమగ్నమానసులైరి. ఎల్లరును వాని కౌశల్యమునకు నచ్చెరువంది యెంతయు నభినందించిరి. ఇంకెవ్వరును నాతనితోఁ బోరాడుటకు రాకుండుటచే నింకెందైనను నీకు నైపుణ్యమున్నయెడల నావిద్యను బ్రదర్శింపవలసినదని పాదుషా రహీ

మున కాన్పించెను. అంత నాతఁ డొకయాఱడుగుల పొడవుకఱ్ఱను గైకొని సాముచేయ నారంభించెను. తిరుగునప్పుడు కఱ్ఱగాని మనుష్యుఁడుగాని చూపరులకుఁ గన్పింపకుండుటయేగాక, తిరుగుచున్నకఱ్ఱయొక్క ఛాయ చంద్రునిచుట్టునుండు పరివేషమువలె, కదంబపుష్పమున కన్నిప్రక్కల గన్పట్టుచుండు కేసరములవలె, వానిచుట్టును గన్పడుచుండెను. కఱ్ఱలతోను కత్తులతోను నొనరింపవలసినసాములును, కేవల శరీరలాఘవమువలన భూమిపైని, అంతరాళమునందును నొనరించుపల్టీలును, లక్ష్యసాధనము లగువివిధకార్యములను నాతఁడు ప్రదర్శింపఁగాఁ జూచుచు జనులందఱును ఉత్సాహపూరితములైన ధ్వనులు నొనరించునతరువాత సేకుస్త్రీలను నియమించుచు సరిగా నడుపుచుండు ఉద్యోగి బయటికరుదెంచి, యీరహీముతో కుస్తీచేసి యోడించుటకు శక్తిగలవారెవరైన నున్న యెడల వారి కవకాశ మొసంగఁబడు నని సభయందు పెద్దపెట్టున నరచెను. సభవారందఱు నిశ్శబ్దముగా నేదిక్కునుండియైనను నెవ్వఁడైనను వచ్చుటకు సాహసించునో యని రెప్పవాల్పక చూచుచుండిరి. మొదటిపిల్పునకు సర్వదిశలయందు నెలకొనియుండు మూకీభావమును, ఉద్వేగులై యుండు ప్రేక్షకుల హృదయచలనమును దప్ప మఱియేవిధమగునుత్తరమును లేకపోవుటచే నాయధికారి తిరిగి యాప్రశ్ననే రెట్టించెను. ఆతనిముఖమునుండి బయలుదేఱిన యాశబ్దముకోటగోడలకుఁ బోయి తిరిగి గాలిచేఁ గొనిరాఁబడి ప్రతిధ్వనిరూపమును దాల్చెనే గాని జవాబు లేకపోయెను. కొంచెముసేపు మౌనము ధరించి యాతఁడు తిరిగి యాప్రశ్ననే వేసెను. మూఁడవప్రశ్న వేసినతరువాత నొక్కనిమిషము పూర్తికాకుండఁగనే, యొకసన్ననిపొడుగరి యగు మనుష్యుఁ డెక్కడనుండియో రొజుకొనుచుఁ బరువెత్తికొని వచ్చి నేనుంటి నని జవాబిచ్చెను. కూరుచుండియుండు జనులనడుమనుండియా

తఁడు దారిచేసికొనుచు ముందునకు వచ్చుచుండుటచే నాతనివ్యక్తియు ను, ముఖమునందుండు నాత్రమును, పరుగెత్తుకొని వచ్చుటవలనఁ బుట్టినయూపిరితిత్తులయొక్కయా వేగముచేఁ గలిగినవక్షఃస్థలముయొక్క చలనమును, గలసి యెల్లరదృష్టిని నాతనివైపె త్రిప్పునట్లొనరించెను. సాధారణముగా జనులు ప్రపంచమునందు "రూపమేవాస్యైతన్మహిమానంవ్యాచష్టే" యని చెప్పి రూపమువలననే లోనిశక్తిని గనుఁగొన నెంతురు గావున, నక్కడనుండినవారందఱును నానూతన పురుషుని గాంచి యాతఁ డోడిపోవునని నిశ్చయించుకొనిరి. కాని యాతని ముఖవర్చస్సును, రూపమహిమయును ప్రేక్షకులహృదయములయం దనుకంపను గలిగించుటచే "పాప మీపిల్లకాయ వీనితో పోరాడి యపాయమును గాంచునేమో" యని చింతిల్లుచుండిరి. అతడు మెల్లగా కూరుచున్నజనులలో నుండి మార్గముఁ జేసికొనుచు రంగస్థలమునకు వచ్చి పాదుషా కభివాదన మొనరించెను. అతఁడును నీనూతనవ్యక్తిని గాంచి యిట్లు ప్రశ్నించెను.

చక్రవర్తి—చూడు మాతఁ డెంతబలశాలియో. శరీరము గడిదేరి యేనుఁగుగున్నవలె నున్నాఁడు. నీకంటె నెన్నిరెట్లోబలముగలిగి యున్నవారినందఱిని నవలీలగ జయించెను. అట్టివానితో నీవుపోరాడి యపజయముఁ బొందుటయేగాక శరీరమునకుఁగూడ నేలయపాయము దెచ్చికొందువు? పాపము కోమలమైనశరీరము నేల బాధించెదవు?

నూతనపురుషుఁడు—మహాప్రభూ! తామిట్లానతిచ్చిన నేనేమి యనఁగలవాఁడను. నాపైఁ గొంచెము తమకనుగ్రహముండిన నాతఁడే కాదు? ఆతనికంటె బలశాలు లార్గురు వచ్చినను బోరాడుటకు సిద్ధముగ నున్నాఁడను. కేవల కాయస్థూల్యమును, మూర్తియొక్కయు దాత్తతయును గాంచి భయపడుట శూరులకు సహజమని తమకుఁ దెలిసినదియేగదా! మహాబలసంపన్నమైనమత్తమాతంగముతోఁ బో

గుంపులుగా నుపవనమున యథాకాలమున కెల్లరును వచ్చి కూర్చుండిరి. జనసామాన్యులును, రాజకీయోద్యోగులును, దక్షిణ ప్రేక్షకులును గూడ సభాభవనముఁ జేరిరి. చక్రవర్తి తన యుపాసనాదులను బూర్తిచేసికొని సభ నలంకరించెను. ఆ నూతనవ్యక్తుల నామములు గనుంగొనఁబడెను. పేరు చందనదాసు, కులము బ్రాహ్మణ కులము. వయస్సు సుమా రిరువదియైదు సంవత్సరములు. కాపుర గ్రామము నలువదిమైళ్ళ దూరమున నున్న కిష్టెటూరు. విశాలమైన యాతని ముఖమును, కన్నులును, హృదయనైర్మల్యమును దెలుపు సూచికలై యున్నట్లుండెను. శుభ్రవస్త్రములను ధరించి ముందునకు వచ్చిన యీతని శరీరలావణ్య మంతయును మేఘప్రతిసీర వెల్వడి దృగ్గోచరుఁ డగు సుధామూర్తి కాంతివలె సభాసదుల కన్నుంగవకుఁ దోఁచుచుండెను. చేతులు పొడుగై సూక్ష్మవలయమును వ్రేలాడు చుండెను. రక్తిమమునవలె నతి సూక్ష్మములుగా నున్నను తెల్లగాఁ బెరుగుటచే నేత్రప్రసాదములైన మేలికండ లాతనికిఁ గల శరీర పాటవమును కనఁబరచును చెప్పక చెప్పుచుండెను. వారిరువురును ముఖాముఖి నిలువఁబడునప్పు డొక నల్లని పెద్దమంటిగోడ యిల్లునకు ముందొక చక్కని వెల్ల వేసిన పెంకుటిల్లు మనస్సునకు వచ్చును. కారణ మేమియో గాని ద్రష్టలమనస్సు లన్నియు నాతనివైపునకే లాగఁబడుచుండెను. పాపము సంపంగిపూవువలె నున్న యీతఁ డుక్కుకడ్డవంటి రహీము హస్తములోఁ బడి కాలో చేయో విఱుగఁ గొట్టుకొనునేమో యని చూపరు లెంతయును భయముఁ జెందు చుండిరి. స్త్రీలమధ్యను పదునెన్మిది సంవత్సరములు వయస్సుగలిగిన యొక యువతి మాత్ర మాతనివైపు నిశ్చలములైన చూపులఁ బరపుచు నాతని మూర్తినే ధ్యానించుచున్నట్లుండెను. చేతులయందు కన్నని వరుసిషని యొనరించిన యొక్క మురుగులజతయును, మెడలో

నొక్క మంచిముత్యముల హారమును దప్ప సాధారణముగా హిందూ మహమ్మదీయ వనితలు ధరించుచుండు భూషణము లేవియును నామె శరీరముచే వన్నెం దాల్చి యుండలేదు. ఆమెతోం గూడుచున్న స్త్రీలయం దనేకమహమ్మదీయ వనితలును హిందూయువతులును భూషణముల నపరిమితముగాం దాల్చియుండిరి. రంగురంగుల చీరలం దాల్చిరి. కాని యీతరుణి మాత్రము పెద్దజరీకొంగు గల తెల్లనిచీరం ధరించి తన హృదయనైర్మల్యమును, నిష్కాపట్యమును, పవిత్రతయును జాటుచున్నదేమో యన్నట్లుండెను. జాతులను గుర్తించుట బట్టలకట్టును బట్టిగాని, ధరించు భూషణముల నాధారము చేసికొనిగాని, మాటలాడు భాషమూలమునగాని, మన మొనరించుచుండుట కలవాటుపడుట తప్ప పరమేశ్వరుం డాయాజాతి వ్యక్తులయందు శాశ్వతమయి, సహజమైన చిహ్నముల నుంపక పోవుటవలన మనమా స్త్రీ యేజాతికి జేరినదో తెలిసికొనుటదుర్ఘటము. ఆ స్త్రీరత్నములగనిలోం గొందఱు బ్రాహ్మణజాతి యనియును, గొందఱు తదితరజాతులకుం జేరినవారనియును వేషముచేతనే మనము గ్రహింపవచ్చును గాని కొందఱుమాత్ర మేవంగడమువారో తెలిసికొనుటకు వీలుగాదు. ఈమెశరీరము జ్యోతిర్లతవలె ప్రకాశించుచుండెను. పూర్ణవికాసమును బొంది యనేకపత్రసహితమైన కదళీతరువువలె నావిలాసవతి కన్నుల కింపుగా నుండెను. కన్నులుముత్తెపుచిప్పలవలె తెల్లనై విశాలములై గుండ్రముగా నుండెను. ముక్కుకొంచెమెత్తుగానుండి జ్ఞానవృద్ధిని సూచించుచున్నది. ఆమెకుం జందనదాసునుగాంచినప్పటినుండియును మనస్సునం దిదివఱకెఱుంగని యొక నూతనభావ ముప్పతిల్లి యాతని జయాపజయములయం దుత్సాహవిచారములు గలుగునట్లు చేసెను.

మల్లయుద్ధమున కనుజ్ఞ యొసంగినవెంటనే వారిరువురును రంగస్థలమునం గుస్తీ నారంభించిరి. మొదటి రెండునిముషములలోనే

రహీముయొక్క పదాఘాతమునకో హస్తలాఘవమునకో యీ లేఁత మొక్క యాహుతియైపోవక తప్పదన్నవారల యభిప్రాయములు కొంచెము కొంచెముగా మాఱఁజొచ్చెను. చందనదాసు పొడగరి యగుటచే కొంచెము మూలమునుండి రహీమును ద్రొబ్బికొనఁ గలిగెను. అనగఁ జేఁ గొన్నివిధముల స్వాభావికసదుపాయములుగల వానితో పోరాటము సలుపవలసివచ్చె నని రహీము గుర్తించెను. ఏనుఁగంతటివాఁడగు రహీము నమాంతముగా నెత్తి నేలపైఁ జందనదాసు విసరివైచెను గాని యాతఁడు మాత్రము క్రిందఁబడకుండ చెంగున రబ్బరుబంతివలెఁ దూలి నిలువంబడి యుండుటచే సభయంతయు తీరావేశము జెంది యత్యాశ్చర్యమగ్నమానసులై విద్యుచ్ఛోకషూహాలులై యుండిరి. వారిరువురును సుమారొక యరగంటకాలము పోరాడినను గూడ పర్యవసానము తేలక యొకసారి రహీము గెలువఁగలఁడనియు నింకొకసారి చందనదాసే గెలువఁగలఁడనియు, ప్రేక్షకుల యభిప్రాయములు సముద్రతరంగములవలె డోలాయమానములై యుండెను. వారొనరించుచుండిన బాహాబాహియుద్ధమునం దొల్లపడి గాని యిరువురును గట్టకట్టకొని యొక్కసారిగా నేలపైఁ బడిరి. అట్లుండి యెవ్వ రేమేమి యొనర్చిరో సభ్యు లెవ్వరును గుర్తెఱుఁగఁ జాలనంత వేగముగాఁ బోరాడిరి. తుట్టతుదకెట్లు పడెనో రహీము నేలపై వెల్లకిలఁ బడిపోగా నాతనిపైఁ జందనదాసు కూరుచుండెను. వెంటనే పోరు నాఁపుటకు బాకా యూదిరి. వారిరువురును లేచి నిలువఁబడిరి. రహీముముఖ మంతయును నవమానముచేతనువలెనే ధూళిచేతను స్వేదముచేతను గప్పివేయఁబడెను. రహీముమిత్త్రులగు రామనాథుఁడు మొదలగువార లందఱును మొగములు ప్రేలవేసికొనిరి. జనానాలోని స్త్రీల మొగము లన్నియును సంతోషపూరితము లయ్యెను. సభవారిముఖను లభినందనములు జేజునవ్వులతో మొల

కోరెను. చందనదాసును గాంచుచు స్త్రీలలో గూరుచుండిన యూ పదునెన్మిది సంవత్సరముల వయసుగల తన్వియొక్క హృదయము నుండి యొక భారము తొలగింపఁబడుటవలన సులభముగా నిశ్వసించెను.

చందనదాసును గాంచి పాదుషా 'ఇంకేమైన నీవు నేర్చియుంటివా' యని ప్రశ్నించెను. దానికి బదులుగా నాతఁడు యొకకత్తినిగొని దానితో రహీమునకతనే సాము చేసెను గాని, యాతఁడు సామునొనరించునప్పుడు తన ప్రక్కనుండువారు నలుదిక్కులనుండి విసరుచుండు నిమ్మపండ్లన్నియును రెండు రెండుఖండములుగా తెగి పడిపోవుచుండెను. తనశరసంధానకౌశలమును, బాణవిసర్జనమునందలిశక్తిని జూపించుట కొకనిమ్మపండును దీసికొని పైనొక బంగారునాణెము నిలిపి, శరముచే నా నాణెమునకు నిమ్మపండునకు హానిలేకుండునట్లు రెండుగా ఖండించెను. అత్యద్భుతమైన యాతనిశక్తి నందఱును వేనోళ్ళఁ గొనియాడిరి. పాదుషా వానికౌశలమును మెచ్చుకొనెను.

రహీముమాత్రము నిస్పృహతో వెనుకకుఁ బోయి తనవారలలో తల వాల్చుకొని కూరుచుండెను. అక్బరు నాజ్ఞచే నాతఁడు గూడ రంగస్థలమునకు బిలువఁబడెను. చందనదాసు రహీము లిరువురును తమతమ దుస్తులను ధరించి పేటాలను జుట్టుకొని ముందునకు వచ్చి నిలువఁబడిరి. సువర్ణమయమైన యొకపతకముతోఁ గూడిన యొక మెడగొలుసును పాదుషా చందనదాసునకు బహుమాన మొసంగెను రహీమునుగూడ తగినట్లు బహూకరించి యోటమి వచ్చినను దగినట్లు పనిచేసియుండె నని యెంతయుఁ బ్రశంసించెను. తరువాత వారికుద్యోగమునం దిష్టముండినయెడల సైనికోద్యోగము లీయఁబడు ననియును తెలుపఁబడెను. మహానందముతో వారిరువురును వల్లె యనుటచే నొక మనసబ్‌దారుక్రింద చెఱినూర్గురు సైనికులకు నధికారులుగా

నియమింపఁబడిరి. వీరిరువురును సైనికులకుఁ గావలసిన తరిఫీదు నొక నెలదినములు పొందినతరువాతఁ దమ యుద్యోగములను స్వీకరింప వలసినది. ఇరువురును సమానముగ గౌరవింపఁబడుటచే సభయందలి వారందఱును సంతుష్టాంతరంగులైరి. పాదుషా వెంబడి నందఱును లేచి పోవుచుండఁగా నాబుల్‌సైజీయను నాస్థానకవీంద్రుఁడు రేపుదయ మొకసారి తన్నుఁ జూచిపొమ్మని చందనదాసునకుఁ గబురంపెను.

ఇదివఱకు స్త్రీలలో ముఖ్యముగా చందనదాసునం దనుకంప గలిగినయువతి సైజీతోఁ గలసి యొక గుఱ్ఱపుబండి నెక్కి పోవుచుండెను. దారిలో వారిరువురకును వివిధముగ సంభాషణ జరిగెను.

సైజీ—పహ్మీదా! నీవు చందనదాసను గెలిచిన పురుషుని గాంచి యుంటివి గదా! వానిగుఱించి నీయభిప్రాయ మేమి?

పహ్మీదా—ఆతఁడు మంచి విద్వాంసుఁడని ముఖవర్చస్సును బట్టి తోఁచుచున్నది.

సైజీ—అవును - లెస్సగా నూహించితివి. నీయభిప్రాయమే నాకును గలదు. ఆతఁ డిట్టిసామర్థ్యము నెట్లు సంపాదించెనో తెలియకున్నది. ఆ కారణముననే యాతనిజన్మాదిక మెద్దియో పాండిత్య మెద్దియో కనుఁగొనుటకు రేపు రమ్మని వర్తమాన మంపితిని" అని చెప్పెను.

ఆ మాట వినినతోడనే పహ్మీదాకు గుండెలో మరల దడ ప్రారంభించెను. "సరే" యని మాత్రము జవాబిచ్చెను. అంతటితో సంభాషణ యంతమొందెను. గృహముఁ జేరువఱకును నింకొకమాట లేకుండ నిశ్శబ్దముగా వారిరువురును బండిలో ప్రయాణమొనరించిరి.

. . .

## మూఁడవ ప్రకరణము.

### అబుల్ ఫైజీ.

పూర్వప్రకరణమునం దబుల్ ఫైజీయను పురుషుఁడును పహామీదా. యనుస్త్రీయును గలసి యింటికిఁ బోవుచున్నట్లు వివియున్నాము. అక్బరు సంస్థానమునందు నూటయేఁబదిముగ్వురు కవీశ్వరు లుండిరి. ఆకవీశ్వరులలో నబుల్ ఫైజీ ముఖ్యుఁడు. ఈతనితండ్రి షేకుముబారక్ మహాభక్తుఁడై మహమ్మదీయ మతసంబంధ మగుజ్ఞానమున నడచుచుండెడు గ్రంథభాండాగార మని పేరువడసినవాఁడు. మొట్టమొదట మహమ్మదీయమతమందలి సునీపథములోనివాఁడై, తరువాత షియాపథమును స్వీకరించి యాగ్రాపట్టణమునం దధ్యాపకపదవిలోనుండి షేకుముబారకు మంచికీర్తిని గడించెను. ఆతనికి 1547 వ సం॥ అబుల్ ఫైజీ యను కుమారుఁడు పుట్టెను. మతసంస్కరణాభిలాషి యగుటచే, షేకుముబారకును మతగురువులందఱును గలసి బహిష్కరించి దేశమునుండి పాఱఁద్రోలిరి. కాని యాతనిపుత్రు లగుఫైజీ ఫాజలు లచ్చట నేనిలిచి యుండిరి. వారిరువురియందును ఫైజీ విఖ్యాతుఁ డగుకవి. సాహిత్యమునందు విశేషము ప్రీతి దాల్చి, కవిత్వము ప్రపంచమున కాహ్లాదము కలిగించుననువిషయము నెఱిఁగి, సర్వదా కవులను బ్రోత్సహించుచు, వారొనరించుచుండువాదములం దగిలియుండి, తానును మహాకవియై, యాంధ్రసారస్వతమున నసదృశమైన యాముక్తమాల్యదను రచించి, పెద్దనాదులచే మనుచరిత్రాదిమహాకృతులకుభర్తయై, యాంధ్రవాక్సతి నిరత ముచ్చరించుమహాకవినామములలోఁ దననొకనామ మగునట్లొనరించి, శాశ్వతయశస్సాంద్రుఁడై శ్రీకృష్ణదేవరాయలు దక్షిణహిందూస్థానమునఁ బరమపదించినయనంతర స్వల్పకాలమున నుత్తరహిందూస్థానమున నక్బరుచంద్రుఁడు రాజ్యమునకు భర్తయైకవి

చకోరంబుల రక్షించుచుండుటచే నబుల్ ఫైజీ యాతని యొద్దఁ జేరుట తటస్థించెను. అక్బరునాస్థానమున మహోద్యోగులతోఁ బాటు కవులకును నసమానమగు సన్మానము జరుగుచుండెను. అబుల్ ఫైజీకి "ఖొరాన్, సునా" యను మహమ్మదీయమతగ్రంథములు కంఠస్థములై యుండుటయేగాక, పారసీకము, అరబ్బీ, టర్కీ, ఉరుదు, హిందూస్థానీభాషలు భాషలలోని గ్రంథములును మంచినీళ్ళప్రాయములై యుండెను. దీనికితోడు, బ్రాహ్మణవేషమునఁ గొంతకాలము కాశీయందొక పండితునికడ శాస్త్రములఁ బఠించుటచే, సంస్కృతమునందును నితనికి పాండిత్యము లభించెను. తండ్రి ప్రథమమున నుండిన సున్నిపథమును తరువాతఁ జేసినషియాపథమునుగూడ నితఁడు విమర్శించి యారెంటిని విడచి మూఁడవదైన సూఫీపథమునందుఁ జేరెను. ఈతఁడు పెంచుచుండిన చెట్టునందును, పారుచుండిన నీటియందును, నచేతనములవలెఁ గన్పట్టుపర్వతాదులయందును, నీయెల్ల ప్రపంచమునం దింద్రియగోచరములైన సర్వవస్తుసంతతియందును, అణువు మొదలుకొని బ్రహ్మాండమును గలసర్వమందును బరమేశ్వరునిగాంచుచుండి నిర్భరమైనయానందముతో నొప్పుచుండెడువాఁడు. ఒకనాఁడు యమునానదీతటంబులకుఁ బోయి యక్కడి సాయంకాలమందలి పవనాంకురములచేఁ జలించుజలోపరిభాగమునందు చిన్న చిన్న తరగలలో నీశ్వరునిగాంచి యున్మత్తునివలె నాట్యము సల్పుచుండును. అస్తమించెడు పతంగబింబముయొక్క కాంతులచే నాకసమునందుఁ గన్పట్టుపలు విధములైన వర్ణములఁ గాంచి పరమేశ్వరునిమహిమలను గొనియాడుచు పారసీకభాషయం దుత్కృష్టములై, భక్తిరసముతో నొప్పారు పద్యముల నాశువుగాఁ దనకుఁ దానే రచియించుకొనుచుండును. అదిగాక యితఁడు సంస్కరణాభిలాషి. హిందూమహమ్మదీయ మతమహాసముద్రములను సంపూర్ణముగా మథన మొనరించి తత్సారమును బా

నము చేసి యజుర్వేద మొప్పెను. చిత్తానమున్నట్లుడికిఁ బోవుచున్నప్పుడీతఁడు ప్రథమమున నక్బరుమైత్రి సంపాదింపఁగలిగెను. ఈతనివిఖ్యాతియును, కవిత్వమహత్త్వమును గాంచి యచ్చెరువంది పాదుషా యీతనిని గౌరవించి తనదర్బారున దత్యుత్తమస్థానము నొసంగెను. అబుల్ ఫైజీకి తమ్ముఁడగు నాబుల్ ఫాజుల్ గూడ మహావిద్వాంసుఁడు. ప్రస్తుత కథాకాలమునాఁటికి అబుల్ ఫాజులునకు యిరువదియొక్క సంవత్సరములు వయస్సుండుటచే నన్నగారింటనే యుండి చదువుకొనుచుండెను.

పహాలురాదా యనునామె అబుల్ ఫైజీకి బంధువు. ఈమెకు తలిదండ్రులు చిన్నప్పుడే గతియించుటచే షేకుముబారకు తనపిల్లలతో సరిగాఁ బెంచుచుండెను ఆమె యిప్పుడు ఫైజీసంరక్షణాలో నున్నది. ఫైజీయొద్దనే విద్యాభ్యాసము చేసి కవితాధోరణియును బాండిత్యమును గల్గించుకొన్నది. విశేషించి గానకళావిలాసప్రియ. అబుల్ ఫైజీ స్వయంప్రజ్ఞచేఁ గనుఁగొనినజ్ఞానసారము నీమె యవలీలగా నాతనినుండి గ్రహించినది. ఎప్పుడును ఫైజీతోడనే తిరుగుచు నావేశము గల్గినప్పు డాతనిముఖమునుండి వచ్చుచుండెడు కవితాప్రవాహమును గ్రహించి తాను వ్రాసి ప్రపంచమున కామెయొసఁగును.

కుస్తీ జరిగినమఱునాఁటియుదయమున అబుల్ ఫైజీ తనకుపాదుషా యిచ్చినభవనమునందుఁ గూరుచుండి యుండెను. ఆభవనమునే మనము ప్రథమప్రకరణమున వర్ణించి యుంటిమి. అది రహీముగృహమునకు ప్రక్క నున్నది. ఆగృహమునకు, రెండతస్తులమేడయును ముందుపూలమొక్కలతోను, చిత్రవర్ణముల యాకులుగల మొక్కలతోను నిండిన కొంతఖాళీస్థలమును గలదు. అచ్చోటఁ గూరుచుండుట కనువుగాఁ గొన్నిచంద్రకాంతశిలావేదిక లుండెను. అబుల్ ఫైజీను కూరుచుండి యుండిన దొకవిశాలమైనపడసాల. అందు నాలుగైదు సోఫాలు వేయఁబడియుండెను. ఒకసోఫాయం దబుల్ ఫైజీయును నిం

కొకదానియందు పహ్మీదాయును గూరుచుండి నూతనపురుషుఁడగు చందనదాసును గుఱించియే మాటలాడుచుండిరి.

ఆసమయమున నొక సేవకుఁ డరుగుదెంచి 'చందనదాసు' వచ్చి దర్శన మపేక్షించుచున్నాఁ డని ఫైజీకిఁ దెలిపెను. ఆమాట వినినతోడనే వారిని బ్రవేశపెట్టుమని ఫైజీ యానతిచ్చెను. అబుల్ ఫైజీ ముసల్మానుఁడైనను గూడ మహావిజ్ఞానసంపన్నుఁడును, సంస్కరణాభిలాషియు నగుటచే సాధారణముగా మహమ్మదీయవనితల కుండునంతటి గోషాగాని, ఆ నాఁడనున్న నుగపురుషుసవ్వడి వినఁబడినతోడనే బడబడ పరుగెత్తి పర్దావెనుకకుఁ బోవునాచారముగాని పహ్మీదాకు లేకుండఁ జేసెను. అట్టిపద్ధతులలోఁ బెంపబడినదగుటచేతనో, లేక వివశయగుటచేతనో, చందనదాసరుదెంచుచున్నాఁడని వినియును గూడ పహ్మీదా లోనికిఁ బోలేదు. ఆతఁ డామె కపరిచితుఁడును నూతనపురుషుఁడును నగుననుభావము స్ఫురించినట్లు తోఁచుట లేదు. చందనదాసులోనికరుదెంచెను. మొదట నాతనిదృష్టులు ఫహ్మీదా మొగముపైఁ బ్రసరించెను; తత్క్షణమే కాలు వెనుకకు జంకెను గాని, తన కచ్చోటికి వచ్చుట కానతి యుండుటచే మెల్లగా ముందునకుఁ బోఁజొచ్చెను. పహ్మీదా యాతని తటపటాయింపును గ్రహించియో మఱియేకారణముచేతనో మెల్లగా లేచి వెనుకకుఁ గొంచెము కొంచెము తిరిగి చూచుచు పరదాచాటునకుఁ బోయెను. ఆపోవునప్పుడు వారిరువురిదృష్టులును మరిమరి తారసిల్లుటచే విద్యుచ్ఛక్తిని స్పృశించుటవలన జనించు పులకరింపువలె, నుభయుల శరీరములయందలి నరములును సంచలించెను. శరీర మంతయును బులకరించెను. పహ్మీదా తెరచాటునుండి ప్రక్కగదిలోనికిఁ బోయి వారిసంభాషణమును వినుచుండెను.

చందనదాసు లోనికి వచ్చి యొకసోఫాపై నాసీనుఁడైన తరువాత వారిరువురికిని నిక్రిందిరీతిని సంభాషణమయ్యెను.

అబుల్—అయ్యా! చిన్నతనము చూపినమహాసామర్థ్యము నకు జనులందఱు సంభ్రమపడిరి. చక్రవర్తిగారు మిగుల సంతసించిరి. బ్రాహ్మణు లయ్యును నిట్టిసామర్థ్యమును మీరెట్లు సంపాదించితిరో తెలిసికొను కుతూహలముతో మిమ్ములను బిలువనంపితిని. అన్యముగా భావింపకుఁడు.

చందనదాసు తనవంటి నూతనపురుషునకు బాదుషాయొద్ద ప్రధానుఁ డగు ఫైజీవంటి మహాకవిపుంగవుని పరిచయము లభించె నని యెంతయును సంతసించి యీవిధి నుత్తరం బొసగెను.

చందన—అయ్యా! తాము కవిచక్రవర్తు లనియును మహా పురుషు లనియును దశదిశల విశదములై యొప్పు త్వదీయయశశ్చంద్రి కలచే నాకు సంపూర్ణముగా వ్యక్తమయ్యెను. తమ దర్శనము లభి యించుటచే నీదినము చాల సుదినము. మీకు నాయందుఁ గలిగిన యవ్యాజమైన కరుణకు నేనెంతయును గృతజ్ఞుఁడను.

అబుల్—తాము విశేష మిందు పరిశ్రమ చేసియుండుటయే గాక శాస్త్రము లేవైనఁ బఠించితిరా!

చంద—అయ్యా! నేను చిన్నప్పుడు మాగ్రామమందు పాదు షాచే నిల్పఁబడిన పాఠశాలయందుఁ గొంచెము పారశీకమును నుర్దు భాషయును నేర్చికొంటిని. మాయూరిలోని యొకశాస్త్రిగారికడ వేద మును, గొంచెము శాస్త్రమును గూడ నభ్యసించితిని.

అబు—మీ కెనుబదిరెండు ప్రశ్నలును బూర్తియైనవా! వేదాంతశాస్త్ర మేమైనఁ జదివి యుంటిరా! మనుస్మృతులు మొద లగు వాని నభ్యసించితిరా!

చంద—తమకు వేదశాస్త్రములయందు పరిచితి కలిగినట్లు నన్నడుగుచున్నారు!

అబు—అయ్యా! నాకు మతము లనినను వాని సంబంధము లగు చర్చలనినను చాల నిష్టమగుటచేఁ బ్రపంచమునందలి యున్ని

"ఔరా! అట్టి రూపవతి యగు కన్యకను మహమ్మదీయ వంశమునందుఁ బుట్టించితివి గదా! అట్టిసుందరీమణి నాకంటికిఁ గనఁబడ నేల? ఎన్నఁడును పరస్త్రీనిగాంచి చలింపని నామనస్సు ప్రయత్నముగా నాతరుణిచే నేల హరింపఁబడవలయును?—ఛీ! ఇట్టిభావములు నాయందు దుష్ప్రవిల్లుటకంటె కృతఘ్నత లేదు. సాపమూ మె యాతని భార్య యగునో, యింకొకరిభార్య యగునో! ఇంటికిఁ బిలిచి మంచి మాటలాడి దయాగసము నవ్యాజముగా వెల్లివిరియఁజేసిన మహాపురుషుని భార్య లెగాదిగఁజూచి మనస్సునం దన్యాయము లైన యూహలచే దొరలుచుంటంకంటె పాతక మేమైనఁ గలదా! ఇల్లు చొరఁబెట్టిన నింటివాసములు లెక్క పెట్టుట యఁదు రిట్టిదియే కదా! ఇంతియును నామె మ్లేచ్ఛవనిత. నేను నుత్తమబ్రాహ్మణవంశసంజాతుండను. అట్టిభావము మానస్సులోనైనను గల్గుట యన్యాయము. పాపము తనకళత్రముగనే చూచి దుష్యంతుఁడు "అనిర్వర్ణనీయం పరకళత్రం" అని యనఁడా! అట్టిమహామహుల దేశములో జనించి యట్టిభావము మనస్సులోనైనఁ బుట్టనిచ్చుట యన్యాయము! అని యేమేవో పరిపరివిధముల ననుకొనుచు నాతఁడింటికిఁ బోయెను.

---

## నా లు గ వ ప్ర క ర ణ ము.

### రాజాభగవాన్దాసు.

దేశమే బమకు గతియని నమ్మి, దేశసేవకు నిజదేహములయందలి రుధిరమును మంచినీళ్ళప్రాయమున రణరంగమున నసి దేవతకుఁ దర్పణ మొనరించి, వీరాగ్రేసరులకును, మహాపురుషులకును నాదర్శప్రాయులై యనశ్వర మగు యశమును సంపాదించినవారు రాజ

పుత్రులు. వారిలో జయపురము, జోధపురము, ఉదయపురములందలి పరిపాలకులు ముఖ్యులు. ప్రప్రథమమున దేశమునఁ బ్రవేశించి తమ ప్రభుత్వమును స్థాపించుటకు యత్నముసల్పిన మహమ్మదీయులకుఁ బక్కలో బల్లెములవలె నుండినవారీ రాజపుత్రులే. కాలక్రమమున వారి యభిప్రాయములు మారినవి. మహమ్మదీయులతో సర్వవిధములను గూడ నేకీభావము జెందిరి. కొందఱు కాలముతో మార్పు చెందఁజాలక తమ మానప్రమాణములను స్వప్రాణములపాలొనరించి, తమ జీవితము నెల్లను మహావాతాహతసముద్రతరంగసదృశమునైన భావములచే కలనమొనరింపఁజేసికొని కాలముచేసిరి.

మహమ్మదీయ సామ్రాజ్యము స్థిరమై హిందూదేశమంతయు నేకీభావమును జెందవలసినస్థితి వచ్చియుండిన కాలమందు మొట్టమొదటఁ గ్రొత్తమార్గమును ద్రొక్కి మహమ్మదీయులతో నేకీభవించి, హిందూదేశ మాతయును నొక్క తెల్లగొడుగు నధికారము క్రిందికిఁ దెచ్చుటకుఁ సహాయపడిన రాజపుత్రులలో మొదటివాఁడు అంబరుదేశమునకు రాజైన బిహారీమల్లుఁడు. ఆ యంబరురాజ్యము నే యిప్పుడు రాజపుత్రస్థానములోని "జయపూర్" అని పిలుతురు. 1562 వ సం॥రం అక్బరు ఖాజామునీఉద్దీను అను మహాత్ముని గోరీని జూచుటకై స్వల్పసైనికులతో మృగములను వేటాడుచు బయలుదేరెను. మార్గమధ్యమున నంబరుదేశాధీశుఁడైన యీ రాజా బీహారీమల్లును గలిసికొనుట తటస్థించెను. అప్పుడు వారిరువురకును సంభాషణ జరిగెను. మహమ్మదీయులకును రాజపుత్రులకును గల సంబంధము నిరువురు నొకరొకరు స్థిరీకరించికొనిరి.

బిహారీమల్లు—మహమ్మదీయులు హిందూదేశమునకు వచ్చుటయే గాక నిష్కారణముగా హిందువులతోఁ బోరాడి వారికిని

వీరికిని దేశమునకును స్వంత శాంతి లేకుండఁ జేయుచున్నా రని కొందఱు రాజపుత్రుల యభిప్రాయమై యున్నదిగదా! విద్యావంతులై ధర్మమే ప్రధానముగా వర్తించుటకుఁ బ్రయత్నించు పాదుషావారు దీని కేమి యుత్తర మీయఁగలుగుదురు.

పాదుషా—ఈ యభిప్రాయమే దేశమును జెరుచుచున్నదని నాకు నిశ్చయముగాఁ దెలియును. రాజులకును రాజులకును సమావేశము గలుగుట దుర్లభము. కలిగినను వారి హింభావ పూరితులై యితరుల వాక్యములందు సత్యము గోచరించుచున్నను గూడ నొప్పుకొనరు సరిగదా వృథాయాస మొనరించి చెప్పిన వాక్యములలో లేనిపోని యర్థములను నాశయములను దీసి, వ్యర్థము లగు యుద్ధములలో దింపి దేశస్వాస్థ్యమును ధ్వంసము చేయుదురు. మనకు దైవికముగా నిచ్చోట సంబంధము గలిగినది గావునను, మీరు న్యాయమగు మనసుతో నన్నుఁ బ్రశ్నించుచున్నారు. గావునను జెప్పుచున్నాను. మహమ్మదీయులు హిందూదేశము నెందులకుఁ బ్రవేశించిరో యిప్పు డెవ్వరును నడుగుట యసమంజసము. ఇంతకును నడుగుటకు వారి కధికారము లేదు. హిందువులును మహమ్మదీయులును నిరుగుపొరుగు వారలే యనుటకు హిందూకుష్పర్వతములే సాక్షి. మీ రాజపుత్ర రాజ్యములలోని చిన్నచిన్న సంస్థానము లొకరితో నొకరు పోరి దేశక్షయ మొనరించుట యెట్టిదియో మహమ్మదీయుల వచ్చుటయు నట్టిదియే! ఇంతకును రాజపుత్రులుమాత్ర మీ దేశములోనే పుట్టిరిమని యును నింకొక దేశమునుండి వచ్చుటకు కారణము లేదనియును నే కారణముచే దృఢముగాఁ జెప్పఁగలరు? కావున నిరుగుపొరుగువారలకు సంబంధ బాంధవ్యములఁ గూర్చునది కాలమేగాని వేఱొండుగాదు. మహమ్మదీయులు హిందూదేశమును జొచ్చి సుమారాఱువందల సంవత్సరములు మించినది. వారికి పోవుట కింకెక్కడికిని స్థలము లేదు. ఇదియే

వారిస్వదేశమైనది. కావున వారిదుష్పరిపాలనము సహించి హిందూదేశమునకుఁ గష్టములఁ దొలఁగించు యత్నముల సలుపవలసి నదే గాని చేతులు ముడుచుకొనుట గాదు. ఇట్లు జోకొట్టుచున్నయెడల నేనాటికిని శాంతి చేకూరదు.

బిహారీమల్లు—అట్లైనయెడల దేశమును వృద్ధి చేయుటకు శ్రీ పాదుషావారు కేమార్గమును జూపింపఁదలఁచియున్నారు. యుద్ధములను మానివేయవలసిన దని వచించుచున్న పాదుషావారికే చిన్నచిన్న రాజ్యములతో యుద్ధమొనరించి వారిని లోఁబఱచుకొనుటయందలి యభిప్రాయ మేమి?

పాదుషా—చక్కని ప్రశ్న వేసియున్నారు. దేశ మభివృద్ధిఁ జెందవలసి యున్నయెడల హిందూమహమ్మదీయులు తమజాతి మత భేదములను విడిచి దేశహితమునకే పనిచేయుచు నొక సంఘమువలె నుండవలసినది. మానవప్రకృతిలో నున్న మనుష్యులందఱు నొకే సంఘమునకుఁ జేరియున్నారని మతగ్రంథములు మొఱపెట్టుచునే యున్నవి. అట్టిసందర్భమున హిందూమహమ్మదీయు లొక్కసంఘముగా నుండుటకే యభ్యంతరము గలుగును? వీరలు పరస్పరవివాహము లొనరించుకొనుచు పంక్తిభోజనములఁ జేసికొనుచు నొకరి యభిప్రాయములతో నొకరు సానుభూతిని జూపించుకొనుట కేయభ్యంతరము గలదు? అదిగాక ఇప్పు డుత్తర హిందూస్థానములో నున్న రాజ్యము లన్నిటికంటెనుగూడ విశాలమైనది మహమ్మదీయ సామ్రాజ్య మనుమాట నిస్సంశయముగదా! దేశ మంతయును నొక్కరియధికారమునకు లోఁబడి యున్నచోట్లను నొకేరకముగా న్యాయము నొసంగినయెడల దేశమునకు క్షేమకరముగా దా! ఆయభిప్రాయముతోనే చిన్నచిన్నరాజ్యముల నన్నిటిని జయించి యొక్కసామ్రాజ్య

మును కూర్పవలెనని ప్రయత్నించుచున్నామేగాని రాజ్యతృష్ణచేఁ గాదు.

బిహారీమల్లుఁడు—ఢిల్లీశ్వరులు వచించినపల్కు లెంతయును సత్యముగాఁ గన్పించుచున్నవి. నిశ్చయముగా హిందూమహమ్మదీయుల కైక్యము కూర్చుచు, నందఱిని సమముగా నీక్షించుచు, హిందూస్థానము నంతయు నొక్క వెల్లగొడుగుచే నరాజకబాధాతపము నుండి వారించుటకు యత్నించుటయే, పాదుషా వారి యభిప్రాయమగునెడల చిన్న సంస్థానాధీశ్వరులైనను అంబరు ప్రభువులన్ని విధములను సాహాయ్య మొనరింపఁగలరు. దేశక్షేమమునకై రాజపుత్రులు యుద్ధమునకు జంకువారు కారని యిదివఱ కెన్నియోసంవత్సరముల నుండి దేశమున కంతకును వెల్లడియైనవిషయమే గావున మేము ఢిల్లీశ్వరునితో పోరాడుటకు జంకినవారము గామని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. తిప్పక ధర్మసంస్థాపనముచేయుసమ్రాట్టునకు మేమువంగవలసినదే గావున ఢిల్లీశ్వరునకు వంగుట మాకు గౌరవహీనముగాదు. అదిగాక హిందూమహమ్మదీయులకు సాంఘికముగా నైక్యముకూర్పవలెనన్న నంతఃపురమునను వివాహములు జరుగవలయుననియే పాదుషా యభిప్రాయమని తెలుచున్నది గావున నట్టికార్య మొనరించుటకునుగూడ మేమే ముందంజ వేయుటకు సంసిద్ధులము.

పై సంభాషణ జరిగినతరువాత బిహారీమల్లుఁడు అక్బరునకు పరమమిత్రుఁడగుటయేగాక తనకూఁతు నిచ్చి యాతనికి వివాహ మొనరించెను. అట్టి మహామేధావియు, విశాలమనస్కుఁడును శౌర్యవీర్యతేజోవిభ్రాజితుఁడునగుబిహారీమల్లునికుమారుఁడు రాజాభగవాన్‌దాసు. రాజాభగవాన్‌దాసు అక్బరునకు స్యాలకుఁడును, మనసబ్‌దారుఁడు నైయున్నాఁడు. ఈతఁడు పంజాబుదేశమునకు గవర్నరు. ఢిల్లీశ్వరునకు సుశిక్షితుఁడు. మహావీరుఁడు. విశేషించి రాజకార్య

ధురంధరుఁడు, యోజనాపరుఁడు, నెమ్మది గలవాఁడు, స్వామికార్య తత్పరుఁడు, విద్వాంసుఁడు. ప్రకృతిసౌందర్యమునకుఁ బుట్టినిల్లైన జయపురము మొదలగు స్థలములయందు విహరించిన రసాస్వాదనాకుతూహాలుఁడు. కథాకాలమునాఁటి యుదయమునఁ దన మందిరములో పట్టుపఱుపులతోఁ గూర్పఁబడిన సోఫాపై సుఖాసీనుఁడై రామాయణమును జదువుచుండెను. ఆతఁ డున్నగదిలో ననేక పుస్తకములతో నిండిన బీరువా యొకటి గలదు. అందు సంస్కృత పుస్తకములును నుర్దూపుస్తకములుఁ గలసి యున్నవి. ఆతఁడు వాలికిని శ్రీరామునకు జరిగినవాదనను దెలుపు ఘట్టమును జదువుచుండెను.

అట్టి సమయమున లోనికి సేవకుఁ డొకఁ డరుగుదెంచి "అహామ్మద్ ఖాన్ సర్దారు సర్కారునుండి హుకుమ్‌తో ద్వారముకడ వేచియున్నారు." అని మనవిచేసి భగవాన్‌సింగుకడ నాజ్ఞనుగొని వారిని లోపలఁ బ్రవేశపెట్టెను. తరువాత వారిరువురకును నీరీతిని సంభాషణము జరిగెను.

అహామ్మద్‌ఖాన్—రాజాజీ! ఈదినము మధ్యాహ్నమున మామూలుదర్బారున కొకగంట ముందుగా ఖుషాల్ ఖానాలో సర్కారు తమతో నాలోచింతురు గావున రావలసినదని హుకుమ్.

రాజా—ఇప్పుడు ఖుషాల్‌ఖానాలో నాలోచింపవలసిన రహస్యాంశ మేమైయుండునో తమకుఁ గొంచెము తెలియునా!

అహా—గుజరాతులోని ప్రజలపై నిబ్రహీమ్‌హుసేన్ మీర్జా, మహమ్మద్ హుసేన్ మీర్జా మొదలగువారల్లరి చేయుచున్నట్లు తెలిసినది. గాన నచ్చటి దుస్స్థితులను నివారించి శాశ్వతము లగు నేర్పాటులు చేయుటకుఁ బాదుషా యాలోచించుచున్నారు. ఆవిషయముకే తమతో జెప్పవలసినదని యాజ్ఞాపించియున్నారు.

రాజా—అట్లయినచో నిప్పుడు యుద్ధము తప్పదనుమాట నిశ్చయమే గదా! ఓ భారతజననీ! అక్కటా పాడుపాపి నిన్నుఁ బాలించుచుండ కడచి కూరుచుండలేక నీపుత్రులగు హిందువులను పెంపుడు పుత్రులగు మహమ్మదీయులను నా మహాపురుషునితోఁ బోరాడి ధర్మమును ధ్వంస మొనర్చి దేశము నరాజకముగఁ జేయ నిశ్చయించి యున్నారు. స్వపౌరుషమును, నహంభావమును, నధికారగర్వమునే యెంచుకొనెదరు గాని దుర్భరకష్టములకు నాలవాలమైన యుద్ధము వలన హిందూమహమ్మదీయ సోదరులకును, సర్వశుభలక్షణలక్షిత యగు భారతమాతకును వచ్చు కడగండ్లఁ దలఁపరు గదా? అయినఁ గానిమ్ము. శస్త్రకారుఁడు వ్రణమును భేదించి శరీరమున కంతటికిని మేలు సేయునట్లు జంకు లేక వీరి నిప్పుడు సాధించియే తీరవలయును. లేనియెడల దేశమునకు శాంతి గలుగదు.

అహా—రాజాజీ! అట్లు చేయవలయును. లేనియెడల నీ యున్న యొక మీర్జా లనాథలపైఁ బడుటయే గాక తక్కిన సామంతులును వీరిఁ జూచి యట్టివిధానమునకే సాహసింతురు. ఇంతకును మధ్యాహ్నమేమి నిర్ణయింతురో గదా.

రాజా—నిర్ణయించుట కేమున్నది? పాదుషావారు యుద్ధమున కనుజ్ఞ యీయక తప్పదు.

ఆహా—అట్లయినయెడల మనకందఱకును చేతులతీట దీరునట్లు యుద్ధము దొరకును. కాని మీరు చదువుచున్న పుస్తకమేమి?

రాజా—నేను రామాయణమును జదువుచుంటిని. ఇది శ్రీరాముఁడనుమహాచక్రవర్తి చరిత్రము.

అహా—రాజాజీ! శ్రీరాముఁడు చాల గొప్పచక్రవర్తి యని వినియున్నాము. ఆయన తన రాజ్యములోని ప్రజలకొఱకై భార్యను

గూడఁ ద్యజించెనఁట. శ్రీఅక్బరు చక్రవర్తిరాజ్యమునుగూడ నందఱు ప్పుడప్పుడు రామరాజ్యమువలె నున్నదని యందురు. ఆరాముఁడును ఈరాముడును నొక్కరే యగుదురా!

రాజా—అవును. ఆరాముఁ డితఁడే.

అహ—నిజముగా నామాటకు మన బాదుషా తగును. రాజాజీ! నేనింకను దక్షిణవారికందఱకు నీవిషయమును దెలిపి రావలెను. సెలవిచ్చిన పోయి వచ్చెదను.

అని సెలవుదీసికొని యహమ్మదుఖాన్ వెడలిపోయెను. రాజా భగవాన్ దాసుమాత్రము యోచించుకొనుచు నచ్చటనే కూరుచుండెను. "ఆహా! జ్ఞాతివైర మెప్పుడును త్రాఁచుపామువంటిది గదా! అక్బరును మీర్జాలును నొకవంశమువా రయ్యును యుద్ధములుసేయుచున్నారు. వారి దేశములో నుండునప్పుడు పగ సాధించుట న్యాయము. హిందూదేశమునకు వచ్చి వీరు పూజల నందుచుండఁగా నిక్కడను వైరమునే ప్రధానముగా నుంచుకొని యున్నారు. ఎట్లయినను అక్బరు పట్టినపట్టు విడుచువాఁడు గాఁడు. ధర్మసామ్రాజ్యమును స్థాపించిననే తీరును. పైని బరమేశ్వరుఁడు తప్పక సహాయముచేయును. ధర్మమే జయించునుగాక!' అని యోచించుకొనుచు భోజనమునకు వేళ యగుటచే లేచి యింటిలోనికిఁ బోయెను.

# అయిదవ ప్రకరణము

## ఖుషాల్ ఖానా

మధ్యాహ్నము సుమారు రెండుగంటల వేళ నాగ్రాకోటయందు ముఖ్యోద్యోగు లందఱును గలసిరి. ఆలోచింపవలసినయంశము గుజరాతులో నుండుమీర్జాలతో యుద్ధము సేయవలయునా లేదా యని—ఖుషాల్ ఖానా యనఁబడు నాలోచనామందిరము పాదుషా దర్బారొనరించు భవనమునకు వెనుక భూమిలోఁ గట్టఁబడియున్నది. ఆయింటిపై భాగము భూమితో సరియైనయెత్తున నుండుటయే గాక మఱియొక పెద్దభవన మాపైకప్పుమీఁద గట్టఁబడి యుండుటచే నడుగున నొకయిల్లున్న ట్లెవ్వరికిని దెలియదు. పైనుండి క్రిందికిఁ బోవు మెట్లవరుసనుండి దిగి యాఖుషాల్ ఖానాలోనికిఁ బోయినయెడల మంచిమంచి కుర్చీలతోను, పట్టుసోఫాలతోను నిండియున్న యొక చక్కని విశాలమైన పడసాల గన్పట్టును. ఆపడసాలయొక్క గోడ లన్నియును పూర్వచక్రవర్తుల చిత్తరువులతోను, మతోద్ధారకుల యాకారములతోను, మహాపురుషుల పటములతోను నిండి యున్నవి నేలమీఁద నంతయును విలువగల యొక తివాసీ పఱచియుండిరి. అందొక యిరువదిమంది హిందువులును, మహమ్మదీయులు గలసి నిర్ణీత కాలమునకు ముందే వచ్చి కూరుచుండిరి. అందు రాజా బీర్ బల్, అబ్దుల్ రహిమాన్ ఖానేఖానా రాజామాన్ సింగ్, రాజాభగవాన్ దాస్, మునీమ్ఖాన్ ఖానేఖానా, రాజాతోడరుమాల్ మొదలగు రాజ్యతంత్రకోవిదులు, యుద్ధవిధాన విశారదులు, అర్థశాస్త్రజ్ఞులు, దౌత్యనిపుణులు నెవరి యుద్యోగమునకు, గౌరవమునకుఁ దగినట్లు వారు కూరుచుండిరి.

ఇట్లందఱును గూర్చున్న తరువాత సరియయిన కాలమునకు ఢిల్లీశ్వరుఁడు లోనికరుదెంచిన సద్దు గాంచి యుద్యోగులు లేచి గౌరవ సూచకముగా నిలువఁబడి క్రిందకు వంగి సలాము చేసి "అల్లాహో అక్బర్" అని మెల్లగా వచియించిరి. కొంచెముసేపైన తరువాత నక్బరుపాదుషా యచ్చోఁ దనసింహాసనముపై నుపవిష్టుఁ డయ్యెను. ఆయన యాసీనుఁడైనవెంటనే యొకసర్దారుఁడు, ప్రక్కనుండి లేచి వచ్చి యీవిధముగా సభవారికి నివేదింప మొదలుపెట్టెను. "సూరతు పట్టణమునం దిబ్రహీముహుసేనుమిర్జాయును, మసూద్ హుస్సేన్ మిర్జాయును, గుజరాతులో నధికారముసేయుచున్న ముజఫర్ షా యును తిరుగబడియున్నారు. ఏలినవారిసంస్థానమునకుఁ జెల్లింపవలసిన కప్పమును జెల్లించుట మానివేయుటయేగాక, రాజ్యమును కొల్లగొట్టి దేశము నరాజకము చేయుచున్నారు. గుజరాతులోని పరిస్థితులను సరిగా యోచించి తిరిగి యల్లరి కాకుండ స్థిరముగా నేర్పాట్లు సేయింపవలెనని యేలినవారి యభిప్రాయము. ఇప్పుడు వీరి నొప్పరికించినచో నందఱుసామంతులునుగూడ వీరియాగడమునే నిదర్శనముగా గ్రహింపవచ్చును. కావున యుద్ధ మొనరించుటయా లేక మఱేమైన నింకొకతీరుగా సర్దుటయా! యుద్ధమొనరించునెడల నెవరి నెంత సైన్యముతోఁ బంపవలెను? అను నీ సంగతులను గుఱించి యెవరి కే యభిప్రాయము లున్నను తెలియఁ జేయవలసినది అని శ్రీవారి యుత్తరువు."

పై మాటలు విని సభ్యులందఱును నాలోచించుచుఁ గొంచెము సేపూరకున్నతరువాత, పాదుషా స్వాభిప్రాయసూచకముగా రాజా భగవానుదాసువైపు చూచెను. అంత నాతఁడు లేచియిట్లు చెప్పఁదొడంగెను. "ఇప్పుడు యుద్ధముచేసి వారి నడఁచుటయే కర్తవ్యము. అట్లు చేయకున్న పక్షమున రాజ్యములోని దుర్మార్గులకు ప్రోత్సాహము

విశేషముగాఁ గలుగవచ్చును. యుద్ధమువలనఁ జాలనష్టములు, శ్రమయును కలుగుననుమాట నిజమే గాని యీసందర్భమున మాత్రము మన మూరకుండరాదు." ఈమాటలు వినినతరువాత నందఱును వల్లెయనిరి.

"అట్లయినయెడల నెవ్వరు యుద్ధమునకు పోవలెనో నిర్ణయింపవలయును." అని పాదుషా పలికెను.

"ఏలినవారి యాజ్ఞప్రకారమ్ ఎవరికైన వారే యుద్ధమునకు పోవుటకు సంసిద్ధులై యున్నారు" అని మూనిమ్‌ఖాన్ ఖానేఖానా వచియించెను.

"అట్లు కాదు. ఎవరు పోయినఁ గార్యము నిర్విఘ్నముగా కొనసాగునో వారలే పోవలయును. ఈసారి ఖుద్దునమేమే పోవుటకు నిశ్చయించుకొని యున్నాము గావున మాతో వచ్చువార లెవరో నిర్ణయింపవలెను. ఇక్కడ రాజధానిని గాపాడుట కెవ్వరినో యొకరిని మంచిజాగరూకత గలవారిని నియమింపవలెను."అనియక్బరుపల్కెను.

కొంతసేపు యోచించినతరువాత రాజామాన్‌సింగు, రాజా భగవాన్‌దాసులు యుద్ధమునకుఁ బోవలసినదని నిర్ణయమైనది. అట్లు నిశ్చయింపఁబడినతరువాత నక్బరక్కడికిఁ గావలసిన బలములు మొదలగునవి సిద్ధపఱుపవలెనని రాజామాన్‌సింగున కాజ్ఞయిచ్చెను. సభ ముగిసినతరువాత నెవరియింటికి వార లేగిరి. మరల నొకగంటలో దర్బారు సమావేశ మగును. ప్రతిదినమును దర్బారుపూర్తియైన తరువాతనే యీరహస్యాలోచనామందిరమున నందఱును సమావేశమగుచుండిరి గాని యీదినమున నద్యాదియే ముందొనరింపఁబడెను.

మరల మామూలుగా నెప్పటికాలమునకు దర్బారు సమావేశమయ్యెను. పెద్దమహాలులో నొకకొనసనున్నతమైనమంటపముపై మంచిపట్టుపరుపు కూర్పఁబడి యున్నతసింహాసనము వేయఁబడియుండెను. మంటపమునకు రెండుప్రక్కలనుగూడఁ గొన్నిసోఫాలును, గుర్చీలును

నుద్యోగులును గూరుచుండుటకు సిద్ధపఱిచియుంచిరి. మంటపమునకు దగ్గఱ నొకవిశేఖరి కూరుచుండుటకుఁ దగినస్థలము ప్రత్యేకింపఁబడెను మహాలుపై కప్పంతయు నగిషీలతోను నేల యంతయును దివాసీలతోను నిండి యుండెను. మీఁగనుండి రెండువరుసలుగా దీపము లెన్నియో వెలుచుండెను. ఆదర్బారునిండ కవులు, గాయకులు, పండితులు, ఉద్యోగులు, పకీరులును గూరుచుండిరి.

అక్బరుచక్రవర్తి సభ కరుగుదెంచి న్యాయమునకు సంబంధించినతీర్పు లేవియును నాదినమున విమర్శనకు రాలేదని వినినతరువాత జరుగఁబోవుదండయాత్రనుగుఱించి సభలో స్వయముగా ప్రసంగించెను. భోజనపదార్థములు, మందుగుండుసామానులు, మొదలగు యుద్ధపరికరము లన్నియును సిద్ధముచేయుటకు వారివారి కానతి యొసఁగిరి. తరువాత నాబుల్ ఫైజీనిగూర్చి పాదుషా యీరీతిగా పల్కెను.

పాదుషా—అయ్యా! మీరుగూడ నీసారి యుద్ధరంగమునకు వచ్చిన నెంతయును బాగుండును. మేము రణమొనరించి యలసి యున్నప్పుడు తమయసాధారణ కవితాధోరణిచే మమ్ముల నానంద సముద్రమున నోలలాడింపఁగలరని మానమ్మకము. ఇదిగాక తమకుఁ దీరిక గలిగినప్పు డక్కడ జరిగినదంతయును వర్ణించి యుంచెదరుగాక. బాదషాహితవారీఖులు దినదినము వ్రాసియుంచిన లిఖితములఁ బరీక్ష చేసి యుంచెదరుగాక.

ఆబు—పాదుషావారిచిత్తానుసారముగా వర్తించి తీరువాఁడను. నేనును రణరంగమునకు సైనికులపోరాటమును బ్రత్యక్షముగా జూడవచ్చును.

అని యిట్లు వారు సంభాషించిన యనంతరము సభాకార్యక్రమము ముగించి పాదుషా లేచినతరువాత సభ్యులుగూడ నిజగృహముల కేగిరి.

# ఆలాప ప్రకరణము

## సమాసము

మనోవేగమునకు మేరయే లేదు. వేలకొలంది మైళ్ళదూరమున నున్నవస్తువులను క్షణములోఁ గనుగొనఁగలశక్తియును, ఎన్నాళ్ళ క్రిందనో జరిగినసంగతుల నొక్కనిముసములోఁ జూపింపఁగలసామర్థ్యమును, ఉవ్వెత్తుగా మానవుని దుఃఖసముద్రములోఁగాని సంతోష సాగరమునఁగాని పడద్రోయఁగల స్వభావమును మనస్సునకుఁగలవు. ప్రపంచములోని సర్వసుఖదుఃఖములకును, నెల్లవిధములను దృష్టుల కును, పతితత్వనిర్ధనత్వముల కలిగించుటకును మనస్సే కారణమని మాన స్స్వభావము నెఱింగిన విజ్ఞానులు వచియింతురు. అట్టి మనసుయొక్క సర్వపదార్థగ్రహణమే లేనిచో, నానోపాపవాదములచేతనే సత్యమగు నీప్రపంచమునకు స్థితియే లేదని వేదాంతులు వచియింతురు. అట్టి సర్వోత్కృష్టమై, మానవుని బంధమోక్షములకుఁ గారణభూతమైన మనస్సును త్రిప్పఁగలవాఁడు కవి. తాను చిత్రించిన ప్రతిమలమూల మునఁ బాఠకుల మనస్సునం దన్నివిధము లగుభావముల నుత్పత్తి చేయఁగలవాఁ డాకవియే. ఒకమాఱు పాఠకుల నేడిపించును: ఇం కొక పర్యాయము వారిని సంతోషవార్ధి నోలలాడింపఁజేయును. భావనాప్రపంచమునఁ గవికలమున కడ్డులేదు. కేవల మనోగోచర మగు !సృష్టియందు కవి బ్రహ్మ. ప్రత్యక్షజనితమైన యింద్రియ జ్ఞానమువలన మనస్సునకు వస్తురూపగ్రహణము గలుగుచున్నది. కవిరచిత వాక్యములను వినుటమాత్రముచేతనే మనస్సున కుద్బో ధము గలిగి తప్పక రసానుభూతి యగుచున్నది. అట్టి కవివిరచితము లైన గ్రంథములను గవులే పఠించినచో వారికిఁ గల్గుసంతుష్టి మానము

వచించుచుండెను. కవి శాస్త్రజ్ఞుఁడు తన గణితసాహాయ్యముచే ఖగోళములందలి నూతనగోళముల నెన్నో గణనము చేసి కనుఁగొనునో, అట్లే కవియగువాఁడు తన స్వంత హృదయమందలి లేకుండఁ గావ్యప్రపంచమున నూతన సృష్టులను, నూతనప్రపంచములను సృష్టింపఁగలఁడు. అట్టిచో మహాకవి రచితములై కేవలము రసపరిపోషకములై యున్న కావ్యరాజములను గాయకులు పఠియించు సమయంబునఁ గలుగు నానంద మనిర్వాచ్యము.

అబాల్ … మహాయువరాజు గృహమునఁ గూరుచుండి భారతమును వినుచుండిరి. భారత రామాయణము లక్బరు చక్రవర్తి యాజ్ఞచే మౌలానాబదాయూని యను పండితుఁడు పారసీకములోని కనువదించెను. ఆ భారతములోని యొకభాగ మగు కుమారాస్త్ర విద్యాసందర్శనమును వారు పఠియించుచుండిరి. కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము వ్యాసమహాకవి ముఖనిర్గతవాక్ప్రవాహముచే ననంతర కాలికులఁ జెంది బాదయూనీపండితుని లేఖినీసారిణీమూలమున, ఫహీమీరాదాయొక్క మనోవైశాల్యమును జెంది యందు నూతనభావములను బల్లవింపఁజేయుచుండెను. ఆకర్ణాంతము లాగఁబడిన ధనుస్సుతో నొప్పు నర్జునుఁడును, నిశితఖడ్గపాణి యగు కర్ణుఁడును వారియెదుటఁ దాండవమాడుచుండిరి. ఆపదముల లాలిత్యమును, నావర్ణనాసౌలభ్యమును, మకరందప్రవాహతుల్యమైన యాశైలియొక్క సాదృశ్యరహితత్వమును, వారి నానందమున ముంచుచుండఁగా, నస్త్రవిద్యాప్రదర్శన మొనరించుచుండిన కర్ణార్జునుల సుందరముఖములు, విశాలములైన కన్నుంగవలు, గడిదేరిన భుజములును, బ్రదర్శనశాలయును, హృదయఫలకమునఁ జిత్రించుకొనుచుండఁగాఁ దటాలున నాఁడు జరిగిన చందనదాసు రహీములపోరాట మామెకు జ్ఞప్తికివచ్చెను.

గూడ నావెం బనస్సును దానితో నూపులును వెనుక కే పోవు చున్నవి. మెల్లమెల్లగాఁ గానారమునుండి రాజహంసముపోవునట్లు చెరవనాటున కాపెం ఁపోయెను. వచ్చినప్పుడెల్లను చందనదాసునకు మానోవికార కారణము పహామీాదాయే.

చందనదాసు కూరుచున్న తరువాత ఫైజీతో నిట్లు మాట లాడెను.

చందనదాసు—మీారు యుద్ధమునకు వచ్చుట స్థిరమైనదియే గదా! మాకును వచ్చుటకు సెలవు జారీచేయబడినది. తమరు గూడ వచ్చుట మాకెంతయును సంతోషకారణము. శరీరములు కష్ట బడి పనిచేసియున్నప్పుడు మీావాక్సుధామధురము లగువాక్కులు మమ్మా నందసింధువున నోలలాడింపఁగలవు. అదియుఁగాని నిజముగా బాదుషా కున్న చతురతయు, వాక్పాటవమును, దూరాలోచనాపర్వతమును సౌశీల్యమును మఱియొకరి కుండవని తోఁచుచున్నది. అట్టి మహా పురుషుఁ డింకొకఁడు పుట్టఁబోఁడనియే నాయభిప్రాయము.

ఫైజీ—లెస్సగా గ్రహించియున్నారు భాయ్! వారికిఁగల లోకజ్ఞానమును, విద్యాతృష్ణయును మనవంటి సామాన్యులకుఁ గూడ నుండఁబోవని నచియింపవలసినయెడల, సమస్తభోగముల ననుభవిం చుచు, రాజాధిరాజపదము నలంకరించుచుఁ, గోట్లకొలఁదిజనుల మానధనప్రాణములను దమయరచేతిలో నాడింపఁగల శక్తి గలిగి యుండియు, మదాంధుఁడుగాక యిట్టి ధర్మబుద్ధి గలిగియుండుట యెంత యును గొప్పవిషయమేగదా!

చంద—నిశ్చయమే గాని తమరు జనానాతో వచ్చెదరా? లేక యొక్కరే వచ్చెదరా? ఈదండయాత్ర యెన్నిదినములు పట్టునో మీాకేమైన నూహ యున్నదా? రాజసేవ నాకు నూతన మగుటచే నిట్టి యనుభవము క్రొత్తగా నున్నది.

జైజీ—పాదుషావారు వారిసర్వవిధములగు సదుపాయముల తోను మహావైభవములతోను బయలుదేఱెదరు. వారితోఁ బోయి నప్పుడందు ముఖ్యముగా యుద్ధమునకుఁగాక విద్యాగోష్టి కేగువేళ, మనకు, సర్వవిధములను నుపచారములు జరుగఁగలవు. నేనెవరిని దీసికొని వచ్చుటకుఁదలఁచుకొనలేదుగాని, ఫహ్మీదా నన్నువదలి యుండుట కిష్టపడదు. ఈదండయాత్ర చాలకాలము పట్టునని తోఁచు చుండుటచేతను, నామె లేకుండిన నాపద్యముల నేనే వ్రాసికొనవలసి యుండుట చేతను నామెను దీసికొనివచ్చుట తప్పదు. మేమిరువుర మును గలసివచ్చుట నిశ్చయము.

చంద—మీరు వచ్చుట ముఖ్యముగా నాయదృష్టమని సర్వ విధములను నమ్ముచున్నాను. నాకుఁగావలసిన సాహాయ్యము నొనరిం చుటకు మిమ్ములఁ బరమేశ్వరుఁడు నాకుఁ బ్రసాదించి యున్నాఁడు.

అనివారిరువురున బరస్పరప్రేమపూరితములును, గౌరవసూచ కములును నగు పలుకులచే సంభాషణ ముగించిన తరువాతఁ జం దనదాసు తనయింటికిఁ బోవుటకు సిద్ధుఁడయ్యెను. ఇంతటలో నుండి పళ్లెరములతో ఫలములు పంపఁబడెను. పాదుషాకొఱకు వివిధదేశ ములనుండి తెప్పింపఁబడినవానిలో నొకభాగము జైజీకిని వచ్చెను. చక్రవర్తికి ఫలహారమనినఁ బ్రీతియును మాంసాహారమనిన ననిష్టము ను గలదు. పరమేశ్వరుఁడు సృష్టింపఁగాఁ దినుటకుఁ సిద్ధముగాఁబరిపక్వ ములై, యసాధారణపేశలరసనిబిడంబులైన ఫలములుండఁ జేతనయు క్తములైన జీవములఁ జంపి వానిమాంసముల భుజించుట యుక్తము గాదని వారియభిప్రాయము. ఫలహార మొనరించినందువలన శరీరమున కారోగ్యమును, బుద్ధికి పాదరసమువలెఁ బాఱునట్టి శక్తియును గలు గునని వారియనుభవము. ఆకారణమున దేశదేశములనుండిఫలవృక్ష ములఁ దెప్పించి తమ తోటలలోఁ బెంచుచుండెడివారు. ఆ చెట్లను సరిగాఁ బోషించుటకును, వానికిఁ దగు నెరువులను, గొత్తము

లను దయారుచేసి, తోఁటల కొసంగుటకును, రాజ్యము నందలి ప్రజల కెరువులను గుఱించియు, కృషినిగుఱించియుఁ దెలుపుటకుఁ వ్యవసాయశాస్త్రము నెఱింగిన పండితులను రప్పించి తగిన వేతనము లిచ్చి నిలిపి యున్నారు. ఈఫలములందు గొన్ని యట్టితోఁటలకు జేరి నవిగూడ నున్నవి. ద్రాక్ష, అంజూరు, అరటి, మామిడి, దానిమ్మ మొదలగు రకరకముల పండ్లన్నియు నొకచక్కని పెద్దవెండిపళ్ళెరములలో నుంచి, పైనొక తాళవృంతము బెట్టి లోనుంచి పంపిరి. చుట్టును సన్ననిపట్టు జాలును, పైని ముఖమలుగుడ్డయును, నొక ప్రక్క జరీనగిషీపనియును, రెండవప్రక్క జరీతో నొకచిన్నవృక్షమును. దానినుండి నొకపసిపక్వమైనఫలము వ్రేలాడుచున్నట్లును, విసనకఱ్ఱపైఁ జిత్రింపఁబడి యుండెను. ఆవి యన్నియుఁ బరమానందముతోఁ జందసదా సందుకొని 'యన్నియు నాకక్కఱలేదు రెండు మూఁడుమాత్రము నేను గ్రహింతును' అని చెప్పెను కాని పై జీదాని కంగీకరింపక వాని నన్నిటిని దసనేవకునిచే నాతని వెంట నంపెను. ఆవిసనకఱ్ఱలో నొకమూల లిఖింపఁబడిన సన్నని యక్షరముల నాతఁడు 'పన్నామీదా' యని చదువుకొని వెంటనే మనస్సనేకవిధములగుభావములకు స్థాన మగుటచే సెలవుగైకొని గుఱ్ఱముపై నెక్కి యింటికి పోవుటకు బయలుదేఱెను.

ఆతఁడు గుఱ్ఱముపై నెక్కి యరుగుచుండెనే గాని మనస్సుమాత్రము మనసులో లేనే లేదు, అది యగాధమైన ప్రేమసరోవరమునఁ బడి కొట్టుకొనుచుండెను. అందొక పెద్దతుపాను విజృంభించి క్షోభముఁ బెట్టుచుండెను. 'రూపము, గుణము, యౌవనము, విద్య సరసత వహవా! ఇన్నిగుణము లావనితయందు మూర్తీభవించి యున్నవి. ఏమి పరమేశ్వరుని పక్షపాతరచన! అన్నియు నొక్కచోటనే యుండవలయునా! ఉండిన నుండనిమ్ము. ఉపభోగక్షమము గాకుండ

మహమ్మదీయుఁ గనిగొందు. దాండనేల! ఛీ! పాలవెల్లివంటికులము! నిర్మలమై సూర్యతేజస్సువలె పవిత్రమైన బ్రాహ్మణవంశమున సంజాతుండనై మహమ్మదీయవనిత నుద్వాహ మొనరించుకొనుటలో నేమి తెలిసి! కులము ధ్వంసమై పోవదా? మహమ్మదీయవనితయగు నాభార్య వండుచుండు దానిని గ్రహించి నేను పితరుల కర్పణ చేయవలసె. ఛేగా! పోనిమ్ము! బ్రహ్మచర్యమునే శాశ్వతశరణ్యముగా నుంచుకొనెదను. కాని యట్టిపని కేనొల్ల. మహమ్మదుఁడు హిందూ వనితను జేసికొనినాఁడు గాఁడా! చేసికొనినాఁడు గాని వానిమత మొప్పనేమో! నామత మొప్పదు నేను నామనస్సునుండి యీవిచిత్రమును బెఱికి వేసెదను. ఇంతకు నీసంగతి వినినయెడ నాయన్న మొదలగువా రేమనుకొందురు? అయిన నప్రయోజకుఁడ నని మాయన్న కేకలు వేయఁగా నేనిచ్చటికి వారిసంబంధము విడిచి పాఱివచ్చితిని. వారియడ్డాపులు నాకు లేని వేయైనను ఈకార్యమునకు నామనస్సొప్పుట లేదు. అయిన నాలోచింతును. పరమేశ్వరుఁడు మనుష్యుల నిరువురను సమానముగానే సృష్టించి యున్నాఁడు. మతమున వేఱైనను మానుషత్వమున సమానమే యగుదము. పూర్వ మొకసారి దుష్యంతుఁ డిట్టిసమస్యయందుఁ బడి 'సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః' అని నిర్ణయించెను. కాని అదిసందేహపదములైన వస్తువుల విషయముగాని నిర్ధారణగా నన్యకులమునకుఁ జేరిన కాంత యని తెలిసిన నాతఁడు వివాహమునకుఁ దలపెట్టునా! ఆకారణముననే "ఆశంకసే యదగ్నిం తదిదం స్పర్శక్షమం రత్నం" అని తరువాత చెప్పియే యున్నాఁడు. ఆమె బ్రాహ్మణకన్య యగునెడల వివాహ మాడియే యుండెడు. ఆతఁడే నాకు మార్గదర్శి గావలెను. ఈ యభిప్రాయమే నిజమైనయెడలఁ బరమేశ్వరుఁడు నాకీప్రేమ నామె

యందేల పుట్టింపవలెను. ఇది పరమేశ్వరుఁడు పుట్టించునది గాదు. నేను స్వయముగా నా భ్రమచేఁ బుట్టించుకొనునది. నేనొనర్చుకొన నున్న పనికి నన్నుఁగాక పరమేశ్వరుని నిందించుట యన్యాయము కాదా! పరమేశ్వరుఁడు మనుష్యులందఱకును యుక్తాయుక్తవివేచనా సామర్థ్యము నిచ్చియున్నాఁడు. దాని నుపయోగించుపని మనదిగాక యింకెవరిది? పోని నాశక్తిని పూర్తిగా విస్మరించెద ననుకొన్నను నాతాళవృంతము మీఁదిచిత్రము మఱపునకు రాదే! వేయేల యీమెను సంపూర్ణముగా మఱచిపోయి ధీరుఁడ నయ్యెదను." అని యేమేమియో మనస్సున నాలోచించుకొనుచుఁ బోవుచుండఁగా నాతని కెదురుగా నొక గుఱ్ఱముపై నెక్కి రహీ మరుదెంచుచుండెను.

చందనదాసునకు దృష్టి ముందు లేనేలేదు. నేత్రములపైఁ బడిన చిత్రములు మనస్సునకును బోవుటయే లేదు. ఆకారణమున ముందున్న రహీము గోచరింపకపోయినను నాతనిగుఱ్ఱము రెండవ గుఱ్ఱమును జూచి సకిలింపగానే యాతఁడు తన నిద్రనుండి మేల్కొని యెదురుగా వచ్చు రహీమును బలుకరించెను.

చందన—సూరతుయుద్ధమునకుఁబోవుటకుమీకాజ్ఞవచ్చినదా?

రహీము—వచ్చినది మీకో?

చందన—నాకును వచ్చినది. ఎప్పుడు చెప్పిన నప్పుడు బయలు దేఱుటకు సంసిద్ధులమై యుండవలెనఁట.

రహీమ్—తామెక్కడనుండి వచ్చుచున్నారు. వెనుకనున్న ఫలము లెక్కడఁ దెప్పించితిరి.

చంద—"అయ్యా! నేను ఫైజీసాబు గృహమునుండి వచ్చుచున్నాను. ఈఫలములు వారింటియందు నాకొసంగి యున్నారు. నే నన్నింటిని దినఁబోవనుగాన తాము కొన్ని గైకొనుఁడు." అని చెప్పి

యానవుఖరుతో "ఓయీ! ఈఫలములతో సగము వారి యింటికడ విడిచి రమ్ము"అని వచియించెను.

రహీం—ఏదీ! ఆ ఫలములున్న గంపను జూతము.

అని యానౌఖరును బిలిచి యందలి విసనకఱ్ఱను పండ్లను జూచి, యాతని నిట్లడిగెను. "అయ్యో! యీ విసనకఱ్ఱ నెవరొసంగిరి? ఇది చాల చక్కని జరీ గిపని చేయఁబడియున్నది."

చందనదాసు హృదయము మరలఁ జురుక్కుమనియె. రహీము వేసిన ప్రశ్నకుఁ బోడుగాఁ దక్షణమే యాతనికి మనస్సున క్షోభ ముద్భవింపసాగెను. "ఈ విసనకఱ్ఱ చాల సహాయకరమైనది"యని లో ననుకొని తక్షణము గలిగిన యుద్వేగముచే "అయ్యా! ఇదియును మీకుఁ గావలసినచోఁ గైకొనుఁడు"అని చెప్పివేసెను.

రహీము "సలాముభాయ్"అని వచియించి ముందునకుఁ బోగా సేవకుఁడును వాని వెనువెంటఁ బోయెను. ముందునకుఁ బోవుచున్న చందనదాసు మనస్సున నపారమైన కల్లోలము ప్రారంభించి యిట్లనుకొనసాగెను. "విసనకఱ్ఱ నిచ్చివేచితిని. అయ్యో! ఎంతమూర్ఖుఁడను! ప్రేమస్మారకచిహ్నముగా నెవ్వరేనినొసంగిన వస్తువును మఱియొకరి కిచ్చుట కేవలము నింద్యము. పోనీ తిరిగి కొనివత్తువా! యని గుఱ్ఱము నాఁపెను. ఆఁపుట యసందర్భము. ఇచ్చినది యెట్లు తీసికొనుట? కాని మ్రుడియును మంచికే వచ్చినది." అని యనుకొనుచుఁ దన మార్గమునఁ బోవుచుండెను.

రహీము—ననుసరించిపోయిన సేవకుఁడు, సగము పండ్లను విసనకఱ్ఱనుగూడ నాతని యింటిలోఁ బెట్టి మరలిపోయిన తరువాత, నాతఁడు తనదుస్తులను దీసి యావిసనకఱ్ఱను బరీక్షించుచుఁ గూరుచుండెను. ఇంత పనితన మెవ్వరొనరించిరాయని యాలోచించుచు తటాలున నందలి నామాక్షరములను గనుఁగొని—పహ్మిదా—

యని చదివి, స్తంభించిపోయెను. కన్నులు నిప్పులు గ్రక్కను కోపము హెచ్చిపోఁగా నిప్పుపైఁ గాలువేసిన మానవునివలె నొక్క మాఱు తటాలునఁ గూరుచున్న స్థలమునుండి దూఁకెను. అప్పుడాతని మనస్సునఁ దోచినయాలోచన లన్నియును వాగ్రూపముగా నింకొకరికి వ్యక్తమొనరించిన యెడల నిట్లుండెనని చెప్పవచ్చును.

"నన్ను పాదుషాసభలో నోడించి నాబహుమానము నొక మాయచే దొంగిలించినాఁడు. ఈనాఁడు నాకాంతను, ఇన్ని దినముల నుండియును నేను పూజించుకొనుచుండిన నాకాంతను, నామనో దేవాలయమునందలి దేవతావిగ్రహమును, హఠాత్తుగా హరించి నాఁడు. ఇదిఘోరము. నాకుఁ బ్రపంచమునందు రావలసిన యున్నతు లన్నియును—వేయేల—నాకు నాజన్మాంతము గన్నులపండువయై యానందదాయకమై యుండవలసిన స్త్రీరత్నమును గూడఁ దనపాలుచేసి కొనఁ బ్రయత్నించుచున్నాఁడు. ఇట్టివానిని జంపినను బాపము లేదు. వానిని నిర్హేతుకముగ వధియించినచో నేను శిక్షకు బాత్రుఁడనై యురి దీయఁబడుదు నేమో! పోనిమ్ము. నాప్రేమైకనిధానమే యన్యుని జేరు చున్నప్పుడిఁక జీవించి యేమిలాభము. అయిన దీనిని నాతఁ డట్టి యభిప్రాయముతో నే తీసికొనిపోవుచున్న పక్షమున నాకేల యిచ్చి వేయును? అడుగకుండ నిచ్చివేయునా! ఓహో! ఇది భ్రమ! ఆమె మహమ్మదీయవనిత. ఈతఁడు హిందూయువకుఁడు. వీరిరువురికును వివాహ మెట్లు పొసఁగును? నాయభిప్రాయ మబద్ధము. ఏమీ ఈనాఁ డట్టి వివాహము లెన్ని జరుగలేదు! పాదుషాయే చేసికొని నాఁడే! కాని యీచాంధసపుబ్రాహ్మణుఁడు దాని కొప్పుకొనఁడు. అట్టి యభిప్రాయము యొక్క ఛాయయైనను వీనిహృదయఫలకము నందు లేదు గావున నే దీని నడుగకుండనే నాకొసంగినాఁడు. ఉండిన యెడ నిచ్చునా! ఇంతకును రామాభాయి చెప్పినవాక్యము లసత్యము

గాఁజాలవే! ఆమెకు నాయం దెంత విశ్వాసము! నేనిచ్చిన బహుమతుల కెంతయును సంతసించును. నన్ను గుఱించి పహ్మానీగారా కెన్నియోసారులు చెప్పియేయున్నది. నామాటలు చెప్పినప్పుడు తప్పక సంతోషాలముతో వినుచుండునఁట. వీరిరువురకును ప్రేమగా యుండినయెడల నెల్లకాల మచ్చటనే కనిపెట్టుకొని యుండు రామాబాయికిఁ దెలియదా! తెలిసినయెడల నాకుఁ జెప కుండునా! పాపము నేను చందనదాసును నిష్కారణముగా నిందించితిని.

ఇట్టి యూహాలతో నాతఁడా నామాత్రములు నెన్నియోసారులు తిరిగి తిరిగి ముద్దుపెట్టుకొనుచు కన్నుల కద్దుకొనుచు పెట్టెలోఁ బెట్టి బీగము వైచెను. కాదు! కాదు! నాకెక్కుడు గావలసినప్పుడు గన్పించుచునే యుండుట కెదురుగా నుంచవలయును. అని దానిని వెలికిఁ దీసెను. ఈగోడకుఁ దగిలింతును గాని చిమ్మెటలు గొట్టివేయునేమో! లేదు! పరుపుక్రిందఁ బెట్టెదను. ఈయుద్ధముకూడ నాయదృష్టమునకే వచ్చినది. ఇందు ఖ్యాతి సంపాదించిన యెడలఁ బెద్ద యుద్యోగ మగును. అప్పుడు తప్పక యామె నన్ను వివాహము చేసికొనును. రామాబాయికూడ నట్లే చెప్పెను.

---

# ఏడవ ప్రకరణము

## దండయాత్ర

ప్రతిసైనికునకును, ప్రతియుద్యోగికిని, దండయాత్రయొక్క సమాచారము తెలుపఁబడినది. ప్రయాణమునకుఁ దగినయేర్పాటుల నొనరించుటకును గావలసినవస్తువుల సేకరించుటకును ధనము లొక్క

సమునుండి లేఁబడెను. 1572 వ సం॥ సెప్టెంబరు నెలలో పాదుషా సై
న్యము గుజరాతుయుద్ధమునకు సంసిద్ధమై బయలు దేఱెను. చక్రవర్తి
కొందు నెడలుట కాశ్నాపించి తనకు ప్రియమైనసిక్రీపట్టణమునకుఁ బోయి
యక్కడ నున్నవారిని గాంచి సేనను గలిసికొనుటకు నిశ్చయించెను.

దండయాత్రయనఁగా మనమిప్పుడు చూచుచున్న రెండుమూఁ
డుపట్టణములలోని జను లెల్లరును దమసర్వసామగ్రిని గైకొనియొకచోటికి గుంపుగాఁ బోవుట వంటిది. సుమారొక రెండులక్షలమంది మనుష్యులు, గుఱ్ఱములు, లొట్టియలు, ఏనుగులు, మందుగుండు సామానులు మొదలగువానితో బయలు దేఱి కొన్ని నెల లుండుటకుఁ దగిన యత్నముఁ జేసినయెడల నెట్టియేర్పాటులు వలెనో మనస్సుచేత నే యూహింపవలెను. లొట్టియలు, నేనుఁగులు బండ్లు మొదలగునవి సామానులను, డేరాలను, గొంతభోజనపదార్థములను మోసికొని ముందుబయలు దేఱెను. వీనితోఁ గొందఱు రక్షకు లాయుధపాణులై కాపుండిరి. వీరందఱునుగలసి బసచేయవలసిన మకామున డేరాలు వేసి వెనుకవారి రాకకై వేచియుందురు. ఈభారవాహకులకు ముందు మార్గ శోధకు లగుసైనికులు కొందఱు మంచిమెలఁకువగలవారై శత్రుసైన్యములు హఠాత్తుగా పైనిబడకుండ, మార్గము సురక్షిత మగునో గాదో యని జూచుటకుఁ బోయిరి. ఆగ్రాపట్టణమునుండి యీసేన లన్నియును గడలిపోయినదినమున నాయూరిప్రజలందఱును నెక్కడకో లేచిపోయినట్లు కనుపట్టుచుండెను. ఆపోయెడుబలమునందుఁ బది వేల యాశ్వికులు పారశీకమునుండి తెప్పించిన యుత్తమాశ్వములపై, నొక్కొక్కఁ డొక్కొక్క యాఱుమూరలపొడుగుబల్లెమును, దీర్ఘమైనయొక ఖడ్గమును రెండుచిన్నఛురికలును ధరించి బారులుదీరి ప్రయాణము సేయుచుండిరి. అక్కడక్కడఁ గొందఱాశ్వికులకడ తుపాకులును, విండ్లునుగూడఁ గలవు గాని యివి ముఖ్యాయుధములుగావు. వీరితరువాత

గజయూథము నడువఁజొచ్చెను. రెండువందలయేనుఁగులు బారులుదీరి నల్లనిమబ్బులవలె నడగొండలో యనునట్లు, మూర్తీభవించిన మృత్యుదేవతలో యనునట్లు ఖరిని, శుభ్రస్థలమునంతయును గప్పియున్న రెండంగుళములదళసరిగలిగి కత్తివాటునకు నాటుజెండని యినుపపగడులతో, మెఱుపులవలె మెఱయుచుండి దీర్ఘములైన రెండుదంతములకును గట్టఁబడినచుఱుకలతో సేనాపత్యాకారమున కంతకును గళయును గాంభీర్యము నగూర్చుచు బయలుదేఱెను. శత్రుసేనావాహినియం దుండునరుల శిరఃకమలములను మహోద్భాటితోఁ బగులగొట్టి కోటలోఁ బ్రవేశమును గలుగఁజేయుటకును నింతకంటె నెక్కుడుసాధనములు లేనేలేవు. ప్రతియేనుఁగుపై నున్నయంబారిలో, తుపాకులనుగాని విల్లమ్ములనుగాని ధరించి నలుగురు సిపాయిలు కూర్చుండి యుండిరి. ఏనుఁగులు నడుపునూవంతులుఁనునను చాపధారియై యంకుశమునం దారితేరి యుండెను. పెద్దగాలి మనూనము వచ్చినట్లు భూనూకాశముల నొకపెట్టునఁ గప్పియుంచి దారితెన్నులు తెలియనీయనివాగమంచువలె బయలుదేఱిన మెట్టనిధూళిలోఁ జుట్టబడినయిరువదివేవురుకాల్బంటు లీయేనుఁగుల ననుసరించి యథాస్థానమున బారులుగట్టి వెడలుచుండిరి. ప్రతివానికి నొకఖడ్గమును నొకదుపాకియును గలవు. దూరసమరమునందును సంకుల సమరమునందును సమయోచితముగురీతిని వారాయాయుధముల నుపయోగింతురు.

సైన్యము వెన్నంటి రాజామాన్‌సింగు, రాజాభగవాన్ దాసు, రతంభోరురాజు, సయ్యద్ మహమ్మద్ ఖాన్ బారహా, షాఖులీఖాన్ ముహారిం, రుస్తుమ్‌ఖాన్, మతలబ్ ఖాన్ మొదలగు యోధానుయోధులును, పాదుషా యంగరక్షకసైన్యమును, జనానాయును బయలు వెడలెను. ఈసారి పాదుషా యొక్కమహమ్మదీయభార్యలిరువు రాయనతో బయలుదేఱిరి. తక్కుంగల యున్నతోద్యోగులు

కొందఱుగుఱ్ఱములమీఁదను, గొందఱు బండ్లమీఁదను ప్రయాణము నరిగించుచుండిరి. మనయాబుల్ ఫైజీ; పల్కీమీఁదా లేకగుఱ్ఱపుబండి పై నెక్కిరి. చందనదాసు రహీములు వారివారిస్థానములయం దప్రమత్తులై పనిచేయుచుండిరి. రహీము తననూఱుగురాశ్వికులతోఁ గూడి ముందుండెను గాని చందనదాసుమాత్ర మున్నతోద్యోగులతోఁ గలసి వెనుక నడచుచువచ్చుచుండెను. పట్టణములో నున్నప్పుడే గాక యుద్ధసమయముననుగూడఁ జందనదాసు తనమిత్రుఁడగు నాబుల్ ఫాజల్ కడనే యుండునట్లు తటస్థించెను. సేన బయలుదేఱిన యల్పకాలముననే పాదుషా తనరక్షకవర్గముతో వచ్చి కలసికొనెను.

ఇట్లామహాసేనావాహిని ప్రయాణమై పోవునప్పుడు భూనభోంతరాళములు నిండినధ్వానములును, సైనికుల కత్తులధళధళలు, గుఱ్ఱముల హేషారవములు, చక్రముల చప్పుళ్లు, ఫిరంగిబండ్లమ్రోఁతలును, ధూళితోఁ గలిసి యొకపెద్దకార్చిచ్చువలెఁ దోఁచుచుండెను. వారు మార్గమునందు బసలఁ జేయుచు, డేరాల వేసికొనుచుఁ బ్రయాణమును సాగించుచుండిరి. దారిలో నేపల్లెటూరికడ విడిసినను, అక్కడి జలాధారములగుఱించియును, పంట లెట్లు పండుచున్నదియు, ప్రజల యారోగ్యస్థితియును, అక్బరు స్వయముగానైనను, ముఖ్యులగు రాజకీయోద్యోగులచేతనైనను ప్రజలనుండి కనుఁగొనుచుండెను. దూరమున నుండుపల్లెలలో భూములను సాగుచేసి, తాము పండించినదానిలోఁ గొంతభాగమును రాజ్యముయొక్క కర్చులకుఁగాను బీదరహితున కిట్టిసమయమునఁ గాకున్న మఱియెప్పుడు రాజదర్శనము గలుగఁగలదు? ఆగ్రా మొదలగుపట్టణములలో నుండి జనులెల్లరు నెప్పుడో యొక్కప్పుడు బాదుషాను జూచుచుండుటయేగాక వారలకుఁ గల్గినకష్టసుఖముల ననేకపర్యాయములు మొరపెట్టుచుం

డుటయును గలదు. ఈ సంగతుల నాలోచించి పాదుషా రహితులకు దర్శనమిచ్చి వారివలనఁ దనయుద్యోగులు తమతమకృత్యముల నిర్వర్తించుటలో నెట్టిదౌష్ట్యమును జూపుచుండిరో యనువిషయమును గూడఁ గనుఁగొనుటకుఁ బ్రయత్నించుచుండును.

యుద్ధమునకై బయలు దేఱు సైన్యములు సాధారణముగా జనులుపోవుపుంతలలోఁ బోలేవుగనుక నాసేనలేవైన సస్యపూర్ణములైన పొలములలోఁ బడి పోవలసివచ్చునెడల నట్టి కార్యమువలన నాభూస్వామికిఁ గలుగునష్టమును యాధనము నాతని కొసంగుచుందురు. ఆ సొమ్ము చెల్లించుకాలమున స్వయముగాఁ జక్రవర్తిగాని యాతనిచే నియమింపఁబడిన యొక ముఖ్యోద్యోగిగాని దగ్గఱ నిలువఁబడి యుందురు. లేనిచో నాధనమును సరిగాఁ జెల్లింపక రుసుములను గ్రహించి బీదరైతులను గ్రిందియుద్యోగులు బాధింతురని యక్బరునకుఁ దెలియును. అహాహా! ఇట్టిప్రజాహితైకదీక్షితుఁడైనరాజు పరిపాలించుచుండఁగాఁ బ్రజల కేలోటు గలుగును?

సిక్రీపట్టణమునుండి బయలుదేఱిన యక్బరుపాదుషా తనసైన్యమును జేరి జయపురమునకు దక్షిణమందు పదునెనిమిదిమైళ్ళదూరమున నున్నసంగనేరుపట్టణముపైఁ బడి ముప్పదియైదుదినములలో నజ్మీరు పట్టణమును జేరెను. అచ్చట రెండుదినములు బసచేసి సమీపమున నుండినయొకమహాత్మునిగోరీని దిలకించి తనభక్తిని వెల్లడించుకొనెను. మదాంధులై, రాజ్యగర్వముచే మిన్నుమన్నుఁ గానక ప్రజలను దోమలకంటెను సీగలకన్నను గూడ నధములుగా భావించెడు రాజాధములవలెఁగాక, పరమేశ్వరావతారములైన మహాపురుషులనామములన్నను వారిస్మారకచిహ్నములన్నను నక్బరునకుఁ జాలగౌరవము. ఆ కారణముననే యాతఁడు సాధారణముగా నిట్టిమహాపురుషులగోరీలను దర్శించుచుండును. తరువాత నక్బరు తనసేనాసముదయమును జీల్చి

యెనిమిదివేలయాశ్వికదళమును మార్గశోధకులుగాఁ బనిచి మిగిలిన సైన్యముతో మెల్లగాఁ గదలి కతిపయదినములలో జోధపురమునకు డెబ్బదిమైళ్ళదూరములో నున్న నాగూరుపట్టణముకడ విడిసెను. వారికిఁ గావలసిన సామగ్రుల నచ్చట సంపాదించుటకుఁ జక్రవర్తి యాజ్ఞాపించెను.

ఆనాగూరుపట్టణపరిసరమున నెన్నియో డేరాలు వారికొఱకు నిర్మింపఁబడెను. అందు చక్రవర్తిడేరాలు మహోన్నతములై పట్టుగుడ్డలచేఁ గల్పింపబడి మిన్నుదన్నుచుండెను. పండితులతోను, నుద్యోగులతోడను గలసి యాలోచించుటకుఁ దగినమహాలులు గరిడీశాలలు శయనాగారములు, పూజామందిరములు, మొదలగునవి యెన్నియో యందు గూర్పఁబడినవి. క్రింద పరుపబడిన తివాసీలు, పట్టుపఱుపులు, వేయబడినకుర్చీలు, సోఫాలు లెక్కకు మిక్కిలియై యాగ్రాపట్టణములోని రాజసౌధముల కేవిధమునను నిడుదీయకుండెను. చక్రవర్తియొక్క డేరాల చుట్టుప్రక్కలఁ దక్కినయుద్యోగులడేరా లన్నియును నిర్మించిరి. అందొకదానిలో షైజీ పహామేదాతో గలసిచుట్టునుండుప్రకృతిరామణీయకమును, సృష్టిరచనాసౌందర్యమును దిలకించుచు సంతుష్టాంతరంగుఁడై యుండెను.

ఒకనాఁడు సాయంకాలమున సకలోద్యోగులును బరివేష్టించి యుండ పాదుషా కొలువుచేయుసమయమున నొకయాశ్వికుఁ డాగ్రావైపునుండి శిబిరముకడకుఁ బరువెత్తికొని వచ్చుచుండెను. వానిని గాంచినతోడనే కొందఱికి శత్రువు లెవ్వరైన నాగ్రా పట్టణముపై దాడివెడలిరో యనియునుఁ గొందఱి కేమి యుపద్రవముప్పతిల్లెనో యనియును, నింకగొందఱి కేసంతోషవార్త దెచ్చుచున్నాఁడో యని యును, సందియములు గలుగసాగెను. ఆవార్తాహారి హాజర్ మనవిచేసికొని లోని కరుదెంచి యక్బరుచక్రవర్తికొకకుమారుఁడు గలిగెనని

తెలిపెను. ఆవార్త వినినతోడనే యాతఁ డెంతయో సంతసించి, తానుబయలు దేఱినదిన మత్యంతసుదిన మని పల్కుచు నాయాశ్వికునకుఁ దగిన బహుమానము నొసరింపఁగా నక్కడివారందఱును సంతసించిరి. షైజీ వెంటనే లేచి నూతనరాజపుత్త్రున కష్టైశ్వర్యముల నొసంగి కాపాడవలసినదని పరమేశ్వరుని ప్రార్థింపగా నొకముత్యాల హారమును బహుమానము వడసెను. దగ్గఱ నున్నయుద్యోగులందఱకును ఫలము లొసంగిరి. సైనికులకానాఁడు భత్యము రెట్టించిరి. పిల్లవానికి "ధ్యానియల్" అను నామము నుంపవలసినట్లాజ్ఞాపించుచు నక్బరు వర్తమాన మంపెను.

అక్కడ మఱి నాలుగుదినములు నివసించి మహానందసాగరని మగ్నుఁడై తనసైనికులఁ దీసికొని గుజరాతుదేశముఖమున నున్నపట్టన్ అనుపట్టణముకడ నక్బరు విడిసెను. సరస్వతీనదీతీరమున నున్నయానగరమున కధిపతియైన "షేరుఖాన్" అనువాడుమహాసైన్యముతో ఢిల్లీశ్వరుఁ డరుగుదెంచుటఁ గాంచి భయమున రాజ్యమును విడిచి పాఱిపోయెను. అక్బరుపాదుషా యకార్యమును గాంచి తనవారిలో నొకఁడు సయ్యద్ అహమ్మద్ ఖాన్ బార్హా యనువాని నమీరుం జేసి యహమ్మదాబాదునకు బయలుదేఱెను. గుజరాతున కంతకును నవాబైన ముజఫరుషాయును, చక్రవర్తిదాడిని గుఱించి విని, వడవడ వడఁకి యాతని నూదార్యమును క్షమాగుణము నెఱింగినవాఁ డగుటచే, నెదురేగి శరణుజొచ్చెను. అది గాంచి అక్బరాతనినే తిరిగి గుజరాతున కంతకును బట్టాభిషిక్తుని జేసెను. ముజఫరుషా నామమునకుమాత్రమే రాజుగాని సూరతు, బ్రోచ్, కైరా మొదలగు స్థలములలోని యాతనిక్రిందియమీరు లందఱును నిదివఱకే తిరుగఁబడిరి. ముజఫరుషా సులువుగావశుఁ డయినను వానిక్రిందియమీరులను లోఁగదీయ

టయే యక్బరునకుఁ గష్టతర మయ్యెను. అయిన నింత దేశము జయించిన యక్బరు చక్రవర్తి యనామధేయు లగునమీరులకు భయపడి వెనుకకుఁ దిరుగునా !

## ఎనిమిదవ ప్రకరణము

### యుద్ధము

సాధారణముగా నాపదలయందుమాత్రము పరమేశ్వరుని స్మరియించి, సంపదలయం దాతని మఱచుట మానవుని స్వభావముగా నున్నది. సంపదలయం దాత్మప్రాబల్యము మానవున కుత్సాహము గలిగింపఁగాఁ దనసహాయముననే మఱచి స్వప్రధాన్యతనే యాతఁడు మాటిమాటికి స్మరణ మొనరించుకొనుచుఁ బరమేశ్వరుని మఱచిపోవును. కష్టకాలమునం దాతనికిఁ దనయల్పతయు, నిస్సహాయతయు, నిర్వీర్యతయును గోచరము గాఁగాఁ బ్రపంచమున తానొకమానవమాత్రుఁడై యన్యులతో సమానుఁడే యనియును, దృశ్యమైన విశ్వముకంటె నెన్నియో మడుంగు లధికుండైన పరమేశ్వరుఁ డున్నాఁడనియు నాతని సహాయముననే యన్నియును జరుగు ననియును, స్మృతికి వచ్చును. సామాన్యులిట్లాచరించుచుండినను ధీరులుమాత్ర మెల్లకాలమునను నొకేభావముతో నుందురు. "పరమేశ్వరుఁడే లేఁడు; ఉన్నను దటస్థుఁడు; ఆతఁ డల్పములయిన ప్రపంచవ్యవహారములలోఁ గలుగఁ జేసికొనఁడు; సర్వమును స్వశక్తిచేతనే జరుగుచున్నది—" అనువారన్నికార్యములను స్వీయప్రభచేతనే సాధించి సుఖదుఃఖములయందును లాభాలాభములయందును గలఁగకుందురు. మఱికొందఱు మహానుభావులు సర్వము పరమేశ్వరనిర్మితమే యని నమ్మి యాపదలయందును సంపదలయందును నాతనిని సమముగా స్మరియింతురు.

అక్బరు గర్వపురుషులలో మూఁడవ తరగతిఁ జేరినవాఁడు. తన కిప్పుడు లభించినసామాన్యములైన జయములచే బరమేశ్వరుని స్మరణకుఁ దెచ్చుకొనెను. సృష్టిలో మహాగంభీరమగు సముద్రమును దిలకింపవలెనని యుత్సాహముచే నాతఁడు సమీపమం దున్న కాంచీపురమున కేఁగెను. మధ్యదేశమునందు జన్మించి సముద్రమును గేవలకవి వర్ణనములచే నూహించిన పాదుషా కాదృశ్యము మహాశ్చర్యమును గలిగింపఁగా నతఁడు సమత్వమును దాల్చెను. ''భయంకరములై, మహాశక్తిసంపన్నములై, యనన్యాదృశములై యీ ప్రపంచమహాభూతములలో నొకటైన జలరాశి యనఁదగు రూపమీ మహాసముద్రము మానవుని సముద్రముతోఁ బోల్చ నాయెడల నల్పత్వమునకు వచ్చును. జలనిధి యుపరిభాగమున బొమ్మలవంటి యోడలలో నాడుచు నేనే సర్వేశ్వరుఁడ నని గర్వించు నియల్పుఁడు, తన గర్వముతోఁ గూడ నామమాత్రావశిష్టమై యొక్క నీటిబిందువు వలె నందు లీనముఁ జెందును.'' అని లోఁదలంచుచు నీశ్వరుని యున్నతి నక్బరు ధ్యానించెను. దగ్గఱనున్న సైనికు ముందున్న దృశ్యమును గాంచి తాండవమాడెను. ఆశుకవిత్వమును జెప్పెను.

ఇఁక నక్బరు వశపఱచుకొనవలసినవి బ్రోచ్, సూరతు, కైరా యను మూఁడు స్థానములు. తన సైన్యమును మూఁడుభాగములుగా విభజించి యొకదానిని సూరతుదేశమునకును, ఇంకొకభాగమును బ్రోచ్‌కూఁడికిని బంపి యల్పసంఖ్యాకులైన సైనికులతో తాను శిబిరముకడఁ గూరుచుండెను. బ్రోచ్‌ను ముట్టడించిన సైనికులు జయమును బొందిరి. గాని యక్కడివైరి తనతమ్మునితోఁ గలసి యుద్ధము సంపత్కారముగా నుండుటలేదని తెలిసికొని, యపారములైన సైన్యములతోను నాయుధములతోను బట్టణమునుండి పాఱిపోయి దక్కనందను స్నేహితులతోఁ గలిసికొనుటకుఁ బ్రయత్నములు

సలుపుచుండెను. వారు పాఱిపోవుచు మార్గమునం దొక మొగలు ముఖ్యోద్యోగి యొంటిపాటుగా నుండఁగాఁ బట్టి సంహరించిరి. ఈ సంగతి నెఱింగియుఁగూడ నక్కడి పాదుషా సైన్యాధిపతికి దుర్గమును విడిచి వారిని వెంబడించుటకు వీలు చిక్కినదికాదు. విజయము సంపూర్ణము కానిసమయమున, నాల్గుమూలలనుండియును శత్రువులు విజృంభించుచుండఁగను జయించినపట్టణమువీడి, పారుబోతుల వెంబడించుట యుపాయకరము. ఈసంగతి నెఱింగి యక్కడి సైన్యాధికారి సర్వమును బాదుషాకు నివేదించుట కొకవార్తనంపెను. ఇది యంతయును వినిన యక్బరునకు విషమావస్థ వచ్చెను. పాఱిపోవుచున్న శత్రువును విడిచి యూరకుండినయెడల నాతఁడు తక్కిన మిత్రులతోఁ గలసి యధికశక్తిగలవాఁ డగును. అప్పుడు గోటితో నగుదానికి గొడ్డలి గావలసివచ్చును. వారి నెదుర్కొని సమర మొనరించుటకుఁ దగినసేన లక్బరుకడ లేవు. తక్కినసైన్యమంతయును గార్యాంతరమునఁ జిక్కువడి యున్నది. సమయము వచ్చినప్పుడు జంకక నడుము గట్టుకొని పనిచేయుటయే వీరులనైజము. పరికర దౌర్బల్యముచే భయపడి వారెన్నఁడును వెను కంజ వేయరు. వారి యపార తేజస్సు ముందు చిక్కులు సూర్యకిరణములచేత మంచువలెఁ గరఁగి యదృశ్యములయిపోవును. తనకడఁ గల యల్పసంఖ్యాకు లగు సైనికుల తోడనే శత్రువుల నెదురుకొనుట కక్బరు నిశ్చయించెను.

అక్బరువెంట రాజా భగవానుదాసు, రాజా మాన్‌సింగు మొదలగు ముఖ్యోద్యోగులు బయలుదేఱిరి. ఎక్కడికిని బోవుట కానతి లేనందున చందనదా సచ్చటనే యుండి యుద్ధముసేయుటకు వీరి ననుసరించెను. వీరందఱును రెండుదినములు ప్రయాణమొనరించి మాహేంద్రీనదియొడ్డున కేగిరి. దాని కావలిగట్టున శత్రుసేనలు విడిసియుండుటను గ్రహించి ప్రయాణ మాఁపి యాసేనలసంఖ్య

యెంతవరో తెలిసికొనుటకుఁ బ్రయత్నించిరి. రాజాభగవానుదాసు కొంచెము ప్రక్కకు వంగి తమసైనికులకంటె నిరువదిరెట్లధికులగు సైనికు లచ్చటనున్నారని తెలియఁజేసెను. తత్క్షణ మత్యల్పమగు సేనతో వారిపైఁబడి యుద్ధమున నాశన మందుటయా, లేక వారిని విడుచుటవలన వచ్చు చిక్కులకు లోనుగావలసి నదా? ఇటు చూచిన నూయియు, అటు చూచిన గోయియు. గనుపట్టుచున్నది. ఇది గాంచి రాజామాన్‌సిం గీసలహా నిచ్చెను. “ఇప్పుడు శత్రువులతో యుద్ధముసేయుట దుస్సాధ్యము. తిరిగి పోవుటకు వీలులేదు. వారిని విడుచుటయు నైతిగాదు. కావున నీరాత్రి యంతయు నీతుప్పలచాటునఁ గడవుటయే యుక్తము. తెల్లవారుసరికి మనమిత్రులలోఁ గొందఱైనను వచ్చి కలిసికొందురు.” ఆసలహాప్రకారము రాత్రి యంతయును చెట్లక్రింద సైనికులతోఁ గలసి చలిగాలి తాకున కెరకై యక్బరుపాదుషా నిలువవలసివచ్చెను. ఆయనగాని తక్కిన రాజపుత్రులుగాని యీస్థితిని హీనముగా నెంచలేదు. నలుగురితో చావు వారికిఁ బెండ్లివంటిది. సైనికులు యుద్ధము నరించుచు నిజశిరస్సులను రణరంగమున కర్పించుచుండఁగా సుఖ మనుభవించుచు శిబిరమునఁ గూరుచుండుట కక్బరొప్పుకొనువాఁడు గాఁడు. పెద్దచలిగాలి వీచి వారంకఱును నొకచోఁ జేరి గుంపుగాఁ గూడి నప్పు డక్బరునకును రాజామాన్‌సింగుకు నీసంభాషణజరిగెను.

మాన్‌సిం — మహాప్రభూ! తమ రిచ్చటికి విచ్చేసి యిట్లిబ్బందిపడనేల? నాకీకార్యము నొప్పఁజెప్పిన నొనరింపకుందునే—

అక్బరు—దీనికొకదృష్టాంతము దెలిపెదను. ఒకసారి మాతాతయగు శాబరుమహావీరుఁడు రాత్రి యంతయును సైనికులతోఁ గడపవలసివచ్చెను. వారుండినపర్వతముపై నాఅంగుళముల దళసరిగా మంచుపడెను. ఒక్కమనుష్యుఁడుమాత్రము కూరుచుండుటకుఁ దగిన

వైశాల్యముగలిగిన యొక చిన్నగుహ లభించఁగా సైనికు లందఱు గాయపడిన సందుఁ గూరుచుండుమని ప్రార్థించిరి గాని యాతడు 'నలువురితో చావు పెండ్లివంటిది. నేనిక్కడనే కూరుచుందును' అని పల్కి రాత్రియంతయు నచ్చటనే గడిపెను. అట్టి మహాపురుషులచరిత్రములు మన కాదర్శప్రాయములు.

ఈమాటలు విని యందఱును సంతసించిరి. సాయంకాలమున నచ్చటి కక్బరుతో వచ్చినవారు నలువదిను దిన్నె యుండిరి గాని తెల్లవారుసరికి కింకొకయిరువదిమంది వచ్చి కలిసిరి. మొత్తము నూర్గురును గలసి ప్రక్కనున్నసర్నా యనుపట్టణములో నిలిచిన వైరుల వేయుమంది సైనికులతోఁ గలసి యుద్ధమొనరించుటకు నిశ్చయించిరి సేన బయలుదేఱుటకు ముందు చక్రవర్తి స్వయముగా వారి నిట్లు హెచ్చరించెను.

'సైనికవర్యులారా! వైరివర్గము లెక్కకు మిక్కిలిగా నున్న దని మీరు జంకవలనుపడకుఁడు. ఈదినమున జయము సంపాదించుట యొండె పరమేశ్వరుని మందిరమున నతిథులమై యుండుట యొండె జరిగి తీరవలసినది. దేశమందలి ప్రజలిడుములఁ గుడుచుచుండఁగాఁ జూడలేక మనము యుద్ధమారంభించితిమి గావున మనదిధర్మప్రధానమైన యుద్ధము. హిందూమహమ్మదీయు లిరువురును భేదరహితులై సోదరులవలెఁ గాలక్షేపము సేయుచున్నారు. ఈదేశమునం దెన్నిదినముల నుండియో వాసము చేయుచుండుటచే మహమ్మదీయులును హిందువులతో నన్నివిధముల నొనరించికొంటిరో యానాఁడు హిందూదేశమున్నస్థితికి వచ్చినది. న్యాయైకపక్షపాతులై యేనాఁడు వర్ణవిభేదము లేక మీరు మెలఁగుటకుఁ బ్రారంభించిరో యానాఁటినుండియు దేశమభివృద్ధిని జెందుట కారంభించినది. వ్యాగ్రూపముననే గాక కార్యరూపమునఁ గూడఁ బరిణమించిన యీమైక్యత ధర్మసామ్రాజ్యసం

స్థాపనమునకు కారణ మగుచున్నది. చిన్నచిన్న రాజులదాడికి నిలువలేక బాధలు పడుచున్న గుజరాతుప్రజల సదయుఁడు రక్షించి శత్రువులను నిర్మూలింపుఁడు వైరివీరులఁ జెండాడి మీ నామములను చరిత్రయం దాచంద్రతారార్కముగ నిలిపి శాశ్వతకీర్తిని గాంచుఁడు. హిందూ వీరులగు రాజపుత్రులయందు మహాపురుషుఁ డగు శ్రీరామచంద్రుని రక్తము ప్రవహించుచున్నది. మహమ్మదీయవీరులరక్తనాళములఅందు పరమేశ్వరాంశసంభూతుఁడైన మహమ్మదుమహాప్రభునిరక్తము చలిం చుచున్నది. అట్టి మీయందు శౌర్యాగ్ని కలుగుట సహజము. అట్టిమీ శౌర్యాగ్నికి శత్రుసేనల నింధనములు గావింపుఁడు. ప్రజల కిబ్బంది గలిగించుటలో, ఘాతుకులైన యీమార్జాలను చంపిగాని పట్టిగాని తెచ్చినవారికి గొప్పబహుమానము మీయఁబడును'' అని పల్కుసరికి సైనికులకు వీరావేశ మెత్తి యొడలు తెలియక "అల్లాహోఅక్బర్'' అని యఱచిరి. ప్రతిసైనికుఁడును ఒక పరశురామమూర్తివలె విజృం భింపసాగెను.

వెంటనే వారలు నదీప్రవాహమున దుమికి కొట్టుకొనిపోవు చున్న నీటివడికి నిలిచి ప్రయాణము చేసిరి. గుఱ్ఱములపైనున్నరికా పులు తడిసి నాలుగుకాళ్ళను మునిగిపోయినగూడ నాయశ్వములు జం కక యావలియొడ్డును జేరుకొనిరి. ఇఁత హఠాత్తుగా వచ్చి తమపైఁ బడిన మొగలుసైన్యములను మార్జాలు చూచి నివ్వెఱపడిపోయిరి. సుమారొకవందసైనికులకంటె నెక్కువ మొగిలులు లేరని యెఱింగియు గూడ శత్రువులు వారికే ముందు వచ్చి పోరాడవలసిన బాధ్యతను విడిచివేసిరి. మొగలుసైనికులు ముందునకు వచ్చుచునే యుండిరి. శత్రువులందఱును పదను వేచి యొక్కసారి వీరిపైఁ బడిరి.

రాజమాన్ సింగు యుద్ధమునందుఁ జాల నేర్పరిగావున నెప్పుడే రకముగా యుద్ధము చేయవలెనో యెఱుంగును. వైరులసంఖ్య యధి

కముగా నుండుటచే నొక్కపరి రివ్వునఁ బోయి వారిసమూహమును రెండుగాఁ జీల్పవలసిన దని యందఱికిని నాజ్ఞ యిచ్చెను. నూఱుగు రాశ్వికులును దమబల్లెములను ముందునకు వంచి యెదురుగా నున్న సైన్యములోనికిఁ జొచ్చుకొనిపోయిరి. వారిసైన్యములు బిగువు దప్పి గజిబిజియై పోయెనుగాని మొగలులుమాత్రము చెక్కుచెదర లేదు. వెనుకకుఁ దగ్గుచున్న విరోధిసైన్యముల వెంబడించి రాజమాన్‌సింగును, నాతనియనుచరులును, బొమ్మజెముడుదుప్పలతోఁ జుట్టబడి యున్న యొకపుంతలోఁ జిక్కుకొనిరి. ఆపుంత పొడవై రెండుప్రక్కలను గోడలవలె దుర్భేద్యమైన ముండ్లకంపలచే నావరింపఁబడుటచేవారికి ప్రక్కకు మసలుటకు సందులేకపోవుటయే గాక ముగ్గురాశ్వికులు కంటె నెక్కుడుమంది యొక్కవరుసగా నిలువఁబడుటకు వీలులేకుండెను. మొగలుసైన్యమంతయు నాపుంతలోనికిఁ జొరఁబడుటఁ గాంచిమిర్జాలువెనుకనుండి వచ్చి డీకొనిరి. అక్కడ నక్బరుచక్రవర్తియును, మానసింగు భగవాన్‌దాసులును నుండుట గ్రహించి వైరులు మరింతధైర్యముతోఁ బనిచేయుటకుఁ బ్రారంభించిరి. సర్వసేనానియగు మానసింహుఁడును, మహామంత్రి యగుభగవానుదాసును సర్వాధికారి యగు పాదుషాయును కానికి కొరగానిసామాన్యసైనికులతో బాహాబాహిని పోరాడవలసినస్థితి వచ్చియుండఁగా కన్నారఁ గాంచినమొగలువీరుల శరీరములయందలి రక్తముదుకసాగెను గాని బోనులోనిసింగపుఁగొదమలవలె వెనుకఁ జిక్కుకొనిన వీరేమిచేయఁగలరు? ముప్వురు వీరులును, ముప్వురుసైనికులతో యుద్ధము సేయుచుండిరి. భగవానుదాసు తనతో యుద్ధముసేయువాని నొకసారి తనబల్లెముతో గాఢముగాపొడువఁగా వాఁడు నేల కొరఁగెను గాని తానును తనగుఱ్ఱమును నావేగమునకు తాళలేక వెనుకకు తగ్గిపోయిరి. తక్కిన యిరువురు వీరులును సైనికులతో హోరాహోరిగాఁ బోరుచుండుట చూచి

వెనుకనున్న చందనదాసునకు కడుపులో మండఁజొచ్చెను. భగవాను
దాసు వెనుకకుఁ దగ్గుటచేఁ గలిగినసందులోనుండి చందనదా సెట్లో
మెల్లగఁ దప్పించుకొని పాదుషాప్రక్కనుండి ముందునకు వచ్చిపడెను.
ఇంతలో ముందు యుద్ధము చేయుచున్న యిరువురు సిపాయిలును
జచ్చిరిగాని యెంతకాలము వారిరువురు నట్లు పోరఁగలరు? పాదుషా
మొదలగువారికిఁ గలిగినశ్రమ, తనకుఁబుట్టించిన కడుపులోనియుక్కును
మైనను యుద్ధమందు శౌర్యాదులఁజూపించి పేరువడయువాఁడనను
నాశయును గలసి స్వాభావికముగా బలశాలి యగుచందనదాసు బల
మును, ధైర్యమును బదిరెట్లు వృద్ధిపరుపఁగా నాతఁడు లయకాలరుద్రు
నివలె పెచ్చుపెరిగి తనముందుండు నిరువురు సైనికుల నొక్కడే తాఁకి
యత్యద్భుతమైన యాహవక్రీడ సలుపుచుండఁగాఁగా వెనుక నున్న
వారని వ్వెరపడిచూచుచుండిరి: తనతో యుద్ధము చేయుచున్నయిరువు
రు సైనికులును మృతులు కాగానే మఱియిద్దఱు యుద్ధమునకు వచ్చిరి
గాని పూర్వవికాసమును పూర్వధైర్యమును, వారియందు లేదు.
ఇంతలో సేనాని యగుసూనసింహుఁడును చందనదాసుతోఁ గలసి
జోడుపెద్దపులులరీతిని బోరాడుచుండ శత్రుసైనికులు ప్రాణములపై
నాశచే వెనుకకుఁ దగ్గిరి. వారి వెనుకవారు మఱింత వెనుకకుఁదగ్గిరి.
ఇట్లు వెనుకకుఁ దగ్గుసేనావాహినిని జూచుకొని మొగలుసైనికులు
మరల బాణవేగముతో దాడిసేయఁగా నొకరిపై నొకరు శత్రువులుపడి
కలవరము గల్పించి హాహారావములు పుట్టించిరి. మొగలులకనుపట్టు
దలయు శౌర్యము నంతకంతకు హెచ్చుటచే నమ్ములపొదిని
ద్రిమ్మరింపగా నేను నేను ముందని బయటికి వచ్చునిశితబాణపరం
పరవలె మహావేగమున ముందునకుఁ జొచ్చుకొని మొగలులు వచ్చు
చుండఁగా శత్రువులు మఱింత కలగుండుపడి కేకలు వేయుటకుఁ బ్రారం
భించిరి. ఇంతకుముందు వారికి జరిగినయోటమిచేతను, ఇప్పుడు సైని

బడుచున్న యుపద్రవములని భయముచేతను, స్వాభావిక మగుపిఱికి తనముచేతను గొందఱు పాఱఁదొడంగిరి. అపరుగెత్తువారిని గాంచి మిగిలినవారును, గాలికి బుద్ధిచెప్పుటయే మేలని యెంచి పరుగెత్తిరి. ఇట్లు పాఱుచుండువారలఁ గాంచి చేయున దేమియును లేక మీర్జాలును వెనుకకుఁ దగ్గిపోవ వలసివచ్చెను. మీర్జాల కార్యమును జూచి యోటమినధికారులే యొప్పుకొనిరని భావించి, నీచులగుటచే పొండిపొండి యని యఱచుచు మిగిలినయల్పసంఖ్యాకులును వెనుకటివారిమార్గము ననుసరించిరి. కొంతమంది యనుచరులతో మీర్జాలును చేయునది లేక పరుగిడిరి. ఒక్కక్షణములో నక్బరుసార్వభౌముని జయలక్ష్మి వరియించెను. అక్బరుచక్రవర్తి తనప్రక్కనున్నమాన్‌సింగు చందనదాసులను గాంచి యొక్కచిఱునవ్వు నవ్వి వారొనర్చిన కార్యమున కెంతయు సంతోషమును జూపించెను చందనదాసు వంగి సలాము చేసి "శరీరమునం దెన్నిపోటులు దగిలినను తల చిదుకబొడవకుండ విడిచినపా మెంత యుపాయకరమో, మీర్జాలును నంతయుపాయకరమైనవారు. వారిని వెంబడించుట కనుజ్ఞయైనయెడల వెంటనే పట్టుకొనుటకుఁ బ్రయత్న మొనరించెదను" అని చెప్పి యంగీకారసూచక మగు భ్రూచలనమును పాదుషానుండి గ్రహించి పాఱిపోవు మీర్జాల నయిదుగురు మిత్రులతో వెంబడించెను.

---

## తొమ్మిదవప్రకరణము.

### ఫహేమీదా.

కొంతసైన్యము బ్రోచ్‌దేశమునకును, కొంత సూరతుదేశమునకును మిగిలినది చక్రవర్తితోడను బోవుటచే మొగలుశిబిరము ప్ర

త్తమై యుండెను. డేరాలను గాచుచు పహరాయిచ్చు సిపాయిలును, శిబిరమును రక్షించుటకు నిలుపబడిన యల్పసంఖ్యాకులైన యాశ్వికులును, జనానాలోని స్త్రీసేవకులును, రాణులు వారిపరివారమునుదప్ప నితరు లాముకాముగ లేరు. మిత్రుఁ డగుచంద్రదాసును, సోమకుఁ డగుపాదుషాయును, తక్కినసుభ్యోద్యోగులును వెడలియుండుటచే నైజీల్ ఫహీమిదాయే యన్నియు నయ్యెను. తనుగుడారమునుండి బయటికి రాకుండ సారస్వతవిషయములను, కవిత్వతత్వమును, గ్రంథసాదృశ్యప్రాశస్త్యములను జర్చించుకొనుచు, దినములుగడపవలసివచ్చుటచే విసుగుచెందిన యొకనాటిసాయంకాలము సుమారు నాలుగుగంటలవేళ నైజీ, ఫహీమిదా లిరువురును చల్లనిగాలిలో నానందించుటకును, దమస్థానమైన ఢిల్లీ కెన్నియామైళ్ళదూరమున నున్నయీపరిసరము లెట్లుండునో దిలకించుటకును గుడారములపీడి యొకమైలుదూరమేగిరి. ఎల్లకాలమును పట్టణములో నివసించి యుండెడి యాతాయాతాఖిల పౌరుషకృతవాగ్జనితశబ్దములును, నిరంతర రథసంచాలనాజనితనేమీ ధ్వానములను, చిల్లులుపోయిన చెవుల కీప్రశాంతత రమ్యానిర్యాహ్వానమును గొలుపుచుండెను. అట్టి నిర్మానుష్యమైనబయలున గొంతసేపు దూర మేఁగిక వారు నడచి యుద్దాగా వచ్చినయొకకాలిబాటనుదాటి ప్రక్కనున్నయొకచిన్న యెత్తుబండపైఁ గూరుచుండిరి.

వారచ్చోటఁ గూరుచున్నకొంచెముసేపునకు సూర్యుఁడు పశ్చిమదిక్సీమాంతమును జేరఁబోవుచుండెను. అయినను సర్వస్థలములయెడల నిర్మలముగా నుండుటచే నాతనికిరణములు సాపుగా సరాసరిగా ప్రకాశమానములై వీరిరువురనుగప్పుచుండెను. సర్వసద్గుణాలవాలమై నిర్మలమై, సద్భావపరంపరాస్థానమై యొప్పారుసత్తమమానవునిమనస్సీమ నొకానొక కారణమున జనియించుదుఃఖమువలె, దశదిశలవ్యాపించి రోదసీకుహరమునఁ గప్పిన మహామహుని యశోవ్యాప్తియందల

చిన్న యుపయుకమ్మవలె. ఒక చిన్న మేఘముమాత్రమున్నను, సూర్య బింబము వెంత మసలునుండెను. మెల్ల మెల్లగా నామేఘశకలము రవి బింబమును గప్పగా నింతకు ముందు నిరాఘాటములైన యాతనికిరణ జాలములు తిరోభూతములయ్యెను. అట్లు మేఘాచ్ఛాదితుడైన సూర్య భగవానుని గాంచి స్వభావముచే కవయిత్రియగు ఫహ్మీదా షైజీతో "కాలమేఘముచే గప్పబడినప్పుడు మహాపురుషుల తేజస్సుగూడ నీతీరుననే తిరోభూత మగుచున్నది. కాలమును విలంఘించుశక్తియీ సచరాచరభూతసంఘమందెక్కడను గనుపట్టదు గావుననే సహస్ర కిరణుడుగూడ మెల్ల మెల్లగా నపరాంబుధియందు దిష్టములేక గ్రుంకు చున్నాడు అపనిగుతించియే పక్షులు మొదలగునవి కిలకిలారావములు సేయుచున్నవి." అనియెను.

అంత షైజీ యిట్లు జవాబు చెప్పెను. "సహస్రకిరణుడు మేఘముచే గప్పబడియుండె ననుట వాస్తవమే గాని యది క్షణకాలము మాత్రమే యుండును. ఆమేఘము దిగిపోయిన వెనుక నాతడు తొంటికంటె నెక్కుడుగా వెలుగగలడు. అట్లే మహాత్ములకు కష్టములు వచ్చిన నవి విశేషకాల ముండవు. మేఘములచాటున నున్నను నామహాత్ముని తేజస్సెట్లు ప్రపంచమునకు మార్గదర్శకముగా నున్నదో చూడుము మహామహులు కష్టమువచ్చిన కాలముననే యెక్కువశోభిల్లెదరు. సూర్యబింబము మేఘాచ్ఛాదితము గానప్పుడు కిరణములు గొంచెము తీక్ష్ణములై యుండెనుగాని యిప్పుడాతని కాంతు లెంతమనోహరములై యానందజనకములుగా నున్నవో యోచింపుము. కష్టములు వచ్చినప్పుడే పురుషులయొక్క శక్తులు బయటబడి ప్రపంచమున కాదర్శప్రాయములై యొప్పుచుండును. సూర్యభగవానుడపరాంబుధియందు గ్రుంగుట, మరునాడత్యంతాశ్చర్యాపహమైన ప్రతిభతో నుదయించుటకొఱకే యని యెఱుంగుము." అని వారిట్లు సంభాషి-

చుచుండఁగా నొకచిన్న కాపుపిల్ల యొకమూరికి పేలికి ధరియించి ప్రక్క నుండి పోవుచుండెను. కొన్ని పాత్రలతో నిండినయొకతట్టను తలపైఁ బెట్టుకొని, దానిపై దినమెల్ల కష్టపడి యేరిన చిదుగులకట్ట నొకటి పెట్టి యింటి కేగుచున్న యాబాలికను గాంచి ఫహ్మీదా గొంతెత్తి పిలిచెను. క్రిందను ధరించిన యొక చిన్నగోచితప్ప శరీర మంతయు ననాచ్ఛాదితముగా నున్న యా చిన్నపిల్ల వారికడ కరుగుదెంచిన తరువాతఁ గొన్ని ప్రశ్నలను జేసి. ఫహ్మీదా మనస్సు కరఁగుటచే నొకనాణెము నిచ్చి పంపివేసెను. ఆకూలిబిడ్డ కొంచెము దూరము పోయినతరువాత ఫహ్మీదా షైజీతో నిట్లనియెను.

"అయ్యయో! ధనము లేకుండుటచే నాపిల్లయును దాని జననీ జనకులును నెంతబాధ పడుచుందురు. శరీరమును సంపూర్ణముగాఁ గప్పుకొనుటకు గుడ్డయును త్రాగుటకు గంజియును, నుండుట కొక కొంపయైనను వారి కుండదు. మన మిండ్లలో తలుపులు మూసికొని యున్నిబట్టలఁ గప్పుకొని రాత్రులు కాలము గడపుచుండ శీతవాత ముల బాధచే వారు వడవడ వడంకుచుందురు. మధురములైన ఫలా సవములను, రుచ్యములైన పిండివంటలను దినినను, మననాల్క లసంతుష్టిని బొందుచుండ వారా గంజిని త్రావి యెట్లుందురోగదా! పరమేశ్వరుఁడు సమానసుఖముల నందఱి కీయకుండ నిట్టి పక్షపాత మును బూనునేల! ఈప్రపంచములో నెంతమంది దారిద్ర్యముచే బాధపడుచున్నారో!"

ఈమాటలు విని షైజీ యామె యభిప్రాయమును గొంచెము సంస్కరింప నెంచి యీరీతిని పలికెను. "నీవిట్లు భావించుటయందు కొంచెము పొరఁబడితివి. కారణ మేమనఁగా వారిసంతుష్టిని వారి సౌఖ్యమును మనవంటివా రూహింపఁజాలరు. కేవలము పైరూపము లచేతనే మోసపోవుదురు గాని యథార్థమైన తత్వమును గ్రహియింప

లేరు. పరమేశ్వరుఁ డందఱను సమముగానే సృష్టించియున్నాఁడు. గాని యొకరికిఁ గష్టము నొకరికి సుఖమును గలుగవలెనని నిర్ణయింప లేదు. అవి కేవలము మన భావనవలననే కలుగుచున్నవి. మన పరుపులు, మన హంసతూలికాతల్పములు వారి మనోవీథిని బొడ టయే లేవు. అదిగాక వానివలన మనకెంతటి తృప్తి యెంతటి నిద్ర, గలుగుచుండునో యంతకంటె నెక్కుడు తృప్తియు, సౌఖ్యమును వారికి స్థండిలశయనము వలనఁ గలుగుచుండును. మననోటి ద్రాక్షాసవము లెంతటిరుచి గలిగించునో యంతకంటె నెక్కుడురుచి, పనిచేసి యలసియున్న వారి నోళులకు గంజినీళ్ళవలన తగిలియే తీరును. మనము సేవకులవలనఁ బొందు సుఖములను, బంచమహాభూతములే వారి కొసఁగును. ఏయే జీవజంతు వేయే పరిస్థితులయందు నివసించునో, యాయా పరిస్థితులకుఁ దగి పట్టు సర్దుకొనగలశక్తి పరమేశ్వరుఁడు ప్రతిజీవజంతువున కిచ్చియే యున్నాఁడు. ఇదియే సుఖదుఃఖములయొక్క కీలకము, సృష్టియందలి రహస్యము; దీని నెఱుఁగకయే మన మితరులు దుఃఖ మనుభవించుచున్నారని యూహించి వారికంటె దుఃఖభాజనులమై వారికొఱకు విచారించుచున్నాము. పాలలోఁ బుట్టు పురుగున కెంతటి యానందమో మురికినీటిలోఁ బుట్టుదానికిని నంతియ యానందము. గాలిలోని యణువెల్ల సంతసమునఁ దాండవించునో, నీటిలోని జలకణము నట్లే తాండవించును " అని యింకేమేమియో చెప్పఁబోవుచుండఁగా శ్రోత్రమార్గమున 'డక డక' యను శబ్దము లోనికిఁ జొచ్చి మనస్సు నన్యాక్రాంత మొనరించెను. ఆశబ్ద మంతకంతకు వృద్ధియై వారి కనుమానము, నుద్వేగమును గలిగించెను. గాని నిర్భయు లగుటచేఁ గొంచెముసే పచ్చటనే కూరుచుండి, మరల లోపల నేయభిప్రాయము గలుగుటచేతనో, తిరిగి యింటివైపు మెల్లఁగా లేచి ప్రయాణ మొనరింపఁగడఁగిరి.

ఇంతలో నాడెక్కలశబ్దము మఱింత వృద్ధియై వారికొకయైదు గుఱ్ఱపు రౌతులు గన్పట్టిరి. వారి వస్త్రములు మొదలగునవి పాదుషా సైన్యములోని వారుగారని చెప్పుచుండెను. ఆపోవుచున్న యైదుగురియందును ముందున్నవాఁడు యజమానుఁడని మొదిదవాఁడికిఁ దోఁచును. ఆతఁడు నల్లనిశరీరకాంతి గలవాఁడు. ముఖము క్రూరతను జెప్పక చెప్పుచున్నది. దీర్ఘములు, బలిష్ఠములునైన బాహువు లాతనిబలమును వ్యక్తము చేయును. పట్టుదలతోఁ బనిచేయువాఁడని చూపరులకుఁ దప్పక స్ఫురించును. దూరమునుండి వీరిని జూచుటతోడనే యానూతన పురుషుఁడు వీరక్షత్రసంస్థానమునకుఁ జెందినవారని గ్రహింపఁగలిగెను గాని యాసైనికులను జూచుచు మన ఫైజీ పహిలుమీఁదాలు కొంచెమునే పాఁగిరి. ఈరౌతు వారిని సమీపించి గుఱ్ఱమును దిగి వారున్న స్థలమునకు వచ్చి 'మీ దేయూరని' ప్రశ్నించెను. 'మాది యాగ్రాపట్టణము' అను ఫైజీజవాబు విని యికనిశ్చయముగా వారు పాదుషా సేవకులే యని గ్రహించి, లావణ్యమయమైన యాసుందరి దేహము నాపాదమస్తకము దివ్వనఁ బరికించి యేమిభావము స్ఫురించెనో పరమేశ్వరునికే యెఱుక, గుఱ్ఱముపైఁ గూరుచుండుమని సంజ్ఞ చేసెను. వీరు మమ్ముల బాధింపక మానరనునూహ వెంటనే వారికి స్ఫురించెను గాని పాప మా యిరువురును వారి నేమిచేయఁగలరు! స్వాభిప్రాయసూచకమైన యాతని మొగ మెగురవేతను గాంచి భయపడి పెపము పహిలుమీఁదా కొంచెము వెనుకకుఁ దగ్గెను. ఫయిజీయును నాము ముందునకు వచ్చి కొంచె మడ్డునిలిచెను. కాని యిందరలో నున్న యానూతన పురుషుఁ డడ్డమున్న ఫయిజీని ప్రక్కగాతోలఁగించి గిలగిలతన్నుకొనుచున్న యాసుందరి నెత్తుకొని గుఱ్ఱముపైఁ బెట్టు యత్నములో నుండెను. పాపమొంటిగాఁడును, నిరాయుధుఁడును యుద్ధమున కవగిచితుఁడును నైన ఫయిజీ యేమిచేయఁగలఁడు? తన

యాటంకము నిష్ప్రయోజనమని యెఱింగియుఁ గూడఁ దనముందు జరుగుచున్న యన్యాయమును గాంచి సహింపఁజాలక యడ్డుదగిలెను. వెంటనే వారివెనుక నున్నవా రాతనిని పెనఁగులాడుచుండఁగా కట్టి యొకవైపునఁ బడవేసిరి. బలవంతముగాఁ గొనిపోఁబడుచుండుటచే గిలగిల తన్నుకొనుచున్న యాసుందరిని గుఱ్ఱముపైఁ బెట్టుటకుఁ బ్రయత్నించుచుండగా వెనుకనుండి వారికి గిట్టల చప్పుడు వినుపించెను శరీర మంతయు శ్రోత్రములతో నిండియున్నవా రాచప్పుడును విని దూరమునకు దృష్టి సారించిరి. వారి కిరువురు రౌతులు గన్పించిరిగాని తురగఖురోద్ధూతమైన ధూళివలనఁ గప్పబడుటచే వారెవరో గుర్తించుటకు వీలులేకపోయెను. ఆనల్లని పురుషుఁడెట్లో యామెను గుఱ్ఱముపైఁ బెట్టి తాను నెక్కి కూరుచుండెను. రెండుమూఁడంజలు గుఱ్ఱము వేసినతోడనే గుఱ్ఱపుజీనునకుగట్టినపట్టకా జారి యాజీను ప్రక్కకొరఁగిపోవుచుండెను. తటాలున నాతఁడా గుఱ్ఱమునుండి యామెను దింపి తానును దిగి పటకా నింకొకపురుషుని సహాయముచే బిగింపఁ దొడఁగెను. పటకాను బిగించి మరల నావీరుఁడు గుఱ్ఱము నెక్కుసరికి వెనుకనున్న రౌతులు వారిని గలిసికొనిరి.

అందు ముందున్నవానిని గాంచినవెంటనే ఫైజీ దయనీయమై యాత్రముతో నిండినకంఠముతో 'చందనదాసు' అని యరచెను. ఫహ్మేదాయును ప్రేమపూరితములై భయచకితములైన విశాలనయనముల నాతనివైపు ద్రిప్పెను గాని నోట మాటాడఁ జాలకపోయెను. వచ్చిన చందనదాసు వడిగా ఫహ్మీదా యున్నచోటునకుఁ బోవ యత్నించెను గాని నలువురు రౌతు లాతని నడ్డగించిరి. మిత్రుని యార్తధ్వనిచేతను, సుందరీమణియొక్క భావగర్భితములైన చూపులచేతను నాతనిశరీర ముబ్బి వీరరసము వెల్లివిరిసినట్లు గన్పట్టుచుండఁగాఁ జందనదాసు నలువురితోను యుద్ధము సలుపుచుండెనుఁ తొలుత నొకని

హస్తమును ఖండించి రెండవవాని శిరస్త్రమును గాయపఱచెను. మిగిలిన పురుషులలో నింకొక నల్లనివానితోఁ జందనదాసు యుద్ధము చేయుచు నట్టివీరుని దానింతవఱకు నెప్పుడును దారసిల్లలేదని గుర్తించెను. కొంతసేపుమాత్ర మాతనితో రణమొనరించి యింక నట్టి రణము వలన లాభము లేదని యెంచి వారినెట్లో తప్పించుకొని షహాబూదా నుబట్టుకొన్న రౌతున కడ్డపడి యాతనికిఁ దనరణకౌశలమును జూపింప నిశ్చయించెను. కాని యిట్లసమయుద్ధ మొనరించు చందనదాసుపైఁ గొంచెమును గౌరవముంపక యాతని గుఱ్ఱము నాపురుషుఁడు గాయపఱచెను. గాయపడియుఁ గూడ నా గుఱ్ఱము పోరుచుండుటయు మంచిగుఱ్ఱముపై నున్న తనశత్రువు పాఱిపోవుటకుఁ బ్రయత్నము సలుపుచుండుటయుఁ గాంచి యిఁక గత్యంతరము లేక చందనదాసును విరోధిచేఁ జూపింపఁబడిన మార్గమునే యనుసరించి షహాబూదాయును నానల్లని పురుషుఁడును గూర్చున్న హయమునకు బలమైన గాయము చేసి వానిని క్రిందికి దిగునట్లొనర్చెను. ఇంతలో చందనదాసు ననుసరించిన యాతఁడును మిగిలిన యిరువురు రౌతులతోఁ బోరాడెను గాని యూతనిని వారతిసులభముగా నంతమొందించిరి. పాపము! చందనదాసు హయరహితుఁడై కేవల ఖడ్గసహాయుఁడై యసహాయశూరులగు నలుగురితోఁ బోరవలసివచ్చినది. కాని యట్టిస్థితిలో వానిసహజతేజస్సు విజృంభింపగా, ఖడ్గమును జక్రాకారమున ద్రిప్పుచుఁ దన్నురక్షించుకొను శత్రువులను దరి జేరనీయక స్తంభితుల నొనర్చెను. ఒకఁడు దనబల్లెముతో నాతనిని బొడుచుటకుఁ బ్రయత్నించెను. గాని యతఁడు చుఱుకుతనముచే దప్పించుకొని యాబల్లెము నఱికివైచెను. ఇట్లుండఁ గొందఱు రౌతులు వెనుకనుండి వచ్చునట్లు శబ్దము వినవచ్చెను. అదినికిచేఁ జందనదాసునకుఁ దనమిత్రులు వచ్చుచుండిరను నాశ గలిగెను గాని శత్రువులే వచ్చుచున్నారేమో యనుభయముమాత్రము లేక

పోలేదు. నాలుగునిమిషములలో వచ్చువారు చందనదాసుమిత్రులని తెలిసిపోయెను. తోడనే శత్రువుల దిఱును కాలికి బుద్ధిచెప్పి గుఱ్ఱములనెక్కి పలాయనమైరి. ముందువాడు గనిపోయినవానిగుఱ్ఱము నెక్కి పాఱిపోయెను. వచ్చినపదిపంద్రెండు రౌతులును, చందనదాసుపై జీని గాంచి సలామొనరించి వారిస్థితికి నివ్వెఱపడి పోవువారిలో శత్రుసేనలకు యజమానులగు మీర్జాలుగలరు. ఆ మొదటిపురుషుఁడు ఇబ్రహీం ముహుస్సేను మీర్జా, రెండవవాఁడు మసూద్ హుసేన్ మీర్జా అని చెప్పిరి. "అవును. నాకుఁ దెలియును. ఆ కారణముననే వెనుదగిలివచ్చియుంటిని. మీలో నలువురుమాత్రముండి తక్కినవారు మీర్జాలను వెంబడింపుఁడు" అని చందనదాసుపలికి తనమనస్సు మొదట నాకర్షించినపహ్మీదాను జూచుటకుఁ బోయెను. తక్కినవారు ఫజీబంధములను విడిపించిరి. సంపూర్ణమై, కుముదకల్హారశోభితమైనకాసారమును, కాసరములు గలఁచివేసినట్లు, కమలిని యిభహస్తమున లులితమైనయట్లు సుభశోభనమై నవనవలాడులతాకుంజ మొకపసరముచేఁ జిందరవందర చేయబడినట్లామె మీర్జాలచే లులితయైపోయెను గాని గాయములుమాత్రము తగులలేదు. వారిద్దఱిని శిబిరమునకుఁ బంపుటకుఁ దగునేర్పాట్లు నొనరించి చందనదాసు పాఱిపోయినమీర్జాలను వెంబడింపవలెనని బయలుదేరుటకు సిద్ధుఁడయ్యెను. కాని ప్రక్కనున్న ఫజీ "శిబిరమునకు వచ్చి కొంచెము సేదదేరుము. నీసైనికులు మీర్జాలను వెంబడించిరి. వారాపనిని జేయఁగలరు." అనెను. ప్రక్కనున్న సుందరియును, సిగ్గు, ప్రేమ, కృతజ్ఞత, ఆత్రము మొదలగుభావములు మొగముపై మల్లడిగొన "త్రల్లె చేయవచ్చును" అని నమ్రవదనయై మృదుమధురభాషణములతో వచియించెను. ప్రియమిత్రుఁడునుబూజనీయుఁడును నగుఫయిజీమాటయాడుచుండఁగా నొక్కసారియైననుగలసి మాటలాడి యెఱుఁగనియారమణీమణిపలుకులు చందనదాసునకాజ్ఞా

సదృశముతో యడుగును ముందు పెట్టనీయకుండెను. వీరివాక్యములచే నాతఁడనిశ్చయుఁడై డోలాస్థితుఁడై యుద్భ్రాంత బాధఁజొచ్చెను. ఒక ప్రక్క ప్రేమ, మైత్రి. రెండవప్రక్క రాజకార్యము. దేనినివదలివే యుట? ఒక్కనిముసములో నిశ్చయింపవలయును. ఆలస్యము చేసిన శత్రువులు పాఱిపోవుదురు. వారిని గలసికొనుట కష్టము. ఒక్కనిము సము తలవాంచి యాతఁడిట్లు తలఁచెను. "నాకు వీరందఱితోను సంబంధము గలుగుటకుఁ గారణము రాజసేవయే గదా! అట్టిసర్వవై భవప్రధానమైనరాజకార్యమును. విడిచి కేవలము మిత్రులతోఁ గాలక్షేపము చేయుచుండినయెడల నేను కృతఘ్నుండ నగుదును. తిరిగి వచ్చినతరువాత వీరితో నెన్నిదినములు కులాసాగాఁ గాలయాపన మొనరించిన నెవరు వలదందురు!" అని తలంచి "అయ్యా! నేనుపోక తప్పదు. అచిరకాలములోనే మరలి వచ్చి కలసికొందును" అనివచి యించి ఫత్తుజీ కొకసలా మొనరించి పహ్మీదాపై ప్రేమపూరితము లగుకటాక్షములఁ బరపి యొకసేనకునికి వారివెనుకఁ బోయి శిబిరము కడ విడిచి మఱికొందఱురౌతులను గూర్చుకొని రమ్మని యాజ్ఞాపించి తనయనుచరులతోఁ గలసి మీర్జాలవెంటఁ బోయెను.

పహ్మీదాను మొగమునకు మొగముగాఁ జాలసేపు చూచు టకుఁ జందనదాసున కిదియే తొలిసారి. ఆమెరూప మిదివఱకెన్నియో సారు లాతనిదృష్టిపథమున నొకమెఱపువలెఁ బ్రసరించెను. దానివలన నాతనిమనస్సున నొకవిధమైనచలనమును, నాలోచనముల కుద్భ్రాంత లును గలిగెను గాని, యిట్టియనుభవమున కిది క్రొత్త. ఆమెరూపవతి యని యాతఁ డింతకుముందు గ్రహించెను గాని యిట్టియసమానలా వణ్యరాశి యని మాత్రము గ్రహింపఁడాయెను. కుసుమసదృశమైన యాశరీరము దంతమువలె నతిమనోహరమైనకాంతితో నొప్పారుచుం డెను. సంపూర్ణముగా నిండి కలకలలాడుచున్నసరోవరమువలె నొప్పా

ను నాయువతికిఁ బసిమ యంతయును నూతనముగా సంభవించినయౌవ
నమునుచే స్వాంతమైయున్నను మరింతశోభాయమానమై యొప్పు
చుండెను. సంపూర్ణరసమువివరముచే శోభిల్లుచున్నమామిడివలె
నానందహాస్యమైన యాయువతిముఖము ప్రభంజనునిచేఁ గలుగుచుపరుప
పతీసవ్వత్తుమువలె నొప్పుచుండెను. అన్యపురుషుఁ డొకానొకఁడు
బలాత్కారముగా నన్నుఁ దీసికొనిపోయెను గదా యనుకోపమును,
భయమును, తనమనస్సును దొంగిలించినప్రియుఁడే తన్నువైరులనుండి
విడిపించెనుగదా యన్నతుష్టియును, నాతనిముందు నిలిచియుండుట
వలన వచ్చుసిగ్గును గలసి యాముఖమునకు సాయంకాలమునందలిభా
నుబింబముయొక్క లక్ష్మిని గూర్చెను. ఆకటాక్షములు, ఆయాకార
మును, చందనబాసుహాస్యదయమునం దీపర్యాయము సుదృఢముగా
నొత్తఁబడియెను. ఎక్కడఁ జూచినను వాని కామూకారముస్ఫురించు
చున్నదేమో యన్నట్లుండెను. ఆముఖగమను నాసాంధ్యరాగ
మును మరలమరలఁ దలఁపునకు వచ్చి మనస్సునం దొకపెద్దతుపా
నును గల్పింప నీనిధి భావతరంగము లుప్పతిల్లెను. "అట్టికన్యకామణిని
వివాహమాడుటకంటె మానవునకు భాగ్య మేమి గలదు? ఇహసౌఖ్య
ముల కెల్ల భార్యయే యాలవాలము. ప్రపంచమునందలి మోదమున
కామెయే పట్టుగొమ్మ. కాదు! కాదు! హిందూమతంబునఁ బరలోక
సుఖంబులకుఁ గూడ భార్యయే యర్ధాంగి యని నిశ్చయముగాఁ జెప్పఁ
బడినది. దైవకార్యములయం దన్నిటియందు నామెకే ప్రాధాన్యము.
నిత్యసంధ్యావందనమునందును 'ధర్మపత్నీసమేతస్య' అనుసంకల్పము
తప్పదే! భార్య లేనివాని కీకర్మకును నధికారము లేదుగదా!
తుచ్ఛమై నశ్వరమైన యిహసౌఖ్యముల నమ్ముకొని శాశ్వతములైన
పరసౌఖ్యములను విడుచుటకొనుట కేవలము మూర్ఖ్యము. అట్టిది
కాఁజాలదు. ఏమీ! పరసుఖంబు లెట్లుపోవును? మహాజ్ఞానియు,

విద్యావతియు, కవయిత్రియు నగుకన్యను బెండ్లిచేసికొనుటచేఁ బర సౌఖ్యము గలుగునప్పు డింకెట్లు గలుగును ? కాని మతాంతరవివాహ మెట్లంగీకరింతును ? తుదకామె హిందువులలో ద్విజాతులలో నొకరి కైనను జేరినది గాదుగదా ! ఆమె మాంసాశనయో ! లేదు ! లేదు ! మాంసాశనము వీరొనరింపరని వీరివలన నేవినియున్నాను. అయ్యయో! నేనెట్లైన నీవ్యక్తికిని నాకును గలమనస్సంబంధమును నాశన మొనరిం పవలయునని యోచించుకొనుచుండఁగా మరలఁ బరమేశ్వరుఁ డేల యిట్టిసంయోగమును గల్పించెను? ఛీ ! ఏది 'యెట్లైనను ధీరుఁడనై యామానినీ మణిని మఱచిపోదును'' అని యింకేమియో యోచించు కొనుచు శత్రువులను వెంబడించెను.

సూర్యుఁ డపరాంబుధిలోఁ గ్రుంకినతరువాత మెల్లమెల్లగఁ జీకట్లలముకొనియెను. చీకటి కొంచెముసేపుమాత్ర ముండి చంద్రోదయముతో వెడలిపోయెను. బట్టబయట పుచ్చపువ్వువలె వెన్నెల గాయుచుండెను. కొంతసేపున కాతని యాలోచన లన్నియు పన్హామీదా నుండి మరల ప్రశాంతమైన యాకాశమునందలి చంద్రబింబమునందు లీనమై పోయెను.

---

## ప ది య వ ప్ర క ర ణ ము



### దైవయత్నము

ఆవెన్నెలలోఁ జందనదాసును దనసైనికులును, దప్పించుకొని పోవుచుండు మార్జాల వంటి మైదానములపైఁ బోవుచుండిరి. ఆమైదాన మంతయు శూన్యమై వృక్షరహితమై యుండెను. వారుప్రయాణమొనరించుబయలువలెనే యాకాశమును గల్మషరహితమై, మబ్బులు

లేకుండెను. విశాలమై, యగాధమై, జలపూరితమై యొప్పారుసరస్సు వలె నాకసము గన్పట్టుచుండఁగా, నందలిచంద్రుఁడొకమరాళమువలె విరాజిల్లెను. చంద్రోదయము కాకమున్ను ప్రకాశమానములైన నక్షత్రములవెలుఁగు శశికాంతిప్రవాహమున నాను మునిఁగి తుదకయ్య వియే యదృశ్యములై పోయి, యిట్లేయక్బరుచక్రవర్తియొక్క విభవమునం దన్యరాజ్యములును లీనములై శాంతియుక్తమైన సామ్రాజ్యమున్ స్థాపింపఁబడునని తెలుపుచున్నట్లుండెను. శూన్యమైన రిక్తనిహృదయమునందును, ఒకానొకకాలమున సమృద్ధియు వికాసమును గలుగునని చూపుటకోయన నాబాటప్రక్క నక్కడక్కడ నొక్కచెట్టు మాత్రము గన్పించుచుండ నందుఁ గులాయముల నిర్మించుకొని కాపురమున్న పక్షు లన్నియును తెల్లవాఱినదేమో యని తెక్కలను దటదటఁ గొట్టుకొనుచు బైటి కెగిరి మరలిగూండ్లను జేరుచుండెను.

ప్రకృతివైశాల్యవైభవములను గాంచుచు చందనదాసు పరధ్యానముగాఁ బ్రయాణ మొనరించుచుండ నొకనిమ్నోన్నతప్రదేశమున గుఱ్ఱముకాలు జాఱెను. ఆగమనభంగమువలనఁ బుట్టినయొడిదొడుకుచే గుఱ్ఱము పడ లేకుగాని పరధ్యానముతో నున్న చందనదాసు మాత్రము పై నుండి జారి ముందున్న యొకశిలాతలమునఁ బడి తలపై నొక చిన్నగాయమును బొందెను. దడదడ దొరలి కొంచెము దూరము తొలఁగిపోవుటచే శరీర మంతయును నలఁగి చితికెను. వెంటనే స్మారకము తప్పిన యాతనిని గొందఱు సైనికు లెత్తుకొని కొంచెము స్మృతి వచ్చువఱకును సేదదీర్చి మరల గుఱ్ఱముపై నెక్కించి మొగలాయిశిబిరమునకుఁ దోడుకొని పోయిరి. మిగిలిన సైనికులు తమ కార్యమును బూర్తిచేయుటకు శత్రువులను వెంబడించియే చనుచుండిరి. అయిదాఱు దినము లెడతెగని సవారియును, మూఁడునాలుగు స్థలములం దసమాన యుద్ధమును, మనస్సునందలి

వేదనయును, బలవత్తరమైన యాపాటుతోఁ గలసి శరీరమున కభిఘాత మొనరింపఁగా తీవ్రమైన జ్వరమునూర్గమందే చందనదాసునకుఁ దగిలెను. జ్వరపీడితుఁడును, వ్రణాంకితుఁడును నైన యాతనిని మెల్లగాఁ దీసికొనిపోయి గుడారములో నుంచి సైనికా వార్తను సైనికులు తెలుపఁగా నాతఁడు స్వయముగా వచ్చి స్మృతితప్పి పడియున్న రోగిని గాంచి తన శిబిరమునకుఁ దోడ్కొనిపోయి యచ్చోట నున్న రాజవైద్యునకుఁ గబురంపెను. అక్బరు రాజ్యమునఁ బట్టణమందును, శిబిరమునందునుగూడఁ బేరొందిన యూనానీ వైద్యులును, కవిరాజులును నుందురు. సైనికులరంపిన రాజవైద్యుఁ డరుగుదెంచి చందనదాసు నాడిని బరీక్షించి "స్మారకము తప్పినది. జ్వర మతితీవ్రముగ నున్నది. జ్వరము తగ్గువఱకును నిదమిత్థమని చెప్పుటకు వీలులేదు. మొట్టమొదట గాయములకుఁ గట్లు కట్టవలెను." అని చెప్పి గాయమును గడిగి కట్టుగట్టి లోనికి రెండుగడియల కొకమోతాదు వంతున నీయవలసిన మందిచ్చి వెడలిపోయెను. కవిరాజు మాటలు పహూమీదా కశనిపాతములవలె దోఁచెను, చందనదాసు—అని తలఁచుకొన్నంతనే యామెకుఁ గడుపులోఁ జెయిపెట్టి కలఁచినట్లయ్యెను. తల తిరుగుచుండెను. కన్నులు చీకట్లుగ్రమ్మె హృదయములో నొక పెద్దరాయి పెట్టినట్లు దోఁచెను చందనదాసు—చనిపోవునా? నేనో? నేనుమాత్రము—అని యామె యనుకొని ధైర్యము తెచ్చుకొనెను. వైద్యుఁ డొసంగిన మందుపొట్లము గ్రహించి యనుపానమును జేర్చి కన్నులనుమూసి స్మృతి తప్పియున్న రోగికిఁ బట్టెను. దగ్గఱ నిలుచబడి—పాదము చేష్టలుడక్క చూచుచుండెను. వారిరువురు నాతని శయ్యముందు దిస్సపోయి కూరుచుండి సకాలమున మందిచ్చుచు నిష్కళంకమైన ప్రేమను ననిర్వాచ్యమైన యభిమానమును జూపించుచుండిరి. కొంతసేపు పోయినతరువాత నాతఁడు..

కత్తి—కత్తి—చక్రవర్తికిఁ బోవుచున్నాఁడు అనియును—అయ్యయ్యో—మతమో—బ్రాహ్మణుఁడను—ఛీ! తెలివితక్కువ—అనియును గలవరింపఁగా విని దగ్గఱనున్న ఫహామీదా భయభ్రాంతయయ్యెనుగాని, పైకి ధైర్యము చెప్పెను. మరల సాయంకాలము మూఁడుగంటలకాలమునకు వైద్యుఁడు వచ్చి చెయ్యిచూచి పెదవి విఱిచి "రాత్రి రెండుజాములకుఁ గాని యీ జ్వరము తగ్గదు. ఇంతకుముం దిచ్చినపొట్లము లన్నియు నయిపోయిన సరే లేకున్నను వాని నవతల వైచి యీ మాత్రను తేనెతోఁ గలిపి యిచ్చివేయుఁడు. తెల్లవాఱువఱకును మఱి దక్కదులేదు." అని చెప్పి మందిచ్చి వెడలెను. దాహ మడిగినయప్పుడు నారింజకాయల రసమును బిండి యీయవలసినదని వైద్యుఁడు చెప్పుటచేత నాయువతి నారింజకాయ తొనలను దన పువ్వుచేతులతోఁ బిండి రసమును సిద్ధమొనరించెను. ఉదయమున గవిరాజు వచ్చి శరీరమున నొకలేపనమును వేయఁగాఁ జెమ్మటపట్టి యాజ్వరము తగ్గెను. సాయంకాలమునకు జ్వరము తొలఁగఁగా వైద్యుఁ డాతని యిరుకుపట్టిన చెయ్యి పట్టుకొని యొకనరమును లాగి పైనొకతైలమును బూసి నొప్పి దగ్గినదని రోగి చెప్పగా వెడలెను. మఱునాటి యుదయమునఁ జందనదాసునకుఁ బూర్తిగా స్మృతి వచ్చి కొంచెము లఘ్వాహారమును గైకొనెను.

చందనదాసునకు స్మృతి వచ్చినతరువాత దగ్గఱనున్న యాయువతీరత్నముయొక్కరూపము కలిగించినంతమనఃకల్లోల మెప్పుడు నాతనికిఁ గలుగకపోవుటచే స్మృతిహీనమైన స్థితియే బాగుగనుండెనని యనుకొనవలసివచ్చెను. కనిపెట్టుకొని యుండుటచే నిద్రలేనియాశాలనయనముల కెంజాతామరపూవులకాంతియును, నిగ్గును గలిగెనని యాతఁడు గ్రహించెను. ఇంతకంటె నాతని కనుతాపకారణ మేమి? మతనామముచే సుదృఢమైన తనహృదయమందలి చిత్తరువును బెల్ల

గించుటకుఁ బ్రయత్నించిన నాకిట్టి స్వార్థరహితమై, దయామయమైన మనస్సున సేవచేయుచున్నదిగదా యీతన్వంగి! యని తలఁచుకొనిన యంతనే వారలవలనిసాహాయ్యము, ప్రేమ, తనయుశక్తత, తన నిరు పేదజీవనము, కృతఘ్నత మొదలగునవి యన్నియు నొక్కసారి స్ఫురింపఁగాని రాఁగా కన్ను లశ్రువులతో నిండిపోయెను. ఆప్రవాహమునఁ హారములనుండి తెగిపడిన ముత్తెములవలె వెచ్చని కన్నీటి చుక్కలు జొటజొట క్రిందికి జారెను. పాపము తల్లిదండ్రులుగాని, దగ్గఱబంధువులుగాని చెంతలేరు. ఏమగునో! ఎట్లీవ్యాధిసముద్రమును దాఁటుటో యని యాతఁడు భయమందుచు నధైర్యము పడెనని యెంచి షమ్రా మీఁదాకను హృదయము కలఁగి కంఠము స్తంభించి దగ్గుత్తికచే నోటిమాట వెడలక పోయెను. ధైర్యము చెప్పఁదలఁచి యాకస్తము మీఁద నశ్రువులుగ్రమ్మిన తనమొగ మాప్రక్కకుఁ ద్రిప్పుకొని 'భయము లేదు' అని యేమియో యనఁబోయి మరల స్తంభించి నీటితో నిండి సన్నని మూతిగల పెద్దజలకుండికవలె కోనిభావమును వెలువరింపఁ జాలకపోయెను. కరుణాప్రేమరసములచే నిండి యుక్కిరిబిక్కిరియైన యామెను అప్పుడే బైటనుండి వచ్చినప్రైజీ గాంధి 'నీకు రెండు దినములనుండి నిద్ర లేనేలేదు. పోయి పండుకొనుము' అని బలవంతముపై శయ్యకడ కంపి యామెకుబదులు తానే యచ్చోఁ గూరుచుండెను.

షమ్రాదా తప్పనిసరి యగుటచే నంచముపై మేనువాల్చెను గాని నిద్దుర పట్టుటయే లేదు. కొంచెముసేపయిన తరువాత కలతనిద్ర లో నొకకల గనియెను. విశాలమైన యుద్యానవనమున, సర్వరస భరితఫలభారవినమ్రశాఖాజాలశోభితంబగు తరుషండము చెంత, మనోహర సరోవరపరిసరమున. కుసుమమాలికలతో, నూతనవికసితకుముదకల్హారములతో, మకరందరసాస్వాదనకుతూహలబంభరగణం

బుతో నిశ్చితగా ప్రకృతిపుత్రికవలె యాడుకొనుచుండఁగా, సర్వ లక్షణలక్షితమై, పనోహరాకారము గలిగినయొక లేడిపిల్ల దృగ్గోచర మయ్యెను. దాని నెట్లైనను బట్టుకొనవలె నని యామె పోంచుండి మెల్ల మెల్లగా వెనుదగుల నయ్యది భీతములును, అప్పుడే విశ్వాసహీనతనుఁ బలును నగునయనములచే జిక్క కుండఁ దప్పించుకొనుచుండెను. తనవెనుకనుండి యొకనల్లని పెద్దకుక్క పొడుగైన కొమ్ములతో వచ్చుచుండఁగా చూచి యదరి పడి గట్టిగా నఱచి లేచెను. అది విని హైజీ, చెంతకు వచ్చి భయ ముడిపెను. ఆయుజపు విరివతోడనే మంచముమీఁది చందనదాసు త టాలున మొకమెత్తి లేవక నుంకించెను గాని 'గాయము కట్టుతొలఁగి పోవును. వద్దు' అని యామె పలుకగా తిరిగి పండుకొనెను. తరువాత షహ్మిదాయి నియ్యది కలమాత్రమే యనుట గ్రహించి తిరిగి పండు కొని నిద్రపోయెను.

చందనదాసు నాలుగైదుదినములలో గాయము మాని, యిటు నటు లేచి నడువ నారంభించెను గాని గుఱ్ఱము నెక్కి యుద్ధము చేయు టకుఁగాని తిరుగుటకుఁగాని యాతనికి సత్తువ లేదు. పూర్తిగాఁగుదురు టకుఁ బదిదినములు పట్టెను.

## పదునొకండవ ప్రకరణము

### వివాహము

రామనాథుని పినతండ్రిపేరు నాగానందుఁడు. నాగానందునకు నతనియన్న కుమారుఁడగు శంకరదాసునకును దండ్రి యిచ్చినయాస్తిసమముగా తగుమాత్రమె యున్నను శంకరదాసు వ్యాపారమొనర్చి యెన్నియో

లక్షలను సంపాదించెను. పరమానందుఁడు నిర్వ్యాపారియై యున్నను తనకుఁ బ్రతిసంవత్సరము వచ్చునాదాయమునే మిగిల్చి భూములను వృద్ధిచేసికొని కాలక్షేప మొనరించుచుండెను. వర్తక మొనరించిన నబద్ధము లాడవలసివచ్చు ననియును, దాన నరకము ప్రాప్తించుననియు. నేను శ్రౌతస్మార్తాచార బ్రాహ్మణాగ్రేసరునకుఁ దగదనియును నూహించి, తనయింటనే యేవ్యాపకములేక క్లిష్టముగాఁ గాలక్షేప మొనరించుచుండెను. ఈతఁడు శివార్చనాపరుఁడు. ఛాందసుఁడు. వేదమును సంపూర్ణముగా వల్లెవేసినవాఁడు. శ్లోకశాస్త్రజ్ఞుఁ డన్న బిరుదమీతని నికిఁ దప్పక చెల్లును. హిందూమతమున కాదియైన వేదములో నిమిడి యున్న యర్థముగాని, తుదను శాస్త్రములయందలి విచారణగాని ఒకరు చెప్పినప్పటికైనను వినలేదు. బ్రాహ్మణులాచరించు కర్మలును, అవలంబించు సాంఘికనియమములును, శ్రుతిస్మృతులలోనివనియే యితనినమ్మకము. అనుదినమును జాముప్రొద్దెక్కగా దేవతార్చన మొనరించుకొని భూములనుండి వచ్చుఫలసాయమును తినుచు సర్వ కాలమును నడిగట్టుకొని యింటఁ గూరుచుండెడువాఁడు. అన్నతో బంచుకొనిన యొకపెద్దయిల్లాయన కాగ్రాపట్టణమునఁ గలదు గాని సద్బ్రాహ్మణుఁడు పట్టణమునఁ గాపుర ముండఁగూడదు పల్లెటూరి లోనే నివసింపవలెను. కార్యార్థము పట్టణమునకే కొంతకాలమచ్చట నివసించుచుఁ దిరిగి రావలెను." అను నమ్మకము గలవాఁ డగుటచే నాగ్రాపట్టణమునకు సుమారు పదునెన్మిదిమైళ్ళదూరమున నున్న తన పల్లెటూరిలోఁ గాపురముండెను. ఆయూరిలోనే యాతనికి పిత్రార్జితమైన భూములును పెద్దయిల్లును గలవు. పుట్టుకతోఁ దండ్రియభిప్రాయములను బంచుకొనిన చంద్రచూడుఁ డనుకొడుకును నిరువదేండ్లకుమారుఁ డీయనకుఁ గలఁడు. తండ్రి నేర్పిన దేవతార్చనాసంకల్పమును, సంధ్యావందనమును, నాలుగుపనసలును తప్ప నాతఁ డక్షరాస్యుఁ డని చెప్ప

నొప్పిని, విశేషించి దుర్బలకాయుఁడు రోగిష్టి. అయినను వయసులో నుండుటచే నంతబాధ లేకుండెను కొడుకునకు వివాహము చేయవలయు నని నాగానందునకు లోపల నభిప్రాయమున్నను అనువగు సంబంధము లభియింపనిది యట్టికార్యమునకుఁ బూనఁబడఁడు. పాదుషావారి యొక్క సేనకులుగాని పట్టణవాసులుగాని నిరర్థములుగానియాతని సంబంధమునకు సమకూరదు. రోగి యగుటచేఁ గుమారుని పెండ్లివలన నంతదూరా మా స్త్రీ రాబట్టవలె నని యూహించుచుండెను. తుదకుఁ స్వగ్రామమున నున్న పురోహితుని కొమార్తె యగు సీతమ్మను పెండ్లి చేయుటకు మాట లన్నియు నిశ్చయించి తాంబూలమును పుచ్చుకొనెను. పిల్లకుఁ బదునొకండుసంవత్సరముల వయస్సు; మంచి తెలివి తేటలు గలది. పల్లెటూరిలో నున్నను హిందూస్థానీ బాగుగా వ్రాసి చదువఁగలదు. తండ్రి చెప్పుచుండుటచే భారతరామాయణములలోని కథ లన్నియును సంపూర్ణముగా వచ్చును. పిల్ల మెల్లగా నుండును గాని విశేషము చక్కని దని చెప్పుటకుమాత్రము వీలులేదు. సంసారపక్షముగా నుండును. పిల్ల తెలివైనది. సంప్రదాయమైన కుటుంబము. తండ్రి కొక్కతెయే కూఁతురు. ఇంకఁ బిల్లలు పుట్టువయస్సాయనకు గతించుటచే నతనికిఁ గలయేఁబదియెకరముల పొలము, ఇల్లు, వాకిలి, దొడ్డి, దూడ మొదలగునవి యన్నియును తనకొడుకునకే రాక తప్పదను ధైర్యము. ఈపైకారణములచే నాగానందుఁడా సంబంధమునకొప్పుకొనెను. వియ్యంకునిభూమి విశేషము పంటకారి కాదు కావున పూర్వము అందలి పంట పన్నులకే సరిపోయియుండలేదు. ఇప్పుడు రెండవరకము భూమిగా నెన్నఁబడి పన్ను చాలమట్టుకు తగ్గింపఁబడుట చేతను, కాలమానము కలసివచ్చి నాలుగుగింజలు పండుటచేతను, కంటికి కొంత నదరుగా నాతఁడు కనఁబడుచుండెను. ఇప్పు డాభూమి విలువగూడ, పంటవరబడితోను పన్ను దిగుబడిచేతను హెచ్చెను,

కొన్నిదినములకు ముందుగా నాగానందుఁడు నాసంబంధమున కొప్పుకొని యుండలేదు గాని యప్పటిపరిస్థితులనుబట్టియు, తాను మంచిసంబంధములని తలంపఁ దగినట్టివి రాకుండుటచేతను దాని కొప్పుకొనెను.

నాగానందుఁడు నూతనసామ్రాజ్యములోని హిందూమహమ్మదీయైక్యము నిష్టపడువాఁడు గాఁడు. దాన మతధ్వంసము తప్పక కలుగుచున్నదని యాతనియూహ. మహమ్మదీయులతో సంబంధబాంధవ్యములను గల్పించుకొని వారిపేరు చెప్పిన తమ మాత్రమునఁ దోఁక త్రొక్కిన త్రాఁచువలె నెగురును. వారు పతితులనియు, పాషండులనియు వారినామస్మరణ నరకహేతు వనియును జెప్పును. బాల్యవివాహముల నాఁపవలయు ననియును, వితంతూద్వాహముల నొనరింపవలయునని యును, అక్బరు చేయు ప్రయత్నములను దలఁచుకొన్న నీతనికి గొప్ప కడుపుమంట. అయినను మొగలుసామ్రాజ్యమునందు గొన్నిసదుపాయములు గల వని యాతఁ డొప్పుకొనినదే తీరును. పొలమును గొలిచి వానికిఁ గలపంట పరిమితిప్రకారము పన్ను విధించుచున్నా దాతని కెంతయు సంతసము. పన్నులు గ్రహించు నుద్యోగులును తదితరులును లంచములఁ దీసికొనకుండ నుండునట్లు చక్రవర్తి చేసినకట్టుదిట్టము లీయనకు బహుప్రీతిని గలిగించును.

నాగానందునికొమారుని మించిన వరుఁ డింకొకఁడు దొరకపోవుటచేతను తనయూరిసంబంధము గావున పిల్ల కన్నులఁ బడుచుండునను నాశచేతను సీతమ్మతల్లిదండ్రు లాసంబంధమునే నిశ్చయించిరి. ముహూర్తము నిర్ణయించి నాగానందుఁడు తనయన్నకు మాత్రము శుభలేఖ వ్రాసెను. త. శ్రీ., కుమారుని పొమ్మనుటచే రామనాథుఁడు బయలువెడలుట కొప్పుకొనెను. తనమిత్రుఁడగురహీము యుద్ధభూమి నుండుటచే రామనాథున కబుసుపోవుట లేదు గావున రెండుమూఁడు దినములు ముందుగాతఁడు బయలుదేఱి యొకనాఁడు రాత్రి పండ్రెండు

గంటల కొకరెండెద్దుల బండి నెక్కి ఢిల్లీకి వెడలెను. ఆగ్రాపట్టణము నకును తాను బోనున్న పల్లెటూరికిని మధ్య చక్కని రాచబాటగలదు. రెండు ప్రక్కలను చల్లని వృక్షములు గల మిగుల విశాలమైన గట్టిబాట యగుటచే యెండబాధ లేక ప్రయాణికులు సుఖించుట కనువై యుండెను. నేటికి కూడ యా మార్గము ఢిల్లీ నగరమునకు రాయబారిఁ జేరి తనతోడి కేసరాయి లన్నిటి నొకమూలనుంచి పంచలోనే గట్టుకొని కాలక్షేప మొనరించు చుండెను. బాలపాధ్యాయుఁడు లాలమిశ్ర శ్రీ రామనాథుని దురకస హాహాసమునకుఁ దిట్టుచుండెను. వివాహ మానక ముందుగానే యా గ్రామాధికారి సీతమ్మతండ్రి గృహమునకు వచ్చి పిల్ల కింకను నాలు గేండ్లు పోవువఱకును పెండ్లి వలదనియు నిప్పుడు చేయుట మంచిది కాదనియును బోధించెను. సాధ్యమగునంతవఱకును హిందువుల యిండ్లలలో బాల్యవివాహములు జరుగకుండ బోధింపవలసినదని సర్కా రుసేవకు లందఱకును నుత్తరువు గాని, యట్టి వివాహములు జరుగకూడ దను దుర్లఘ్యమైన శాసనము లేదు. శాసనబలాత్కార మున్నను గూడఁ బూర్వాచారములనే రహస్యముగాఁ గొనసాగింతు మను నంతటి పట్టుదలయు మూర్ఖత్వమును గల యా యిరువురు వియ్యంకు లును బోధనలను విననొల్లక ఆ గ్రామోద్యోగిమాట నిరాకరించి తమ యింటి వివాహమును సాంగముగా నడిపింపఁజొచ్చిరి. ఆ కాలము నందు హిందూవివాహములకు మహమ్మదీయులను, మహమ్మదీయ వివాహములకు హిందువులను బిలుచుట యాచారము గాని యట్టి సంగతు లిచ్చుట జరుగుట కేమియు నవకాశము లేదు. వివాహము నకు దగ్గఱనున్న వేదపండితులను కొంచెము మంది బ్రాహ్మణులను బిలిపించిరి. పాదుషా సేవలో నున్న మహాపండితులును ఆ బ్రాహ్మణ వృత్తిని జీవించుటచే నసమర్థులని యూహించిరి. ఈ పండితులు తుర కలకడ సేవఁ జేయుచు వారిమతమున కనుగుణముగా వాదించి

స్వబుద్ధిని స్వధర్మమును గోలుపోయిరని వీ రూహించెదరు. శాస్త్రములు, వేదములు, వానియర్థములు ఇతరమతస్థులు వినఁగూడదనియును, నట్లు వినుటవలన మతమపవిత్రమగుననియు వీరియూహ. భారతరామాయణములను బాదవ్రాని యను పండితుఁడు భాషాంతరీకరించె నని విని పాపము నాగానందుఁ డెంతయు విచారించెను. రామాయణమువంటి పవిత్రగ్రంథము మ్లేచ్ఛునిచేతిలోఁ బడి పాపభూయిష్ఠ మైనదని మనస్సులోఁ గుల్లెను. అయ్యయ్యో! ధర్మప్రధానమైన సామ్రాజ్యమును స్థాపించి సర్వసమత్వముఁ బాటించి కేవల పరమేశ్వరావతార మని నుతింపఁబడి శ్రీరాముని బురుడించు ననునక్బరుసార్వభౌముని సామ్రాజ్యమునందుఁగూడ సూర్యుని తేజస్సును గాంచి గుహలలో దాఁగుచుండు దివాంధములరీతిని, ధర్మమును న్యాయమును దూషించెడు మూర్ఖులు హిందువులలోను మహమ్మదీయులలోనుగూడ నుండెడివారు గదా!

పెండ్లి యైదుదినములును రామనాథుఁ డక్కడనే గడపి, పోయెద ననఁగాఁ బినతండ్రియు బెండ్లికొడుకును మచుకుపురోజులు గూడ నక్కడనే యుండిపొమ్మని బలవంతముచేసిరి. రామనాథుఁ డక్కడ నున్నంత కాలమును బ్రతియుదయమునందాయూరికోనేటిలో స్నానమొనరించుచు నీఁతకొట్టుచుండువాఁడు. ఒకనాఁడు పినతండ్రితోఁ గలసి స్నాన మొనరించుచు నీరీతిని పలికెను. "బాబూ! తురకల రాజ్యమును నీ వెంతయో నిందింతువు. మీయూరిదివఱకే జలాధారములేక మలమల మాడుచుండెడిది. అక్బరుచక్రవర్తి రాజ్యమునకు వచ్చి ప్రతిగ్రామమునకు సదుపాయములఁ జేయఁదొడఁగెనుగదా! దీనికైనను వారికిఁ గృతజ్ఞతఁ జూపవేల?" అనిన నాగానందుఁడు తురకలరాజ్యమును నేను దూషింపను గాని మతసంస్కరణము లన్నచో నాకుఁ గిట్టవు వారొనరించు కార్యములలోఁ గొన్ని మంచివి

గలవని నే నొప్పుకొందును. అయినను అక్బరునకు గురువులు మన యోగులే యని పల్కుచున్నారు. ఎప్పుడును సూర్యనమస్కారములు శివపూజ సేయుచుండునట. పూర్వజన్మము దీయన యొక మహాతపశ్శాలియై యాతపమునుండి చ్యుతుండు కాఁగాఁ దురకకులములోఁ జక్రవర్తియై పుట్టెనందురు. అందుచేతనే యిట్టి సత్కార్యములనుగూడఁ జేయుచున్నాఁడు. పూర్వజన్మవాసన యెక్కడికి బోవును. శివార్చన సేయకున్న నీమహాదైశ్వర్య మెట్లు లభించును. జనులు చెప్పు నీవాక్యములే నిజములని నేను నమ్మెదను. మహారాజు లందఱును తపస్సులోనుండి స్ఖలితులైనవారని మన శాస్త్రములు వేనోళ్ళ ఘోషించుచున్నవి.'' అంతటితో వారుమాటల ముగించి యింటికిఁ బోయిరి. ఇంకఁ గొన్ని దినము లక్కడఁ గడపి రామ నాథుఁడు తన పురియగు నాగ్రాకు మరలెను.

---

## పంద్రెండవ ప్రకరణము.

సూరతుకోట.

అక్బరుపాదుషా సర్నాలయొద్ద జయము నంది మీర్జాలనునక్క నశత్రువులతోఁ గలసి బలవంతులుగాకుండ శాఅండ్రోలి వారి సేనను మరలఁ జేరుకొనకుండునట్లు చెల్లాచెదరుగాఁ గొట్టివేసెను. అహమ్మదాబాదు, బ్రోచ్ ఇదివఱకే పట్టుపడుటచే జయించుటకు సూరతు దుర్గ మొక్కటిమాత్రము మిగిలియున్నది. ఒకపనిని దలపెట్టినప్పుడు దానినిబూర్తిచేయువఱకును బట్టుదలతోఁ బనిచేసి నిర్విఘ్నముగాఁ గొనసాగించునట్టి కార్యసాధకుఁడు గావున నక్బరు తిరిగి తనశిబిరమునకుఁ బోవుట కిచ్చగింపక యల్పసంఖ్యాకులగు తనసైనికులతో బరోడాప

ట్టణమునకుఁ బదునైదుమైళ్ళదూరమున నున్న గనయ కిప్పుపిడి, సూరతుకోటకుఁ బోవుటకు నిశ్చయించి శిబిరమున తయారైనవారను బిలిచి చేయవలసిన పని యాజ్ఞాపించెను. గార్ఖాన్ అను నొకమనసబు దారు నాకార్యముపైఁ మిగిలినవారితో నక్బరుచక్రవర్తి సూరతు కోటకుఁ బ్రయాణమయ్యెను. గార్ఖాన్ చక్రవర్త్యాజ్ఞప్రకారము మొగలుశిబిరమునకు వచ్చి యక్కడ నస్వస్థుఁడై యున్న చందనదాసు నుగాంచి పరిచారములు సేయించి సాధ్యమైనంత త్వరలోఁ బ్రయాణ ము నారంభించెను. మొగలు సేనలు బయలుదేఱు నాటికి గుఱ్ఱముపై నెక్కి ప్రయాణము చేయుటకుఁ దగినంతశక్తి చందనదాసునకుఁ గలుగ లేదు. కావున నాతఁడు ఫయిజీఫహీమ్దాలతోను గలసి యొక గుఱ్ఱపు బండిపై సూరతుఁ జేరెను. కోటముట్టడి యింతకు మున్నే ప్రారం భింపఁబడుటచే నచ్చట కుటీరములు సిద్ధపఱిచి యుంచిరి. నూతన ముగా వచ్చిన జనానా మొదలగువారల కందఱకును మరల డేరాలు వేసి వారి నచ్చో విడియించిరి.

ఉన్నతములైన ప్రాకారములతోడను, అగాధములైన యగ డ్తలతోడను దుర్భేధమయి, సూరతుకోట యొప్పుచుండెను. గోడ లకుఁ గ్రిందిభాగమున గొప్పగొప్ప కన్నములను ద్రవ్వి మందును దట్టించి యెన్నియోసారులు ప్రేల్చిరి. గాని, కోటగోడ యిసుమంతయు కనుగఁదకుండుటచే మొగలుసేనల కేమియును దోఁచకుండెను. అక్కడి సందర్భముల నెల్ల నాలోచించి యుద్ధము నాఁపి లోపలివారు లొంగు వఱకును ముట్టడివేయవలసిన దని చక్రవర్తి యాజ్ఞాపించెను. లోపల వల్పసంఖ్యాకులగు సైనికులుమాత్ర ముండుటచేతను, దండయాత్ర హాతాత్సంభవ మగుటచేతను, దగినభోజనసామగ్రి కూర్చుకొనక పోవుటచేతను, వారెప్పుడైనను లొంగియేతీఱవలెనని మొగలులీదారి త్రొక్కిరి. ముట్టడి యంతయు సుమారాఱువారములు పట్టెను.

ఆనఁ డు నొకనాఁడు ఫైజీకి జరిగినయవమానము మొదలగు వానినిగురించి యక్బరునకుఁ దెలియఁగా నాతఁడు ఫైజీని బిలిపించి యిట్లు మాటలాడెను.

పాదుషా—అయ్యా! నాఁడు మీరు మీర్జాలచేతిలోఁ జిక్కికొనినప్పుడు చందనదాసు రాకుండినయెడల మీగతి యేమైయుండును? విద్వత్వమును పాండిత్యమును సజ్జనులకును న్యాయైకవర్తనులకునుగాని, దుష్కరులకు యుద్ధమునందును గావు. కేవలము పండితాగ్రేసరుఁ డనెడు కీర్తి గాంచి యూరకుండు మనుట పాడిగాదు. మానసికబలమునకుఁ దోడుగా శరీరబలముగూడ నుండవలయునుగాని లేనియెడల శోభలేదు. ఉన్నాఁడు గావలసిన కసరత్తులు మొదలైన వాని సన్నిటిని జేసి శరీరమునకుఁ దగినబలమును మీరు సంపాదించియున్నారు. గాని పోరాట మొనరించుట కత్తిని ద్రిప్పుట మొదలగునవి మీకు బొత్తిగాఁ దెలియవు. కావున నతిశీఘ్రకాలమున మీరు మీమిత్రుఁడగు చందనదాసు సాహాయ్యమున యుద్ధనైపుణిని సంపాదింపవలయును. సైనికోద్యోగు లయి యుండుటచేతనే కదా యీమనుజులందఱకును నింతగౌరవమును నింతజీతమును నిచ్చుచున్నాము. లేకున్న వారిని మీతో నేయంశమునందుఁ బోల్పవచ్చును.

ఫైజీ—తా మిప్పుడు సెలవిచ్చిన మాటల యాథార్థ్యము నాకు బాగుగా ననుభవసిద్ధ మైనది. ఇఁక ముందు తమమాట ప్రకారమా యుద్ధోపయోగసామర్థ్యమును సంపాదించి తీరువాఁడను. ఈవిషయమునే ఇంతకుముం దెన్నియోసారులు బోధించుచుంటిరిగాని దానిని నేను సరకుసేయకుండుట దోసమే యగును.

అని యిట్లు వారు సంభాషించుచుండ బాదుషా దర్శన మొనర్చుటకుఁ జందనదా సరుదెంచె నని విని యాతనిని లోనికి రమ్మనిరి. ఆతఁడు లోనికి వచ్చి చక్రవర్తి కభివాదన మొనరించెను. అక్బరు

కూరుచుండు మని సైగఁ జేసి కుశలప్రశ్న మొనరించెను. అందుల కాతఁడు 'ఏలినవారి యనుగ్రహమున నాకు సంపూర్ణారోగ్యము లభించినది. ఇఁక యుద్ధమునకుఁ బోవుట కనుజ్ఞ నొసఁగవలయును'' అనియెను. అది విని యక్బరు 'చందనదాస్, నీవు బాగుగా యుద్ధ మొనరించి మీర్జాలను బాఱదోలుటకు సహాయపడుటయేగాక, సమయమున కడ్డుపడి యసమానశేముషీవిశేషవిరాజితుఁడును, కవిత్వసామ్రాజ్యపట్టభద్రుఁడును నగు ఫైజీసాహేబును సురక్షితముగా మా కడఁ జేర్చితివి. నీవు వారి కొనరించిన మేలును కవిగా రెన్నఁడును మఱవజాలరు. ఇప్పుడు వీరిని రణప్రవీణులఁ జేసి వీరుల నొనరించుట నీబాధ్యత.'

చందన—'చిత్తము. నాకుఁ బ్రాణదానము నొనరించి యన్నివిధములను సంరక్షించు మహానుభావున కిట్టి యల్పమైన సేవఁ జేయ లేనందునా!' అనెను. నాఁటికి భోజనకాలము సమీపించుటచే నందఱును లేచిరి.

---

## పదుమూఁడవ ప్రకరణము

### మీర్జాలు

అక్బరుతో యుద్ధముఁ జేసి యాతని సార్వభౌమత్వమును గుజరాతులో నెదిరించినవారు మీర్జాలే. ఒకే వంశమునకుఁ జేరినవారగుటను వారి కక్బరు సార్వభౌముఁడని తృణప్రాయుఁడుగా నుండుటయే గాక, యీర్ష్యగూడ వారికి విశేషముగాఁ గలదు. అక్బరున కెట్టి పట్టుదలయుఁ, గార్యసాధకతయుఁ గలదో వీరికి నట్టి పట్టుదలయుఁ గార్యసాధకశక్తియుఁ గలదు గావుననే యాతని నెదిరించిరి. మీర్జాలు సర్నాలదగ్గఱ జరిగిన యుద్ధములో నోడిపోయి, యహమ్మదుబాదు

నగర ప్రాంతమునుండి పాఱిపోయిరని మన మెఱింగియే యున్నాము వారిని కతిపయసైనికసమేతుఁడై వెంబడించిన చందనదాసు గుఱ్ఱము నుండి పడి మొగలశిబిరమునకుఁ జేరినతరువాత, రాజపుత్రస్థానము లోనున్న సిరోహి యనుస్థలమును జేరుకొనిరి. వారికి రాజ్యమా సేన మొదలగు పరికరము లేమియు లేకున్నను పట్టుదలమాత్ర మనల్పము గానుండుటచేఁ దిరిగి సైన్యములఁ జేర్చుకొని పట్టనుప్రాంతప్రదేశముల కు వచ్చి షేర్ఖాన్ ఫోలాదీ యనునొకచిన్నసామంతునితోఁ గలసికొ నిరి. ఆతనికడనున్న ధనము నంతయు గ్రహించి తమసేనలనభివృద్ధిపఱ చిరి. ఇంతకుముందు యుద్ధ మొనరించి యోడి పాఱిపోయినప్రాత సైనికులను చేతి కత్తిపట్టుటకు శక్తిగలిగినప్రతియువకునికూడ ధన మిచ్చి తమసైన్యమునందుఁ జేర్చికొని, యుబ్బుజబ్బుచే శరీరమును జేరు నన్యాసార్థులవంటివారి నందఱిని దళదేహమునకుఁ గూర్చిరి. గుజ్జరుదళమని పేరుగలిగిన యెనిమిదివేలతట్లను వానికిఁ దగురౌతులను జేర్చిరి. వీరు ముగ్గురికిని సాహాయ్య మొనర్చుటకు మహమ్మదుహు సేన్ మిర్జా, షాహమిర్జా యనువారును గలసిరి. సర్నాదగ్గఱ నోడఁ గొట్టి పాఱఁదోలి, నుఁగూడ వారు దక్కనుశత్రువులతోఁ గలసి యొక ప్రచండసైన్యముగా నేర్పడిరి.

పట్టన్నగరమునఁ దహమ్మద్ఖాన్ బార్లా యను నాతఁడు గవర్నరుగా నుండెను. శత్రువులు తనపై దాడి వెడలుదురని గాని, యేయపాయము సంభవించునని గాని భయములేకుండుటచేతను, అక్బ రునకు సైన్యములు గావలయునేమో యనునభిప్రాయ ముండుటచే తను నాతఁ డల్పసంఖ్యాకులనుమాత్ర ముంచికొని తక్కినవారి నక్క డనుండి పంపివేసెను. అయినను మిగిలినవారు విశేషము నేర్పరులు యుద్ధములం దాఱితేరినవారు. స్వామికార్యతత్పరులు; వీరులు; మంచి పట్టుదల గలవారు నశ్వరమైన దేహమును నమ్ముకొని యనశ్వర మైనయశస్సును బోఁగొట్టుకొనువారుగారు.

వీరియుభయులకును యుద్ధ మారంభమయ్యెను. శత్రుసేనలోని సిపాయీలకు ధనేచ్ఛ తప్ప నన్య మేదియును లేదు. యుద్ధపు తరిపీకును వారెన్నఁడును బొందలేదు. యజమానుని కీర్తిప్రతిష్ఠలతోను, జయాపజయములతోడను వారికిని సంబంధము మొదలే శూన్యము. ఐక్యభావము వారికిఁ గగనకుసుమము వంటిది. ఈనాఁడు కోర్టులలో ధనము గ్రహించి యసత్యములైన సాక్ష్యములను జెప్పుచుండుమనుజులకుఁ గలగుణము లన్నియు వారికడ నుండెను. వ్యక్తిత్వమున వారికెన్నిలోపములు గలవో. యన్నిరెట్లు సంఖ్య మొగలుసేనకంటె నెక్కుడుగనున్నది. ఈవిషమస్థితిఁ గ్రహించి, విశాలమైనయనుభవజ్ఞానము గలహుమ్మద్ ఖాన్ శాస్త్రా యుద్ధ మారంభమైన కొంచెముసేపునకే తనసైన్యము నోడినట్లు నటించుచు వెనుకకుఁ బొమ్మని యానతి నొసంగెను. శత్రువు లోఁగలనుభావము మార్జాలభటులకుఁ గలిగినవెంటనే పాఱిపోవువారిని వెంబడింపక నేను ముందు నేనుముందనునట్లుగా కేవలధనాశచే పట్టణమును కొల్లగొట్టుటకు బయలుదేఱి సైన్యమును గజిబిజి చేసి నియమశూన్యతను దెచ్చిపెట్టిరి. ఈయదను గని పట్టిచక్రవర్తి భటులందఱు నినుమడించిన ధైర్యసాహసములతో వారిపైఁ బడి యుద్ధమొనరించి యనేకులను జంపఁదొడంగిరి. మిగిలినవారెల్లరును యుద్ధమును విడిచి దిక్కున కొకరుగాఁ బాఱిపోయిరి.

ఇట్లోటమిని గెలుపుగా మార్చి మొగలులు సర్వమును బాదుషాకుఁ దెలియఁజేసిరి. యుద్ధమున గుఁజాలకష్టపడి పనిచేసి జయమునకుఁ గారణభూతులైన రహీము మొదలగువీరుల నామములను విని చక్రవర్తి యెంతయు సంతసించెను. కాని తానొనరించుప్రయత్నములన్నియును ధర్మబద్ధములైనవి గావున నాపరమేశ్వరుఁడు సాహాయ్యమొనరించి రక్షించునన్నాఁడను నభిప్రాయముచే నీశ్వరునకు భక్తిపూరితములైన యశ్రువులు కనులనుండి జారెను.

సూరతుకోట ముట్టడియు నఖండముగా జరుగుచుండెను. అందు బాధ్యతగలవా రెవ్వరును లేకపోవుటచే గొంచెముమందియుద్ధభటులు లోకసేనానియాజమాన్యము క్రింద యుద్ధము చేయుచుండిరి. ఆకోటయధికారి విడిగా బాదుషాతో యుద్ధమొనరించి యోడిపోయెను. భర్తయోటమియు సార్వభౌముని దండయాత్రయును విని సేనానికి దుర్గరక్షణ మొనరించుకోనవలసినదని యానతిచ్చి తనచిన్నకుమారుని దీసికొని యాతనిభార్య దక్కనుకుఁ బాఱిపోయెను. బాధ్యతగలవా రెవ్వరు నుండకపోవుటచే, భోజనపదార్థము లున్నంతకాలము సైనికులు పోరాడి యని పూజ్యములు కాఁగా దేవిడీతలుపులఁ దీసి బయటికిఁ బాఱిపోవుటకుఁ బ్రయత్నించిరి. యుద్ధము లేకయే సూరతుకోటయు వశము కాగా, పాదుషాకు సంపూర్ణవిజయము లభించెను. గుజరాతు నంతయును దనస్వాధీనములోనికిఁ దెచ్చికొని యచ్చటఁ దగినశాంతిని నెలకొల్పుటకుఁ గావలసినయేర్పాటుల నొనరించి తన ముఖ్యోద్యోగులలోఁ గొందఱిని సుబేదార్లగా నియమించి యక్బ రాగ్రాకు బయలుదేఱెను.

పటన్ నగరమును ముట్టడిచేసి యోడిపోయిన మీర్జాలలో నిరువురుత్తరహిందూస్థానమునకు మరలఁ బాఱిపోయిరి. ఈమారు సైన్యయుతుఁడైన రహీము పట్టుదలతో వారిని వెంబడించి దారియందెన్నియోస్థలముల యుద్ధములు సలిపెను. ప్రథమమున మీర్జాలు నాగూరుపట్టణమునకుఁ బాఱిపోఁగా నక్కడ నక్బరుపాదుషాక్రింద సామంతుఁడగు రామసింగను రాజపుత్రుడు మొగలుసైన్యములకు సహాయ మొనరించి మీర్జాలను వెడలఁగొట్టెను. దారిలో మరల నీయిరువురు నొక చెరువుగట్టున దారసిల్లి యుద్ధమొనరింపఁగా నందును మొగలుసైన్యములకే జయము కలిగి మీర్జాయనుచరులలో ననేకులు మడిసిరి. మిగిలిన యల్పసంఖ్యాకులతో శత్రువులుమరల ముందునకుఁ బరుగె

త్రిరి. ఎట్లో యొకమీర్జానైనను జంపినయెడలఁ దనకు బాదుషావలన నున్నతిగౌరవను లభియించుననునూహ రహీముయొక్క యాశానౌకకు ధ్రువనక్షత్రమై ముందునకుఁ దీసికొనిపోవుచుండెను. వారినినగర్కోటవఱకును వెంబడించి మసూద్ హుసేన్ మీర్జాయనునాతనితోఁ బ్రత్యేకముగా యుద్ధమొనరించి వానిని జంపి రహీము సంతోషపూరితస్వాంతుఁ డయ్యెను. ఇంకను నుత్తరమునకుఁ బాఱిపోవుచున్న యిబ్రహీము హుసేనుమీర్జాను వెంబడించుటకు మిగిలినసైనికుల విడిచి యాగ్రా పట్టణమునకు మరలెను. దారియం దాతఁడు పాదుషాను గలిసికొని విజయవృత్తాంతమును దెలిపి యనేకములైన మెచ్చులు నందెను. ఇఁక రహీము త్తమస్థానమునకు వచ్చుట కేమిసంశయము?

---

## ప దు నా ల్గ న ప్ర క ర ణము

### ద ర్బా రు

ప్రపంచమునందలి గుణరాజములలో నౌదార్య మొకటి. అది ధనికునికడ నుండెనా పసిఁడికిఁ దావి యబ్బినప్రకార మగును. ఆయౌదార్యమే నిర్ధనునికడ నున్నయెడ నాతఁ స్వయంప్రభను వెల్లడిచేయును. ఔదార్యమనఁగా నర్థికి ధనమొసంగుట యొక్కటియేగాదు. అదియు నొకవిధమగు నౌదార్యమే యగును గాని, యౌదార్య మనగా నిజమై, సంపూర్ణమైనయర్థము మనోవిశాలతయని చెప్పవచ్చును. అట్టిమనోవిశాలత గలవా రేస్థితియందున్నను కీర్తి నేగాంతురు. ఈయౌదార్యము మానవుని సర్వకాలములయందును, ముత్యములలోని కాంతివలె, అగ్నియందలి తేజస్సునవలె, శరీరమున నొప్పారులావణ్యమువలె, పుష్పస్థితమైన మార్దవమువలె, వ్యాప్తమై యుండును. ప్రకృతి

యందుండు నఖిలమానవులు నెన్ను సర్వశక్తునిచే నిరంతరము జరిగించుచుం డునో, యట్లే, ఉదారస్వభావము గలవారు సర్వసృష్టిప్రాణులయందును నేకీభావముఁ జెందియుందురను యిట్టి యూహ యక్బరు చక్రవర్తికి సహజగుణము. విశ్వమునందలి విలువను మెచ్చుకొనుట, దైన్యమును దగినట్లు నిరసించుట యాతని కుగ్గుపాలఁ బెట్టినవి. చక్రవర్తియే పరమేశ్వరుఁడు, దేశక్షేమమే సకలజగన్మాతయు, తదైక్యభావమును మనస్సున నాటుకొల్పి, నడిగట్టి తుచ్ఛమైన దేశాభిమానమును విడిచి హోరాహోరిగఁ బోరాడు పౌరవీరులపై నాతని కృపారస మపారముగాఁ బారును. సాధారణముగా యుద్ధములం దోడినసొత్తులు, సేవకులు, భార్యలు, పిల్లలు. ప్రజలు, నాప్రజల ధనములు మొదలగు సర్వమును గెలిచినవారిసొత్తు లని యుద్ధశాస్త్రములోని లిఖితముగాని చట్టము. కాల క్రమాగతమును, రాజపరంపరావలంబితమును ధనదాయకమునైన యీయలవాటును మొగలుచక్రవర్తి యాపివేసెను ఇరువదియవశతాబ్దమునందుఁ గూడ నోడినదేశములోని ప్రజలను గెలిచినవారి సైనికులు దోచుకొనుట మానలేకపోవునప్పుడు పదునాఱవశతాబ్దమందుండిన యక్బరిట్టి యలవాటును మాన్పించెననుట యెంతప్రశంసాపాత్రమో మన మూహించుకొనవచ్చును. 'సైనికులు యుద్ధానంతరము దేశమును కొల్లఁగొట్టరాదు. సరిగాఁ బనిచేసి జయము నార్జించినవారికి నిండు సభలోఁ దగినబహుమానము లయోచితముగా నీయఁబడును.' అని యక్బరు శాసనము. ఇదిగాక పరాజితుఁడైన శత్రువుయొక్క పెండ్లామును బిల్లల నితఁడు సంరక్షించుచుండువాఁడు ఒకానొకపురుషుఁడు రాజద్రోహి యైనంతమాత్రమున నాతనికుమారులును, బ్రజలును, భార్యయు రాజద్రోహులని నిర్ణయించుటకుఁ వీలుగాదు. వారితరులవలె సర్వహక్కులను గలిగి యుండవలసిన వారలే యని యక్బరు ప్రకటించెను. ఆదంఖాన్ అను గొప్పసరదారుఁడొకఁ

దురాజ్ఞ ననేకవిధముల నుల్లంఘించి తుదకు వధింపఁబడినను నాతని కుమారుఁడత్యంతోన్నతోద్యోగమునుండి ఖానఖానన్ అనుబిరుదము నుగూడ నొందెను. మొగలాయిసామ్రాజ్యమునం దక్బరుచే నిర్మింపఁ బడిన న్యాయదేవత యొకచేత నొకఖడ్గమును సంకొకచేత సువర్ణ రాశిని బట్టుకొని జనులకుఁ జూపుచుండును.

గుజరాతుయుద్ధమునందు సంపూర్ణమైనజయమును సంపాదించుటకుఁ దోడుపడిన యందఱకును దగుబహుమానము లొనరించుటకు దర్బారు సమావేశ మయ్యెను. వకీలు మొదలుకొని ౨౦ ప్రాతువఱకును గల రాజసేవకులును, నగరమందలి సర్వజనులును గూడి సభ కిటకిటలాడుచుండెను. చుక్కలలోని చంద్రునివలె నగరములోని యున్నత సౌధమువలె, గోసంఘమందలి వృషభేంద్రమువలె నున్నతాసనస్థుఁడైన యక్బరు విరాజిల్లుచుండెను. యుద్ధమునందు విశేషము పనిచేసినవారి పేరు లన్నియు నొకగుమాస్తా పఠించెను. తరువాత బహుమానములఁ బంచిపెట్టుసందర్భము రాఁగా నొక్కొక్కరు వరుసగాఁ బిలువఁబడిరి.

తొలుత రాజామాన్‌సింగు రాజాభగవాన్ దాసులనామములు పేర్కొనఁబడఁగా నక్బరు తనయున్నతాసనమునుండి యిట్లు పలికెను. 'గుజరాతుయుద్ధమునందే గాక మిగిలిన యన్నియుద్ధములయందును రాజకార్యములయందును నాకు రెండుచేతులుగా నుండి మొగలాయిసామ్రాజ్యమున కలంకారభూతులైన స్వామికార్యతత్పరులై ధర్మచింతనులై పనచేయువీరిరువురకును రెండుహారము లీయఁబడినవి.' వారిరువురును వినయముతో వంగి యచ్చోటికరుగుదెంచి యాహారములను చక్రవర్తిహస్తమునుండియే యందుకొని మోకరించి సలాము చేసి యథాస్థానముల కేగిరి. తరువాత మీర్జాయజీజ్ కోకా యనునాతఁడుగుజరాతుసకంతకును సుబేదారుఁడుగానియమింపఁబడెను

పట్టణనగరమునకు హస్సన్ ఖాన్ బార్హాయనునాతని సమీరుగా విధించిరి ఎవరియుద్యోగము ప్రకారము వారు తక్కిన యుద్యోగులు బహుమానముల నందిరి. వారివారి ప్రత్యేకస్థానములయందు చందనదాసు రహీములుగూడ నరుగుదెంచిరి. అప్పుడు చక్రవర్తి చందనదాసును క్రిందిరీతిగాఁ బ్రశంసించెను. "ఈతనివలననే మేము సర్నాదగ్గఱ గెలుపు నందఁగలిగితిమి. ఈతఁడు మమ్మును దక్కిన ముఖ్యోద్యోగులను యుద్ధశ్రమనుండి తప్పింపఁగలిగెను. సమయము ఘటిల్లినప్పుడు శక్తివంచన లేకుండ నసహాయశూరుఁడై యుద్ధము చేసెను. మసఫయిజగారిని మృత్యుముఖమునుండి రక్షించెను." అని వచించి యొక గొప్ప బంగారు శిరోభూషణము నొసంగి, యైదువందల సైనికులపై నధికారిగా నాతని నియమించెను. దానిని దనపాగాపై ధరించి యాతఁడు చక్రవర్తికి వంగి నమస్కరించెను. తరువాత రహీముపంతు రాఁగా "ఈతఁడు పత్తన్ యుద్ధమందు జయము నార్జించుటకు శక్తివంచన లేకుండఁ బనిచేసి మార్జాలలో నొక్కనితలఁ దెచ్చెను." అని వచియించి శిరమున కొకతురాయియు, వేయివరాలరొక్కము నొసంగి యైదునూఱులయాశ్వికులపై యజమానునిగా నియమించెను. ఆతఁడు పరమానందభరితుఁడై శిరము వంచి మఱిమఱి వంగి సింహాసనముకడ సలాములు చేసెను. తక్కిన సైనికుల కందఱకును బహుమతులను స్వయముగా పాదుషాయే పంచిపెట్టెను. సామాన్యుఁడైన సిపాయికిఁ గూడఁ దానే స్వయముగా బహుమానమును బంచిపెట్టుట యెంతగర్వరహితమైనపని! అఖండమండలేశ్వరుఁడై, రాజాధిరాజై, జ్ఞానసింధువై ప్రజాపూజితుఁడైన మహారాజునకుఁ దనప్రజలయందును సేవకులయందును నింతప్రేమయు విశ్వాసమును గలుగుట యెంతయుఁ బ్రశంసాపాత్రము. తరువాత చక్రవర్తి యుద్ధమందు గతించినవారి నెల్లర నీవిధిని గీర్తించెను.

"రాజ్యస్థాపనకును, ధర్మస్థితికిని, గారకులై తమరుధిరప్రవాహములచేతను, ప్రాణదానములచేతను మాతృదేశము నర్చించి వీరస్వర్గమును బొల్గొని యున్న మహాపురుషు లెల్లరు వందనీయులు. అట్టి మహాత్యాగు లేనే దేశముల నుద్భవింతురో యాయా దేశము లెప్పుడును సర్వైశ్వర్యములతోఁ దులదూగుచుండును. వారియాత్మల కెంతయు శాంతిని బరమేశ్వరుఁ డిచ్చుఁగాత! మతనియమప్రకారము జరుగవలసిన సంస్కారములు పూర్ణముగా లేదని పరమేశ్వరుఁడు వారిపై నాగ్రహించుటయే నిజమగునెడల నట్లాగ్రహింపకుండ మనమాయనను ప్రార్థింతము. వారికుటుంబమునకు మనసానుభూతిని దెలుపుచున్నాము. గతించినవారినే యాధారముగా నమ్ముకొని యున్న శిశు యువతీ వృద్ధు లందఱకును శాశ్వత వేతనము లీయఁబడినవి" అని వచియించి యాపించనుల జాబితాపై తనసంతకమును జేసెను. తరువాత పండుగల యందువలెనే తనయొక్కధనమును దెచ్చి స్వయముగా సైనికులకుఁ బంచిపెట్టెను. కార్యక్రమ మంతయును బూర్తియగుసరికి సుమా రాఱుగంట లయ్యెను.

దర్బారు ముగిసిన తరువాత రహీము తనమిత్రులను గలిసికొనెను. వారందఱును సంతోషసముద్రమున నోలలాడిరి. నాఁడు విలువగల క్రొత్తవస్త్రములను ధరించి యుత్తమాశ్వముపై నెక్కి తురాయిని పాగాపైఁ గైసేసి తనకుఁ బరిచయముగలవారి నెల్లరను జూచుటకు రహీము బయలుదేఱెను. అన్ని వీధులును దిరిగి ఫయిజీయింటి ముంగటికేగి లోనఁ బ్రవేశించుసరికి సిద్ధముగా రామాబాయి నిరీక్షించుచుఁ గూరుచుండెను. వచ్చినరహీమును జూచి, చిన్నినవ్వు నవ్వి మేనిపోకను, ముఖలావణ్యమును మెచ్చుకొనఁగా నతఁడు లోలోపల నుప్పొంగెను. అంత వారిరువురు నిట్లు భాషించిరి.

రహీ——రామాబాయ్! ఈతురాయి యెట్లున్నది. అది ధరించినప్పు డెట్లున్నాను? పెద్దయుద్యోగ మైనది. ఇఁకనైన మీయజమానురాలు నన్ను వివాహమాడునా!

రామా.—ఆతురాయి వేసికొని గుఱ్ఱముమీఁద బోవునపుడు మిమ్ముఁగాంచి ముసిముసినవ్వులు నవ్వనిముదిత యెవ్వరు! ఇంక పహ్మాదా వశపడుగుట యెంతపని!

రహీం—అట్లైన నన్నామె వరించుననుట సత్యమే గదా. ఆమెతో మరలమరలఁ జెప్పి నన్ననుగ్రహించునట్లు చేయవలెను! ఇంక ఫయిజీతో స్వయముగా నేనే మాటలాడువాఁడను. ఆమె యిష్టపడునటుల చేయుట నీపని.

రామా—మీకును పహ్మాదాకును నెంతయో తారతమ్యము గలదు. ఆమె, తలిదండ్రులు లేనిబిడ్డ. దయచే ఫయిజీయును నాతని తండ్రియు నింటఁబెట్టి పెంచుచున్నారు. మీవంటి సరదారుఁడును సుందరపురుషుఁడును నామెకు లభించుట యెట్లు? మీయాధిక్యమును మీరెఱుంగక భయపడుచున్నారు. మీయుద్ధనైపుణ్యమును గాంచిన వారు వేనోళ్ళ మిమ్ముఁ బొగడుచున్నారు. చక్రవర్తి మెచ్చి స్వయముగాఁ దురాయి నిచ్చిన ట్లూరంతయుఁ జెప్పుకొనుచున్నారు. అట్టి సందర్భమున మిమ్ముల నెవ్వరు వివాహమాడకుండ నూరకుందురు? ఇంతకును మీకంటె మంచిమగఁడు వేరొకఁ డామెను దొరకినప్పు డాలోచింతము లెండు.

రహీమ్—అపునుగాని యడుగవలయు నని యెంచితిని. యుద్ధమునకుఁ బోవుటచే సమయము చిక్కినది గాదు. ఫైజీ యింటికి వచ్చుచుఁ బోవుచుండుచందనదాసు మొన్న నహమ్మదాబాదులో వీరి నిరుపురను శత్రువులబారినుండి విడపించినాఁడట. ఆతఁడేమైన నామెను వివాహమాడుటకుఁ బ్రయత్నించుచున్నాఁడేమోయని నాకనుమానము. ఈవిసనకఱ్ఱగూడ వానికే జిక్కినది—అని తనపరుపుక్రిందఁ దాళవృంతమును దీసి చూపెను.

రామాబాయి—మీయనుమాన మెన్నటికిని వలదు. అట్టిది కలలోనివార్త. వారిమతములైన మీరు తలపలేదు. విశేషించి చందన

దాసు పిచ్చిబాపనయ్యా ఆవిసినకట్ట షహామీదా యప్పుడప్పుడు కట్టి పెట్టఁగాఁ బొరపాటున వీనిని జెందెను. దానికొఱ కెంతయు నామె వెదకికొని నన్నడగినది. చందనదాసున కొకదాని కొకటి యిచ్చితిమని నేను తెలుపగా నెంతయో విచారించినది. ఇవి మీకెట్లు వచ్చినది.

రహీమ్—అవును! నీవనినట్లు ఆపిచ్చిబాపఁడు నాకిచ్చినాఁడు.

రామాబాయి—ఇదియే వారియిద్దరకును ప్రేమ లేదనుటకు ప్రబలనిదర్శనము. ప్రేమపూరితుఁడే యైనయెడల దానిని మీకొసంగునా! ఇంతకు నామూర్ఖునికి ప్రియురాం డ్రొసఁగు కానుకలు గుర్తెఱింగి గైకొనునంతటిశక్తి గలదా!

అని యనేకవిధములఁ నాతనిని పొంగవేసి "షహామీదాకు నీపైనే ప్రేమ గలదు" అని చెప్పి యొప్పించి నూతనోద్యోగప్రాప్తిజనిత కుతూహలంబునను, నిజసత్వాభిమానప్రోద్భూతగర్వంబునను, నత్యుత్సాహియై యాతఁ డొసంగినబహుమానమును గ్రహించి కులుకుచు రామాబాయి యింటికేగెను.

---

# పదునేనవ ప్రకరణము

## అబుల్ ఫాజల్

అబుల్ ఫయిజీకి, నాబుల్ఫాజల్ అను నొక సోదరుఁడుండెను. ఆతనికి వయస్సిరువదిమూఁడు సంవత్సరములు మాత్రమే యైనను జ్ఞానముమాత్ర మపారము. జ్ఞానభాండారమని పేరువహించిన షేక్ ముబారకు కుమారుఁడై, కవిరాజుబిరుదమునకుఁ దగియున్న ఫయిజీకిఁ దమ్ముఁడైన యాతఁ డసదృశప్రజ్ఞావంతుఁడు. మహామేధావి. తత్త్వజ్ఞానవిశారదుఁడు. నీతిశాస్త్రపారీణుఁడు. తండ్రిపాదములయొద్దఁ

గూరుచుండి యీతఁ డాతని జ్ఞానసింధువును మథించి యందలి యమృతమును బానమొనరించెను. పారసీకమునను, అరబ్బీభాష యందును దగు పాండిత్యము గలిగినతరువాత నన్నిగ్రంథములను దనంతట తానే చదువుకొనెను గాని యికొక గురువు సాహాయ్య మపేక్షింపలేదు. స్వశక్తివలననే విద్యాసారము నాస్వాదించినవాఁడు. కవిముఖనిర్గత కవితాప్రవాహ మల్పపాండితి గల గురువువలనఁ బొందఁబడినయెడల నెంతయును జెడిపోయి గ్రహియించువాని కానం దము గాని జ్ఞానముగాని యొసంగఁజాలదు. కావ్యములు, మతగ్రం థము లగు సున్నా మొదలగునవియు, ప్రకృతిశాస్త్ర గ్రంథములును వేయేల, అరబ్బీపారశీకభాషలయందలి యన్నిగ్రంథములును నీయ నకు కంఠస్థములై యుండెను. విద్యయనునది యొకశక్తి. ఆ శక్తి నున్నతాదర్శములకును, సత్కార్య సాధనకును నుపయోగించుట యెంతయుఁ గష్టము. సంపాదించిన విద్యవలన నున్నతాశయము లును, హృదయవైశాల్యమును, యుక్తాయుక్త విచక్షణతయును గలిగినఁ గాని యావిద్యకు సార్థక్యములేదు. అట్టి సద్గుణము లన్నియు నీతనియందు కాపుర మున్నవని చెప్పిన నతిశయోక్తి కాదు. అజ్ఞా నాంధకారమునఁ బడి కొట్టుకొనుచు సత్యాసత్యపరిజ్ఞానదూరులైన మానవుల కీతఁడు మార్గదర్శకుఁడుగా నుండవలయునని యెంతయుఁ గాంక్షించుచుండును. తాను ప్రపంచమునం దెన్నియో యుత్తమ కార్యముల నొనరింపవలయు నని దృఢవిశ్వాసముతో నుండినవాఁడు గావున నాతని మనస్సునకు శాంతియేలేదు. ఒక్కొక్కప్పుడు పాప భూయిష్ఠమైన యీసంఘమును విడిచి ఫకీరునై యానందసముద్ర మున మునిఁగియుందునా యని యోచించుచుండును. ఒకనాఁ డాతఁడు తన్నుగుఱించి యిట్లనుకొనెను. "నామనస్సునకు శాంతి గలుగుట లేదు. నామానసము మంగోలియాదేశమునందలి సన్యాసులకడ

కును, తెలుగు రాజ్యములోని యోగుల చెంతకును, లాగఁబడు చున్నది. టిబెట్ ప్రదేశమునందుండు మతగురువులగు లామాలదగ్గఱకు పోయి మతమునుగుఱించి వాదింతునా యని యూహ పుట్టుచున్నది. పోర్చుగల్ దేశములోని పాదరీలతోఁ గాని, పెరిషియూజ్ఞానులతోఁ గాని, జెండవాస్తాయందుండు మతబోధకులతోఁ గాని నాకు సహవాసము సలుపవలయునని యున్నది. నా దేశమునందలి పండితులన్న నా కేవ జనించుచున్నది.''

ఇరువదియొకటవయేఁట నే యాతఁ డొక యధ్యాపకుని యుద్యోగమును సంపాదించి బాలురకు విద్యగఱపుచుండువాఁడు. ఆకాలమున బాలురకు నేర్పఁబడు గ్రంథములచే గాక తత్వజ్ఞానముగూడ బోధింపవలయునను నాశయముతో నుండెడివాఁడు. ఇన్ ఫహాని యను నొక కవి వ్రాసిన యద్భుతగ్రంథ మొకటి యాతనిచేతికిఁ జిక్కెను. ఆగ్రంథము విద్వగ్రాహ్యము. సాధారణముగాఁ బండితులకే యర్థముగాదు, కొఱుకఁబడదు. ఆపుస్తకములోని ప్రతిపత్రమునందును మీఁదినుండి క్రిందకు సగము చెదదినివేయగాఁ బోయిన స్థలములయం దెల్లను బత్రములఁ జేరిచి యాగ్రంథమును బూరించెను. కొన్నిదినములు గతించినతరువాతఁ బూర్తియైనయాగ్రంథము ప్రతియొక్కటియొకపండితునికి లభియింపగా నాసంపూర్ణమైనగ్రంథమును, ఫౌజలుపూరించిన దానిని గలిపి, బరీక్షించిన నూటికిఁ దొంబదిపాళ్ళు రెండును సరిపోయెను. శైలియందును భావములయందును నప్రతిమానుఁడైయామహాకవితో సరిపోవునట్లు వ్రాయఁ గలిగెనను వార్త పట్టణ మంతయు నల్లుకొనిపోఁగ బాదుషాయు విని యెంతయు నాశ్చర్యపడెను. ఆయబుల్ ఫౌజలు ఫైజీయొక్క సోదరుఁ డని తెలిసి చక్రవర్తి యొకనాఁ డాతనితో నిట్లనియె ''అయ్యా! ఆన్ ఫహాసికవితో సమానముగు కవిత్వము వ్రాయగలిగినంతటి తేజోనిధి యగు తమ్మునిగలిగియుండియు మీరా

యున నాస్థానములోనికిఁ దీసికొని రాకుండుట యెంతయు శోచనీయము."

ఫైజీ—ఏలినవారు వచియించినదంతయును నిశ్చయము. ఆతనివిద్వత్తును, నాతనిజ్ఞానమును జూచి నేనెంతయు నబ్బురపడుచుందును. ఏకసంథాగ్రాహియని యెప్పుడును నాతండ్రి యాతనిని బొగడుచుండెడువాఁడు. నాతండ్రికిఁ గలజ్ఞానమునంతయు నత్యల్పకాలములో గ్రహియించి దక్కినగ్రంథజాలమును స్వయంకృషిచే మథించి వానిసారమును గ్రోలెను. ఇంతజ్ఞానము గలిగియుండుటచే నాతనిమనస్సునకు సంతుష్టియే లేదు. ఇక్కడిపండితు లన్నను, హీరియజ్ఞానజనితసిద్ధాంతము లన్నను, ప్రజల నంధకారకూపములోఁ దిరుగఁద్రోయుట కొనసరించుప్రయత్నము లన్నను నాతఁ డెంతయు విసుపుఁజెందుచుండును. నేను, మహామహులైన యేలినవారిదర్శనమునకుఁ బోవలసినదని యెన్నియో సారు లాతనికిఁ దెలిపితిని గాని, ధనపరనాదికార్యములోఁబడి నావాక్యముల నాచరణలోఁ బెట్టుట లేదు. పరమేశ్వరజ్ఞానవిలాసములలోనే నెప్పుడు మునిఁగి తేలుచుందు ననియును, రాజసభకరుగుదెంచి ప్రాపంచికతుచ్ఛవిషయములయందు సంబంధము గల్గించుకొన ననియును నాతఁడు పల్కుచుండును.

అక్బరు—అట్టిపురుషుడు మాసంస్థానములోని పండితుల కలంకారభూతుఁడై యుండవలెను. ఆయనవలన మనకును మనదేశమునందలిప్రజలందఱకును గావలసిన యున్నతకార్యము లనేకములు గలవు. మీరు పిలిచినంతమాత్రమున నాతఁడు రాకున్నపక్షమున మేమే స్వయముగా నచ్చోటి కరుగుదెంచి యాయనను బిలుచుకొని వత్తుము.

ఫైజీ—దేవరవా రంతవఱకుఁ బోవనక్కఱలేదు. ఆతఁ డెంతవిద్వాంసుఁడైనను తమయాజ్ఞయైనతరువాత నిక్కడకు రాకున్నచో

ద్రోషియే యగును. తమరాజ్యమునందలిప్రజలలో నాతఁడు నొకఁడగుటచేఁ దమయాజ్ఞను దిరస్కరింపఁజాలఁడు.

అని సంభాషణజరిగిన మఱునాఁడు స్సైజీ, యాబుల్ ఫాజలుతో నాయుదంత మంతయును దెలిపి రాజసభకు రాకున్నఁ దప్పు దని నిర్బంధించెను. అన్న తనతోఁ జెప్పినమాట లన్నియును విని దనలో నాలోచించుకొనుచు మౌనము దాలిచి యూరకుండెను. కొంతసేపైనతరువాత నొకగదిలోనికిఁ బోయి యొకగ్రంథమును దగ్గఱ వైచికొని కూరుచుండెను. ఇంతలోఁ దలుపు ద్రోసికొని చందనదాసనగు వెంచెను. చందనదాసునకును స్సైజీకని గలమైత్రి కాలక్రమమున వృద్ధియగుటచే, ఫాజలునకే గాక వారియింటిలోనివా రందఱకును నీతనికిని గలపరిచయ మత్యంతము బెరుఁగుచువచ్చెను. మిత్రులగు నాయిరువురకును రాజసభనుగురించి యీవిధి నుత్తరప్రత్యుత్తరములు జరిగెను.

చందన—మిత్రమా! ఏదియో యాలోచించుచున్నట్లున్నారు.

అబుల్—అవును. నన్ను దర్బారునకుఁ బిలుచుకొనిరావలసిన దని పాదుషా యుత్తరువగుటచే మాయన్నగారు వచ్చుటకై నన్నురమ్మని నిర్బంధించుచున్నారు గాని యచ్చటకుఁ బోవుటకు నా కేమాత్రము నిష్టము లేకున్నది.

చంద—తమపాండిత్యమును, నద్భుతమగు శీలమును విని గుణగ్రహణపారీణుఁడు గావుననే పాదుషా రమ్మని మీకు సందేశ మంపెను. అచ్చటఁ దగినగౌరవము దప్పక జరుగగలదు. అందులకే లోటును లేదు గావునఁ దాము పోవలసినదే! ఏకారణముచేఁదాము పోవుటకు సంశయించుచున్నారు ?

అబుల్—అయ్యా! రాజు లనిన నాకు తలనొప్పి. వారికడ సేవఁజేయుటకంటె జోలితో బిచ్చమెత్తికొనుట మేలు వారు ధన

మత్తులు, అధికారగర్వాంధులు, వివేకశూన్యులు, వైభవోల్లాసులు వారికడ సేవ నొనరించువారికి స్వాతంత్ర్య మనుమాటయే శశవిషాణ మువంటిది. సర్వశక్తులనుగూడ నమ్ముకొందురు. రాజులకు గుటుంజను లనుభావముండదు. యుక్తాయుక్తపరిజ్ఞానము నటుంచి వారిని వైతాళికులవలె స్తోత్ర మొనరించువారియందు ప్రీతి మెండు. చక్రవర్తియభిప్రాయము ననుసరించి మన భావములను, చేష్టలను, కోరికలను, వేయేల యభిరుచులనుగూడ మార్చుకొనవలయునే గాని, లేనియెడల వారి యధికారగర్వాగ్నిహోత్రమునకు మనశరీరము లింధనము లగును. అభిప్రాయభేదము నోర్చుకొనుటయన్న వారికి సున్న. పట్టిన కుందేటికి మూఁడే కాళ్ళని యుచ్చరించుటయే గాక ప్రత్యక్షప్రమాణమును జూపినను నభిప్రాయమును మార్చుకొనక యభిమానపూరితు లగుదురు. తృష్ణాపరులై రాజ్యములను గొల్లగొట్టించి ప్రజల ధన ప్రాణమానములను నిర్హేతుకముగా హరింతురు. తమతో సరిగా బరమేశ్వరునిచే సృజింపఁబడి సమమైన హక్కులు గలిగిన యన్య మానవులజీవితము లన వారికొక యీఁగవలెఁగూడ నుండదు. అయుక్తమనినఁ బథ్యము. నిష్కలంకమై, యనిర్వాచ్యమై, యసమానమైన విజ్ఞానజనితసత్యోద్రేకసంతుష్టి యచ్చోట లభింపదు. అచ్చటి వారు కేవలము ప్రాపంచికదీక్షతో స్వలాభపరాయణులై వ్యవహరింతురు. పారమార్థికచింత యనిన వారికి సున్న కావుననే బాదుషా కడకుఁ బోవుటకు నే నిష్టపడలేదు.

చంద—అయ్యా! తాము చెప్పిన దంతయు నన్యరాజన్యులకుఁ జెల్లును గాని యక్బరుచక్రవర్తి కెంతయుసు జెల్లదు. ఆతనికి తాము పేర్కొన్న దుర్గుణములలో నొక్కటియును లేదు. అతఁడు మహోదారుఁడు, విద్వాంసుఁడు, న్యాయైకపక్షపాతి, సరసుఁడు, వేయేల! యాతనికిఁగల సుగుణము లెప్పుడు నెవ్వనికి నుండఁజాలవని నా

యభిప్రాయము. అట్టి మహామహునిసేవ స్వచ్ఛందవృత్తియే గాని సేవగానోపదు.అక్కడస్వాతంత్ర్యమేగాని పారతంత్ర్యమనుమాటయే లేదు. ఇదిగాక మీరు విద్వాంసు లనియు మహాపురుషు లనియు నెఱిఁగియుండుటచే నసమానప్రతిపత్తిని జూపుదు. దానికేసందియ మును లేదు.

ఆబు—అవును. నేనుగూడ నట్లే వింటిని. ఆతఁ డెంతయు గొప్పపాదుషా యని జనులందఱును బల్కుచుందురు గాని నాకచ్చ టికిఁ బోవుటవలన నేమి ప్రయోజనము గలదు ? వారిచ్చినధనమును వారొనరించిన గౌరవమును క్షణభంగురములు. విశేషించి నిష్ప్రయోజనములు. శాశ్వతమైనపదమును గానికీర్తినిగాని నేనెట్లుసంపాదింతును ? అక్కడికిఁ బోవుటవలన నాకుఁగాని నాయితర సోదరులకుఁ గాని యేలాభము గలుగును ? శాంత్యావాసమైన మహాత్ములయాశ్రమముల నున్నచో, నాకు నెంతయుఁ దుష్టికలుగును. అదిగాక యచ్చటి సత్పురుషులఁగూడి లోకమునకు బోధన మొనరించి సత్పథమునకుఁ ద్రిప్పఁగలుగుదును. అట్టిప్రపంచసేవ నొనరించుట కేసదుపాయము లచ్చటఁ గలవు ?

చంద—, సుహ్యాన్మణీ! నీవు జ్ఞానివై యుండి యట్లు పొరఁ బడుట యెంతయు విచారకరము. నీకుఁ దెలియనినీతి గలదా? ఒకమత గురుఁడవై నిర్జనమైన యొకయాశ్రమమునఁ గూరుచుండి దగ్గఱ కరుదెంచు నొకరిద్దఱు మనుజులకుమాత్ర మేదోబోధనచేయుట మంచిదా? చక్రవర్తియండను జేరి యాయనకే గురుఁడవై యుండుట మంచిదా? గుర్తించుకొనుము. అక్కడ నీకుఁ గలగౌరవమును సదుపాయములును మఱియొకచో నుండఁజాలవు. నీయభిప్రాయములను బాదుషా కెక్కించినయెడల నాతఁడేగాక సామ్రాజ్యమునందలి సర్వులును నీయాజ్ఞను శిరసా వహింతురు. వచియించినది ధర్మబద్ధముగా నున్నప్పుడు

బాదుషా తప్పక యొప్పుకొనును. న్యాయములైన యాశయము లనిన నాతని కెంతయో ప్రీతి. అట్టిసందర్భమున నీయూహల కేమియు భంగము గలుగదు. ఎంతవిశాలమైనదృష్టి గలవాఁడైనను గొండపై నిలువఁ బడువానికంటె భూమిపై నిలువఁబడువానికి దృష్టిప్రసారము దక్కువయే యగును. స్వభావముచే విశాలమైన దృష్టిగలవాఁ డొక పర్వతాగ్రము నెక్కినయెడలఁ గలుగులాభ మింతింతని చెప్పవల యునా! కనుక నీవు సర్వవిధములను బాదుషాస్నేహ మొనరింపవల యును. ఆస్నేహమున మీయిరువురకు నఖండమైనకీర్తి లభించుటయే గాక రాజ్యమున కంతకును హితము గలుగును.

మిత్రుఁడు చెప్పిన వాక్యముల నన్నిటిని విని యభిప్రాయము గొంచెము మాఱినతోడనే యన్నగారిమాటలుగూడ నాతనికిఁ దలంపునకు వచ్చెను.

ఫాజ—నీవు వచించినది యుక్తమే యని తోఁచుచున్నది. అక్కడ కేఁగుటవలన నన్నగారి కెంతయు ముదముగూర్చువాఁడ నగుదును. కావున మరల సందేశము వచ్చుచోఁ బోవుట కాలోచింతును.

చంద—తప్పక మీకుఁ గబురువచ్చును. మీరును పోయితీఱ వలయును.

ఇఁక కొంతసేపు వా రేదియో చర్చించిన తరువాతఁ జందన దాసు సెలవుగైకొని యింటి కేఁగెను.

---

## పదునాఱవ ప్రకరణము

### రెండవదండయాత్ర

అల్పము, అధికము, అనుభేదము మహాపురుషులకును కార్య దీక్షాపరులకును నుండదు. కార్యభార మున్న వారికి పట్టుదల గొప్పది.

అల్పాధిక్యములకుఁ గరభేదము రూపమందే గాని స్వభావమందు గాదు. ప్రపంచమున నున్న స్వభావములును శక్తులును క్షణములో మాఱుచుండఁగా రూపము మాఱుట యెంతసేపు. అల్పము లని త్యజియింపఁబడినవియే యధికములై తుదకుఁ గొంతు పట్టఁగలవు. "అరటితడప, అని పారేస్తే ఖిన్నారై కరవడం యెరగవా" అన్న సామెత గీనివలన వచ్చినదే. మహావృక్షమగు వట మత్యల్పమగు బీజములో నిమిడి యున్నది. కారణ మల్పముగా నున్నను గార్యములు ఘనతరములుగా నుండును. పూచీ గలిగి కార్యభారమును దాల్చిన వారికి మాత్ర మల్ప మని నిరసనభావము గలుగదు. గాని పూచీ యనున దెఱుఁగక ప్రమత్తులై విషయప్రసక్తులై తిరుగాడువారికిఁ బ్రతివస్తువు నందును నిరసనభావమే గలుగుచుండును. అట్టిస్వేచ్ఛావిహారికిహపర సౌఖ్యములు సర్వము గగనకుసుమములే యగుట తప్పదు.

మేఁత మేయుచున్న యేనుఁగులవరుసలముందుఁ గూరుచుండి యక్బరుచక్రవర్తి యొకనాఁడు వానయాహారాదులను బరీక్షించుచుండెను. తాను. స్వయముగాఁ బరీక్షింపవలసిన యంశమగునా! యని యాతనికి మనస్సునఁ బుట్టలేదు. ఆతనివెనుక నొకప్రక్క చందనదాసును రెండవప్రక్క నొక మహమ్మదీయుఁడును నిలువఁబడియుండిరి. అక్బరు ప్రక్కనున్న ముసల్మానునితో నిట్లు భాషింపఁదొడఁగెను.

ముసల్—మహాప్రభూ! ఏనుఁగులు చిక్కిపోవుటకుఁ గారణము దెలియకున్నది.

అక్బ—మేఁత సరిగా వేయుచున్నచో నవి యెందులకుఁ జిక్కిపోవును. ప్రపంచమందలి జంతువులకు సరియైన యాహారవ్యాయామము లుండినయెడల నారోగ్య ముత్తమస్థితిలో నెందుకుండదు?

ముస—ప్రతిదినమును సరియగు నాహారము నేపెట్టుచున్నాము. పనియును జేయించుచునే యుందుము.

అక్బ—అట్లయిన నేనుఁగున కింతయాహారము నీయీ వస్తువుల నీయవలసిన దని యొకపట్టికను నిర్ణయించి దానిని మీరనుసరించుట లేదా? ఏనుఁగులకుఁ బెట్టుపదార్థములు సరిగా లెక్కలలోని కెక్కుచున్నవా?

ముస—చిత్తము! మహాప్రభూ! ఏనుఁగులకు భోజనపదార్థములు కొలఁతచేయుట గలదు. మొత్తముమీఁద నన్నిటికి నింతయను నియమము గలదు గాని యొకొక్క యేనుఁగున కింతంత యను నియమము నవలంబించుట లేదు. నెలనెలయెడల లెక్కలఁ దెత్తును.

మొగలు సామ్రాజ్యముగందు లెక్కలను దనికీసేయు శాఖ యొకటి యుండెను. ప్రతిశాఖవారును దమశాఖకుఁగాను చేయఁబడిన వ్యయములను లెక్కవేసి, వారపులెక్కలు. నెలలెక్కలు, మూఁడు నెలలలెక్కలు. సాలుసరిలెక్కలు వ్రాసి పంపుకొనవలెను. పాదుషాయానతిపై నామునస్లానుసరదారు లోనికిఁ బోయి భత్యములపట్టికను తెచ్చి పాదుషా కొసంగును. దాని నంతను బరీక్షించి "యీయేనుఁగులకు బియ్యము తక్కువ పెట్టుచున్నారు. సమూహముగాఁ గాక ప్రతియేనుఁగునకును లెక్కవేసి పూర్వముకంటె నొకటిన్నరరెట్ల బియ్యము పెట్టవలయును" అని యాజ్ఞాపించెను.

ఏనుఁగులను బరీక్షించుచున్న సమయమున నొకయాశ్వికుఁడు గుజరాతునుండి లేఖను దెచ్చి యొసంగెను. పైనున్న లకోటానుజించి యక్బరు దానిని చేతఁబట్టుకొని చదువ నారంభించెను. చదువుపూర్తి కాఁగానే ముఖ మెఱ్ఱవడి కన్నుల నిప్పులు గ్రక్కజొచ్చెను. సైన్యమును జతచేసికొని మరల యుద్ధప్రయత్నముపై నున్న వీరి నీసారి నలిపివేయవలెను. ఔరా! ఋణశేషమును వ్రణశేషమును నుంచుకొనుట మంచిదిగాదుఁ ఏవిధముననైనను వారి నీసారి దలయెత్తకుండ నిర్మూలింపవలెను." అని తలంచి యక్బరు చక్రవర్తి చందనదాసు

ద్వారా, సైన్యము నత్యంతత్వరితముగా నాయితము సేయవలసిన దని సేనానాయకున కాజ్ఞాపించెను.

మొలకలో నున్నదానిని మొలకలలోనే చిదిమివేయవలయు ననియును అది బెరిగి పెద్దదైనపిదప వాతఁ దీసివేయుట కష్టమనియును నక్బ రెఱుంగుటచేతను గార్యములఁ దీర్చుటయందు మించుచుఱుకుఁ దనము గలవాఁ డగుటచేతను నాయంకాలమునకు రెండువేలకాల్బలము నాయితము చేసి యారాఁడే ప్రయాణము గమ్మని యానతిచ్చెను. అనేకయుద్ధములలోఁ బేరొందిన విజయమును గాంచినసైనికులును, యుద్ధపద్ధతుల నెఱిఁగిన దండనాయకులును, స్వామికార్య మున్నచోట్ల స్వార్థ మనునది లేకయే తమప్రాణములను గూడ తృణప్రాయముగాఁ జూచు భటాగ్రేసరులును. సర్వమార్గముల నెఱిఁగి యావన్మాత్రము వచ్చినయెడల జడిసైనను గుర్తుపట్టి కారణము నూహించు నంతటి మెలఁకువగల మార్గశోధకులును, గలసి యాసేన యేర్పఱుపఁ బడెను. తనసేనాసముద్ర మను క్షీరసాగరమునుండి యామీఁగడను దనతోఁ బట్టుకొని చక్రవర్తి యుద్ధయాత్ర వెడలెను. చందనదాసు రహీముల యాయుధచాలనసామర్థ్యమును, శరీరలాఘవమును, యుద్ధనైపుణియు స్వామిభక్తియుఁ దన కత్యంతముఁ బ్రీతికరములై యుండుటచే, వారినిగూడ నీయుద్ధమునకు రమ్మని యాజ్ఞ చేసెను. అశ్వికులు కాల్బలము ఫిరంగులు తప్ప నీనారి గజబలము పోలేదు. సేన యంతయును వెంటనే ప్రయాణ మొనరింపవలసిన దని యానతిచ్చి, ఆదివారపుటుదయమున మూఁడునూఱులయాశ్వికులతోఁ గలసి, యెక్కిన గుఱ్ఱమును దిగకుండఁ దొంబది మైళ్ళు ప్రయాణ మొనరించెను. రెండవదినము లాహోరిని ప్రవేశముచేసి యజ్మనుదగ్గఱ యక్కడ విడిసెను. ఆపురమునకు సమీపమున నున్న యొకపర్వతాగ్రమందలి మైనుద్దీను చిష్టీ యను మహామహునిసమాధిని దర్శించుటకుఁ బోయెను.

అది యాయన కెంతయుఁ బ్రీతిపాత్ర మగు స్థల మగుటచే నాతఁడు వీలుపడినప్పు డెల్ల నచ్చోటికిఁ బోయి వచ్చుచునే యుండును. పర్వతముపై నున్న మహాత్ముని యస్థులను బ్రక్కనున్న పచ్చనిచెట్ల సముదాయమును నాస్థలమున కొకవిధమగు పావనతను గలిగించుచుండెను. ఆస్థలమాహాత్మ్య మెట్టిదో గాని యచ్చట ననిర్వాచ్యమైన శాంతి దాండవమాడుచుండును ప్రాపంచిక విషయములయందు మనస్సు రోసినప్పు డెల్లఁ దప్పక యచ్చోటి కేఁగి తనమనోనయనములకు విందొనరించుచునే యుండును. కొండమొదటి కేఁగి యచ్చటఁ దనగుఱ్ఱమును దిగి గొరకడకుఁ బాదచారియై యెక్కిపోయెను. చీమ చిటుక్కుమన్న శబ్దము లోపల వినఁబడుటలేదు. నిర్వాణ మనునది యాస్థలమున రూపము దాల్చి తాండవ మాడుచున్నట్లున్నది. ఆస్థలము కేగి యాశాంతిలోఁ దనమనోగతభావముల నీరీతిగా లోలోనఁ బలికికొనెను.

"మహాత్ములు ప్రపంచమునం దుద్భవించుట యరుదు. అట్టి తేజోవంతులు గలిగిన దేశమునకుఁ దప్పక శుభములు రాఁగలవు. వారిదర్శనముననే జనులకుఁ బవిత్రభావము లుద్భవించుచుండును. వారెప్పుడును స్వార్థమును జింతింపక ప్రపంచహితార్థమే పనిచేయుచు గాలము గడపి తుదకుఁ దమయస్థులనుగూడ జనులమనస్సుల కుత్తమత్వము నుద్బోధించుటకై యీలోకమునువిడిచి, తామేయీశ్వరుని సన్నిధానమునుండి వెడలివచ్చిరో యట్టియీశ్వరుని సముఖము నేచేరుకొందురు. ఓమహాపురుషవర్యా! అట్టివాఁడ వగు నీశరీరశకలములచే బవిత్రమైన యిచ్చోట నీశ్వరసేవ నొనరించుచు సర్వకార్యదూరుఁడనై యుందును. రాజ్యము నెవరికో యిచ్చి యిట్టియనిర్వాచ్యమైన యానందాబ్ధినోలలాడకున్న నిఁక నాజన్మమేల!" అని యేమేమో తలఁచుకొనుచుండఁగా, నాయన కీవాక్యములు మనసులో వినఁబడినట్లు దోఁచెను.

"జౌను! పరమపురుషు లందఱును బరమేశ్వరాంశతోఁ బుట్టుచుండుట సత్యము. ప్రతి మానవునకును దనసంఘమున కొనరింప వలసిన సేవ యశేషము గలదు. అట్టిసేవను సంపూర్ణముగా సాధ్యమగునంతవఱకుఁ జేసిననేగాని పరమాత్ముని యనుగ్రహంచున కెవ్వఁడును బాత్రుఁడు గాఁజాలఁడు. అట్టి యాపతి నెఱింగించి దానిని విధ్యుక్తముగా నెఱవేర్చుటయే యస్మత్కర్తవ్యమైన కార్యము. నీవొనరించి తీరవలసిన కార్యము లనేకము లున్నవి. అందఱు సంఖ్యములలోఁ గూరుకొనుండినయెడల జనసామాన్యము నుద్ధరించువారెవ్వరుందురు? సాంఘిక రాజకీయవ్యవస్థలను దిద్ది మతవిషయములందు జనసామాన్యమునకుఁ గావలసిన సాహాయ్యమును జేసినగాని, నీకుఁ బరమేశ్వరుఁ డొసంగినశక్తిని సైశ్వర్యము నకును దగిన సార్థక్యము రాఁజాలదు. ప్రకృతయుద్ధమున నీవే గెలుపొందెదవు గావున, శత్రువులను సంపూర్ణముగా రూపుమాపి దేశసంక్షోభమును శాశ్వతముగా నిర్మూలించుటకుఁ దగిన యేర్పాటుల నొనరించి యాగ్రాకుఁ బొమ్ము. విచ్ఛిన్నమై, ఐక్యము చెడి కలహముల పాలమైన యిస్లాముమతము నుద్ధరింపుము. అజ్ఞానకూపములోఁ బడి కొట్టుకొనుచు, ప్రపంచవైశాల్యమును బరమేశ్వరుని సాధుభావమును గుఱుతెఱుంగక మహమ్మదువారి సందేశమును మఱచి జను లందఱు అల్లాయాజ్ఞను విస్మృతిఁజెంది మత్తులై యున్నారు. మతాభ్యున్నతి లేని రాజ్యమునకు నిజమైన యభివృద్ధి యుండదు గావున వెంటనే మతసంస్కారమునకు గడంగుము. పరమేశ్వరుఁడు నీకొసంగిన బుద్ధిబలమును సద్వినియోగ మొనరించి నాఁడు మహమ్మదు ప్రజలకు దెల్పినసత్యమును మరల నుదాహరించి నాదిని న్యాయమార్గమునకు ద్రిప్పుము." ఈపలుకులు మనమునఁ దోఁచినవెంటనే ముకుళితకరకమలుండై, నిమీలితలోచనుఁడై యొక్కనిమిష మూరకుండి యూ

చక్రవర్తి, "తగనభారము సేవకుని నెత్తిపై మోపఁబడెను. ఎట్టి కార్యభారమును దింపుకొనుట! నాకువోసినవాఁడు నిరువోయనుండునా! భారము మోపినవాఁడు దానిని దించుకొనుమార్గమును జూపింప కుండునా?" అని యనుకొని, తిరిగి గుఱ్ఱము నెక్కి యజ్మీరున కేఁగి యక్కడనుండి సాయంకాలమున బయల్వెడలి పోవుచున్న సైన్యమును పాలీయను స్థలమునఁ గలిసికొనెను. ప్రప్రథమమున నెంతయో కష్టపడి యోడించిన వైరులు మరలఁ దలయెత్తి పనిగల్పించి శ్రమఁ పడఁజేసి రను నాగ్రహముచేతను వెంటనే శత్రువులను సేనలను గూర్చుకొనకుండ నిర్మూల మొనరింపవలె నను నాత్రముచేతను, దమనాథుఁ డగు పాదుషాకు గల యుత్సాహముచేతను వారంద ఱుకాలయెక్కిగాఁ బ్రయాణ మొనరించి యచిరకాలములోనే పట్టన్ నగరమును జేరి యక్కడి నగరాధికారి చేర్చియుంచిన సైన్యమును గలిసికొనిరి. శత్రువులహమ్మదాబాదుపట్టణప్రాంతములయందున్నా రని తెలియఁగానే మొగలుసేన యంతయును నతిత్వరితగతిని బ్రయాణ మొనరించి యర్ధరాత్రి యగుసరికి వైరులసేనను సమీపించెను. మీర్జాలబలములు సబరమతీనది యావలిగట్టున నొడెటుంగక కావలివాండ్రతోఁ గూడ సురాపానమత్తులై పడియుండుటచే నత్యంత సమీపమున నున్న పాదుషానుగాని బలములనుగాని గుర్తెఱుంగఁ జాలకుండిరి. అక్బరుసార్వభౌము డచ్చటిస్థితిని బరికించి తనసేనా వారమునంతను గూడుచుండఁజేసి యిప్పుడే శత్రువుల మార్కొనుటా! లేక యుదయమువఱకు గూరకుండుటయా" యను నంశమును జర్చించుట కిట్లు వారితోఁ బలికెను.

"శత్రువులు మనకంటె నధికసంఖ్యగలవా రయ్యును త్రాగి పడియున్నారు. వెంటనె వారితో యుద్ధ మొనరించి సంహరించుటయా లేక రేపటి యుదయమువఱకును వేచియుండి ధర్మయుద్ధ

మొనరించి వారిని సంహారించుటయూ!" ప్రభువు పలికిన వాక్యములు చింతనసేయుచు దండనాథు లందఱును యోచనసేయుచు నూరకుండఁగా, నూతనోద్యోగముచేఁ గొంచెము నూతనదృష్టియు నాలోచనాపద్ధతియు గల రక్షాంశు లేచి "ఇప్పుడే మనము యుద్ధమొనర్చి శత్రువులను జంపవలెను. మన సైనికు లలసియున్నారు. రేపటివఱ కూరకుండినయెడల వారు మనతో దలపడి యపజయము గలిగించి నను గలిగింపవచ్చును. మనమిప్పుడు యుద్ధమునకు గడంగినచో జయము నిరాఘాటముగా సిద్ధించును. గావున చేతికిఁ జిక్కినశత్రువును విడువరాదు. చేతివానిని విడిచి కాలివానికిఁ బోయిన ట్లిప్పు డూరకుండి రేపటియుదయము యుద్ధ మొనరించుట నీతిగాదు." అని పలికెను. వానిపలుకులను సభనున్న దండనాథు లెల్లరును నిశ్శబ్దముగా విని యానాటినుండి నాథులను చక్రవర్తివైపు మరలించి యాతఁ డేమిపలుకునో యని వేచియుండిరి. అంత నక్కీరు "నీవు చెప్పినది స్వలాభానుకారమే యనుట నిస్సంశయమైనను, పాపము, నిద్రావస్థలో నున్నవారిని జంపుట యెట్లు? నిద్ర నున్నవానిని లేపుటయే దోసముగదా! చంపిన నేమిలాభము? ఇంతకును నది యెట్టి పౌరుషము? శత్రువు లింకను బయలుదేఱుటయే లేదని నమ్మి సుషుప్తిఁ జెందినవారిని దొంగపాటుగాఁ బోయి సంహరించినయెడలఁ జరిత్రకారు లెట్లు మనలను జిత్రింతురు? దాన నెట్టి యపయశము గలుగునో యోచింపవలయును. మనలనుగూర్చి భావిపురుషు లేమని భావింతురు? మనకు హేయాహేయములతో నేమి పని, విజయమునే సంపాదింపఁగలవార మని మొగలు సైనికుల యాశయమైనయెడ నేనును మీలోనివాఁడనే. లేదేని శత్రువుచేతికి గత్తినిచ్చి నెఱయ గంటిమి నెఱయ, హాహాకారిగాఁ బోరి, జయలక్ష్మిని వరియింతు మందురా యటులనే కానిండు." అను వాక్యములచే నందఱును

నుద్ఘోషితుల గావించెను. ఆ యుద్ఘోషణముచేఁ బ్రతియోధుని హృదయమునను నుద్వేగ మందె, రక్తము సంచలించెను. తనువులు పి... రోషముచే బులకాంకితములై "మేము పగతో యుద్ధముచేసి జయలక్ష్మిని సంపాదించెద"మని యొక్కపెట్టునఁ బలికిరి. ఇట్లుద్రేకముఁ జెందిన వీరులలోనున్న చందనదాసు నెమ్మదిగా లేచి చక్రవర్తికి నతియొనర్చి "మహాప్రభూ! ఏలినవారియనుజ్ఞ యైనచో నొక మాట మనవిచేసికొందు"నని యడిగి, వారి యానతిఁగైకొని యిట్లు పలికెను. "దేవరవారు వచియించిన దంతయు సత్యము. వీరాగ్రేసరులకు పుత్రులఁ బుట్టిన మహమ్మదీయసోదరులును, శ్రీరామచంద్రధర్మరాజాదుల రక్తములు నాళములలోఁ బ్రవహించు క్షత్రియ వీరులును, పరశురామవీర్యమునఁ బ్రభవించిన బ్రాహ్మణులును, దమక్రింద పనిచేయు నితరసైనికులును నిద్రావస్థలో నున్న శత్రువులను జంపి యపకీర్తిపాలుగా నున్నవారు గారు! అయినను జేపటి యుదయమువఱకును వేచియుండి యిప్పుడే యసంఖ్యాకులుగా నున్న సైనికులతో మఱికొందఱిని గలియ నిచ్చుట కవకాశ మిచ్చి యోటమి కెక్కు సందర్భము గల్పించుట పనితనముగాదు. చావునకు వెఱచి నేనిట్లుపలుకుట లేదు గాని శ్రీ యక్బరుచక్రవర్తి సైన్యములు యుద్ధమొనరింప నోటమి వాటిల్లెనను మాట చెవికి పోటువలె వినఁబడుట సహింపఁజాలను. ఎట్లైనను ఇప్పుడే యుద్ధ మొనరించి వారి నోడింపవలెను. గావున మన ఢక్కాశబ్దములచే వారి నెల్లరను బ్రబోధించి యాయుధములఁ దాల్చుటకుఁ దగిన తెలివినిచ్చి యుద్ధమునకుఁ గడంగుటలెస్స యని నాయభిప్రాయమును దయతో మనవిచేసికొనుచున్నాను." చందనదాసుయొక్క సమయోచితబుద్ధికి శౌర్యమునకును బాదుషా యెంతయు మెచ్చుకొని యట్లేచేయవలసినదని యాజ్ఞాపింపగా ఢక్కానౌబతులు బ్రహ్మాండములు బ్రద్దలగునట్లు చేయు

చప్పళ్ళనువిని నదియావలియొడ్డు వారందఱును లేచిరి. తోడనే వారిలో నొకవిధమగు కలవర ముత్పత్తిల్లెను. కొందఱు పాదుషా సైన్యములు వచ్చిన వనియు మఱికొందఱు రా లేదనియును, వాదములు సల్పిరి. కాని యాయుధములను దీసికొనువారును, గుఱ్ఱముల నాయితముచేసి వానిపై నెక్కువారును యుద్ధమునకు సిద్ధముగా బారులు దీరి నిలుచువారును నై యొక్కనిముష మల్లకల్లోలముగా నుండెను కొంతసేపునకందఱును లేచి సిద్ధపడినతరువాతఁగూడ వారికి సంశయము తగ్గ లేదు. 'తొమ్మిది దినములకు ముందు మేము పాదుషా నాగ్రాపట్టణమునందు గాంచితిమి. ఇంతత్వరలో చక్రవర్తి యింత దూరము ప్రయాణ మొనరించి రాఁగలఁడనుమాట యసత్యము. వారు శత్రుసైనికులుగా రనుటయే నిజము.' ఆమాటలు విని యింక కొందఱు, 'చక్రవర్తిసైన్యమున నేనుఁగులుండియే తీరవలయును. అవి లేకుండుటయే యిది చక్రవర్తిసైన్యము గా దనుటకుఁ దగిన ఋజువు. వారు దప్పక మనమిత్రులే యగుదురు' అని పలికిరి. ఇట్లు సంశయాకులతమనస్కులై యున్నవారికి యథార్థదృష్టి గలుగఁజేయుటకు రెండవ ప్రక్కనుండి యరుదెంచిన తుపాకిగుండ్లవర్షము సహాయభూత మయ్యెను. 'ఆహాహా! వీరత్వ మనిన వారిదేగదా వీరత్వము! వీరులన్నను వారలే వీరులు! నాగరకతాలవాలముల మనియు, ధర్మపథానువర్తుల మనియు, వీరుల మనియు బడాయికొట్టుకొనుచుండు నిరువదియశతాబ్దమందలి వీరమహాపురుషు లెట్లు యుద్ధ మొనరించియున్నారో గమనింపుడు. వాయువిమానములపై నుండియు, నేలలోని సొరంగములనుండియు, జలములలో దాఁగికొనియు యుద్ధమొనరించుటయే గాక పరమేశ్వరుఁడే యాధార మని నమ్మి విశాలసముద్రలపై విదేశములసదుపాయములకొఱకుఁ బోవుచుండు వర్తకనావలనుగూడ నీటిలో దాఁగియుండి టార్పిడోలతోఁ

గొట్టియున్నారు! ఆనాటి మొగల్ సేనానాయకులకు వచ్చినసంద ర్భమే యిప్పటియుద్ధములో వచ్చినయెడల నేనిపవాయువునో పంపి వారందఱిని నిర్మూల మొనరింతురు గదా!'

సేనానాయకుని యాజ్ఞప్రకారము శబరమతీనదిని దాఁటి యావలియొడ్డునకుఁ బోయి, బలమంతయును మీర్జాలతోఁ దలపడెను. ముందుగా జరిగిన ప్రబోధనలచే నుబ్బియున్న మొగలులలో నొక్కొక్కఁడు పదిమందిసైనికులతో యుద్ధముచేయఁ బోడగెను. సంగ్రామము మహా దారుణ మయ్యెను. ఎక్కడ యుద్ధము గొప్పగా జరుగుచున్నదో, యెక్కడ శత్రువులు గుంపులుగాఁ బోడిరో యక్కడ చందనదాసురహీము లుగ్రరణము సల్పుచు ప్రలయకాలరుద్రులవలె విజృంభించుచుండిరి. ఇంతలో వెనుకప్రక్కనుండి మొగలులలో నింకొకభాగము వచ్చి శత్రువుల నెదురుకొనఁగా రెండుప్రక్కలను వచ్చు యుద్ధపు వేఁడిమికిఁ దాళఁజాలక, యెందఱో నిహతులు కాఁగా మిగిలినవారు నాలుగుదిక్కులకును, జెట్టున కొక్కపిట్టవలె, నిచ్చవచ్చినట్లు పాఱిపోయిరి. 'మొదటియుద్ధమందు మీర్జాను బట్టుకొని యప్పఁజెప్పకపోతి గదా!' యని విచారించుచున్న చందనదాసుఁడీ యుద్ధమందు రిపువాధునే వెంటాడించుచుండెను. పాఱిపోవుచున్న సైనికులను గాంచి తనకు మరల నోటమి సంభవించె నని యెఱింగి దాఁటిపోవు ప్రయత్నమున నున్న మీర్జాను వెంబడించి చందనదా సొంటిగా నతనితోఁ దలపడెను. ఆ యుద్ధమున గుఱ్ఱము కాలు విఱుగఁగా నాతఁడు క్రిందికిదిగుటచే చందనదాసును క్రిందికిదిగి రణమొనరించి ఆతనిశరీరమున నొకగాయము చేసెను. ఇఁక లాభము లే దని గాయముతోఁ బరుగెత్తుచున్న వానిని వెంట నంటి చందనదాసు పట్టుకొని నేలకుఁ బడఁద్రోసెను. దాని కాతఁడు మూర్ఛఁజెందెను. విజయమునందిన చందనదాసు ననుచరులు గొంద ఱాసమయమున నచ్చ

టికి వచ్చిపడియున్న మీర్జాను బట్టుకొని పాదుషాకడకుఁ గొనివచ్చిరి. ఇట్లు సంపూర్ణవిజయాభిరాములై మొగలుసైనికు లానందసముద్రమున నోలలాడుచుండ నొక్కఁడుగూడ శత్రుసైనికుఁ డుండకుండఁ బాఱిరి.

ఒక్కగంటమాత్రము సేనానాయకులు విశ్రాంతి దీసికొనిన తరువాత నింకొకదిక్కునుండి సైన్యము లరుదెంచు చప్పుడు లుప్పతిల్లెను. అదిగాంచి శత్రువులు వచ్చుచున్నా రని సైన్యము నాయితముచేసికొని సేనాధిపతి కూరుచుండెను. ఇంతలో నాదిక్కున నుండి యైదువేల సైన్యము లరుదేరఁగా వారితో మొగలాయి బలములు డీకొని యుద్ధముచేసిరి. రణమందు సుమారు రెండువేలు పగవారి మనుష్యులు హతులైరి. ఈసారియు బాదుషాయే జయమందెను. ఇప్పుడు యుద్ధముచేసిన మీర్జాకు గుండుదెబ్బ తగిలి మృతినొందెను. గుజరాతులో నున్న శత్రువు లెల్లరును సమూలముగాఁ జంపఁబడుటచే నచ్చట శాశ్వతమగు శాంతి నిలుచుటకు తావు గలిగెను. తరువాత ముఖ్యపట్టణ మగు నహమ్మదాబాదున కేఁగి యైదుదినము లుండి దేశమును పరగణాలుగా విభజించి వేఱుచేయ ప్రభువుల నచ్చట నియమించి మంచిపనిచేసినవా రందఱకును బహుమానము లిచ్చి బాదుషా రాజధానికి మరలెను. ఈయుద్ధమున చందనదాసు రహీము లొనరించిన సేవకు మెచ్చి వేయి వేయి దళముల కధికారులుగా చక్రవర్తి వారిని నియమించెను.

ఇంటికి మరలి యక్బరచ్చటినుండి రాజపుత్రస్థానములోనిసిరోహి మీఁదుగా వెడలి యజ్మీరులో నున్న గోరీకడకుఁ బోయి యక్కడఁ దనకుఁ గల్గు విజయమునకుఁ గృతజ్ఞతాపూర్వక వందనములు సల్పి యిట్లు ప్రార్థించెను "ఓమహాపురుషశ్రేష్ఠా. తమరు నాకొసంగిన యాజ్ఞను బాలించుటకై సామ్రాజ్యస్థాపన మొనరించితిని. ఇఁకఁ దగు సంస్కారణంబుల నన్నింటిఁ ఫలవంతముచేసి తప్పక నెలకొల్పఁగలవాఁడను

దయామయుం డగు పరమేశ్వరుం డొసంగిన శాహుబలముచే నార్జించిన యీసామ్రాజ్యమునకు శాంతి నొసంగి, ధర్మసంస్థాపనకుఁ గడంగుట మదీయాశయము. దమయాజ్ఞానుసారము మతసంస్కారణంబులనుగూడ నొనరించువాఁడను.'' తరువాత నజ్మీరునుండి వేగముగాఁ బ్రయాణముచేసి జయపురమునకుఁ బదునాలుగుమైళ్ళదూరములో విడిసెను. అక్కడఁ దన యాస్థానమందలి ముఖ్యోద్యోగి యగు రాజాతోడర్ మాలుతో గుజరాతుదేశపురాబడిని గుఱించి తర్కించి యక్కడనుండి సిక్రీపట్టణమునకుఁ బోయెను.

రాజాతోడర్ మాలు అనువాతఁడు కాయస్థజాతికిఁ జేరినహిందువు. తరువాత నక్బరుసంస్థానమున ముఖ్యమంత్రి యుద్యోగమును బడిసినవాఁడు. ఆకాలమున నాయనయధికారముక్రింద ''ఆదాయవ్యయనియమనము, నాణెములు, భూములయొక్కపన్నులు'' నుండెడివి. ప్రస్తుతము హిందూదేశమున నున్న జమాబందియు సర్వేయు నీతఁడు స్థాపించినసంస్థలేయై యున్నవి. ఈ మహానుభావుఁ డక్బరుచే నాజ్ఞాపింపఁబడి గుజరాతునందలి సిస్తులను సంస్కరించెను. ప్రప్రథమమున భూములను గొలిచి సరిహద్దుల నిర్ణయించి వానియాకారములను బటములపై వ్రాయించి సర్కారులో నిలువఁజేసి యుంచెను. భూమి నంతయు మూఁడుతరగతులుగా భావించి యోగ్యతనుబట్టి పన్నులను నేర్పించెను. పోయిన తొమ్మిదిసంవత్సరములపంటను లెక్కించి యారాబడిలో మూఁడవవంతును పన్నుగా విధించెను. ఇప్పటి పన్నులకంటె నప్పటిపన్ను కొంచెము హెచ్చుగా నున్ననునీకాలమునందున్నన్నిపన్ను లప్పుడు లేవు. నేలపన్నుతప్పఁ దక్కినపన్ను లేమియు నక్కాలమున నుండలేదు. పన్నులు వసూలుచేయువారు రైతుల దగ్గఱనుండి పుచ్చుకొనులంచము లాఁపివేయఁబడుటయే గాక పన్నుఁ జెల్లించునంతకాలమును రైతును భూమినుండి లేవఁగొట్టుట కెవరికిని

కూడ నధికారము లేకుండ నాతఁ డొనరించెను. ధనములేని బీదరైతులకు సర్కారుచే ధనమును బదులిప్పించు భూస్వాములను సాగొనరించుటకుఁ దగినయేర్పాటులను జేసి సాగులేక బీడుపడియున్న నేల నెంతయో సాగునకుఁ దెచ్చెను.

## పదునేడవ ప్రకరణము

### ఫతేపూర్ సిక్రీ

ప్రపంచమునకున్న ప్రతివస్తువునకు నేదో నియమబద్ధమైన మహిమయే మూలముగాఁ గనుపట్టుచున్నది, సృష్టికర్త యొక్క విలాసములను విశ్వమున దీక్షించి వివిధములగుభావనలను గల్పనచేసికొని మానవుఁడు దనకార్యములను నియమించుచుండును. అట్టిగాంభీర్యమును, దదనుగుణమగు మనశ్చాంచల్యమును, కార్యనిశ్చయమును, అల్పునియందు గలిగినప్పు డల్పకార్యములును, అధికునియందు ప్రవృత్తి నప్పు డధికకార్యములును గలుగుచుండును. ఆకాశమునం దొక మెఱుపు మెఱవఁగా నామెఱుపునందు పరమేశ్వరుఁ డున్నాఁడని యెంచి తాండవమాడి తమజన్మము నంతయు మతమునకై ధారవోసి జనుల కద్భుతములైన స్మృతులఁ దెలిపిన మహానుభావులు గలరు. వృక్షము నుండి యొకపండు పడుచుండఁగాఁ గాంచి యద్భుతమైన గణితశాస్త్ర పద్ధతులను గనిపెట్టిన ధీబలవిరాజితు లున్నారు. సాయంకాలవాతపోతములచే జలములందుఁ జలించు వెల్లిగడ్డిని గాంచి, యాయాడుచలనమునందు సృష్టి తాండవ మాడుచున్న దని తాండవమునుజేసి వారితో నైక్యముఁ జెంది తమజీవనము వచ్చోటఁ గడపిన పుణ్యపురుషులును గలరు. గొప్పమఱ్ఱిచెట్టునకుండు బీజమునవలె నే మహోన్నతకార్యమునకైన నెప్పుడును బ్రథమకారణ మత్యల్పముగా నేయున్నట్లు గనుపట్టుచున్నది.

పట్టణమునందు [illegible] మనస్సు నకుఁ బ్రబోధమును గ[illegible] చెప్పెటి యుండునట్లు గన్పడుచున్నది. హిందూదేశ [illegible] త్రి సామ్రాజ్య మను పేరు గల్గిన విజయనగరపట్టణ [illegible] డనయూహారమును నిలువఁబెట్టుకొనినది. ఒకనాఁడు [illegible] పురుషసింహుఁడు మృగయావిహారార్థము [illegible] నదీతీరమునకుఁ బోఁగా నచ్చట నొకకుందేలు వేఁటకుక్కతోఁ బోరాడెనఁట. అస్థలమున నొకమాహాత్మ్యము గల దనియు నక్కడ నొకపట్టణము గట్టిన నది యవిచ్ఛిన్నముగా వాసికెక్కు ననియును భావించి యాపనికిఁ బూనుకొనెను. “రాజులు దలఁచిన రాళ్ళకుఁ గొదువయా!” యనునట్లు దత్క్షణమే యొకపట్టణ మచటనే నిర్మింపఁబడెను. పాశ్చాత్యప్రపంచమున కంతకును రాణులై మహావైభవవిరాజితలై యనేకశతసంఖ్య గలవత్సరంబు లఖండసామ్రాజ్యవైభవోపేతలై సరోము వెనీసుపట్టణములును నట్టికారణములచేతనే గట్టబడినవి. అనేకసహస్రసంఖ్యాకు లగుజనులకును మహారాజులకును వాసమై వారిహావభావసంతోషవిచారముల కాలవాలమైయుండిన యట్టిమహాపట్టణములయొక్క నిర్మాణమునకెట్టి యల్పము లగు కారణము లున్నవోగదా! అక్బరునకు మహానందదాయకమగు ఫతేపూర్ సిక్రీ యను పట్టణమునుగూడ నట్టియల్పకారణముననే గట్టబడినది.

అక్బరు రాజ్యమునకు వచ్చినతరువాతఁ బిల్లలు లేరని మనోవ్యాధి గలిగెను. కొంచెముకాలములోపరమేశ్వరుని యనుగ్రహమున నాతనికిఁ గవలపిల్లలు గలిగిరి గాని యల్పకాలమాత్రము వారాయున ముందు గులాబిపుష్పములవలె బెరిఁగి గతులైరి. ఆకారణమువల్ల బిల్లలకొఱకు మనస్సునఁ గలయాత్రము మఱింత హెచ్చుగాగా ఫతేపురలకడకును వారలగోరిలకడకును నాతఁడు పోవుచు వచ్చుచుండెను

ఆగ్రాపట్టణమునకు సుమా రిరువదియైదుమైళ్ళదూరమున సిక్రీ యను నొకచిన్నపల్లెటూరునందు సలేము చిస్టీ యను నొకఫకీరుండెను. ఆతనికీర్తి హిందూస్థానమునం దంతటను వ్యాపించి తుదకక్బరుచెవి కెక్కెను. ఒకనాఁ డాతఁ డాఫకీరును జూచు నిచ్ఛతోఁ బోయి, యాతఁడిచ్చినయేదో యొకనిమిత్తమాత్రమైన యల్పవస్తువును స్వీకరించి యింటికి వచ్చినకొంచెముకాలమునకే తనభార్య గర్భవతి యయ్యెను. ఆసుదతిగర్భమందలి శిశువు పురుషశిశువు గావలయునని యాతఁడు దేవుని బ్రార్థించుచుఁ దనయిల్లాలు నాఫకీరుకడ నునిచెను. సకాలమున నాయువతి ప్రసవించి యొకమగబిడ్డను గనఁగా నక్బరున కాఫకీరునందు గలగౌరవమమితమయ్యెను. పాదుషాను బుట్టలో వేసిన యాయశేష శేముషీవిరాజితున కింక సర్వోద్యోగులును దాసానుదాసులేగదా! తాను వచ్చినప్పు డెల్ల నచ్చో నుండుటకుఁ దగిన యొక హర్మ్యమును చక్రవర్తి సిక్రీలో నిర్మించెను. తరువాత షేక్ సలీము చిస్టీ యనునా ఫకీరును నొక పెద్దమసీదును, నొక యాశ్రమమును నిర్మించుట మొదలిడెను. "యథా రాజా తథా ప్రజా" యనునట్టులు దక్కిన ముఖ్యోద్యోగు లందఱును నాయూరియందచ్చట రమ్యహర్మ్యముల నిర్మించుకొనిరి, వారిక్రిందియుద్యోగస్థులుగూడఁ దమనిత్యసేవకొఱకు వారి వెనువెంటఁబడి తమతమయిరవులను గట్టుకొనిరి. క్రమముగా నయ్యూరియుఁ బెద్దపట్టణమై జనుల నాకర్షింపఁజొచ్చెను. ఆపట్టణమునందు బాదుషా కంతకంతకుఁ బ్రీతి హెచ్చుటచే సాధారణముగా నాతఁ డచ్చటనే నివసించుటకుఁ బ్రారంభించెను. తరువాత నాగ్రాపట్టణమున కెంతప్రాముఖ్యముండెనో సిక్రీకిని నంతప్రాముఖ్యము లభించెను.

గుజరాతుయుద్ధమును గెలిచినతరువాత నక్బరు బాదుషా యాపట్టణమునకు ఫతేపూర్ అనునామమునుకూడఁ జేర్చెను. 'ఫతేపూర్'

యందలి సారమును మనస్సున కెక్కించునప్పటికి వారలు విగతశరీరు లయ్యును మనమునందు తాండవము సల్పుదురు. శరీరములు మనకు దృగ్గోచరము కాకున్నను వారిజీవితమందలి సర్వసారమును, భావములును, నాశయములును, సుఖదుఃఖములును మనకు విస్పష్టములగును. వివిధకాలములనుండి మనకు వచ్చినగ్రంథములఁ బఠించినయెడల వారలతో సాంగత్య మొనరించినంత లాభము మనకుఁ గలుగును. కావున నాగ్రంథము లన్నియుఁ దమతోఁ గలసి పఠించుటకంటె నుత్తమకార్యము మాకేమ్యది గలదు? మాపుస్తకశాలయందు సుమారు ఇరువదినాలుగువేల గ్రంథములు గలవు. అందు లభింపని పుస్తకము లెక్కడనుండియైనఁ దెప్పింపవచ్చును.

అబు — మాగ్రంథభాండారమునఁ బదివేలగ్రంథము లున్నవి. అవియు నేలినవారిపరమునకు నుపయోగింతును. తాము దయానత్తులైనచో వానిలోఁ గావలసినవానిఁ దెచ్చి యిక్కడ నేను హాజరగుదును.

అక్బ — మా దర్బారులో మీ రెప్పుడు నుండవలసినది. తక్కిన పండితులు మొదలగువారికివలెనే మిమ్మును సన్మానింతును.

ఇట్లు జరిగిన సంభాషణము ముగిసినతరువాత నా నాఁటికి సభ చాలించి భోజనమునకు లేచి యరుగుటచే లేవఁగ. అదిమొదలు అబుల్ ఫాజలునకు [illegible] దినదినము ప్రబలఁజొచ్చెను. ఇతఁడు లేకుండ నక్బరు రాజకీయవిషయములందుఁ గాని గూఢార్థశాస్త్రసందర్భముల యందుగాని మెలఁగువాఁడుగాఁడు.

---

## పదునెనిమిదవ ప్రకరణము

### బంధువులు

చందనదాసునకుఁ దల్లిదండ్రులు చిన్నప్పుడే గతించిరి. ఇప్పు డాతని కొక్కయన్నమాత్రము మిగిలియున్నాఁడు. ఆతఁ డాగ్రాకు

సుమారు నలువదియైదేండ్లనుండియు నున్న రామపుర మను గ్రామ మునఁ గాపురము చేయుచు నక్కడి ముఖ్యాధికారిగా నుండెను. పుట్టినయూరు విడిచి చాలకాల మగుటచేఁ జందనదాసు వదినెను బిల్లలను జూడవలె నని కోర్కె గల్గి, చక్రవర్తికడ ననుజ్ఞఁగైకొని మిత్రులగు ఫైజీఫాజలులతోఁ జెప్పి యొకనాటి యుదయమునఁ దెల్ల వాఱకమున్నె తనయశ్వముపై నెక్కి స్వగ్రామమగు రామపురము నకు బయలుదేఱెను. ఆగ్రాపట్టణము విడిచి కొంతదూర మేఁగుసరికి బాలభానుండు జగన్నాటకం బాడించుటకు రక్తవర్ణమును దాల్చి, యాకాశరంగమున సూత్రధారునిపాత్రను ధరించి వెలువడుచుండెను ఉదయకాలమునందలి ప్రభాతవాయువులచేఁ జలించుచు వరిపైరులెం తయుఁ జందనదాసు హృదయము నాకర్షణసేయఁ గలిగి యుండెను. దారిలోఁ జల్లనీటితో నిండిన చిన్నచిన్న తటాకములును విడియున్న తామరలును, ఆతామరలలోఁ బడిముత్తెములవలె నున్న మంచు బొట్లును చూపఱమనస్సుల కానందము గొల్పుచుండెను. కొంతదూ రము పోయినతరువాత నొకనిర్మల తటాకమును, దత్తటమున నున్న యొక విశాలవటవృక్షమును గాన్పింపఁ జందనదాసుఁ డచ్చట దిగి, గుఱ్ఱము నా మఱ్ఱిచెట్టునకుఁ గట్టి దంతధావన మొనరించుకొనుచుఁ గూరుచుండెను. చుట్టునున్న విశాలములయిన పచ్చనిబయళ్ళును, వరిపైరులును బ్రతిదినమును గృత్రిమసౌందర్యమును జూచుట కల వాటుపడిన యాతని నయనముల కెంతయు నానందదాయకముగ నుండెను. పుట్టి నప్పటినుండియు సహజమాధురి కాలవాలమైన ప్ర కృతి సౌందర్యమునందే పెరిగినవాఁ డగుటచే, మొదట నాగ్రాపట్టణ ములోని సౌధములు మొదలగునవి రుచించెను గాని, క్రమంబున నందలి కృత్రిమత్వ మాతనికి బోధపడెను. తిరిగి పల్లెటూరి జనము లను, నచ్చటి పొలములను జూచినవెంటనే యాతనికిఁ బ్రాణములు

లేచివచ్చెను. చిన్నచిన్నవాయువులచే పరిసరమున నున్న ప్రకృతి యందలి చాంచల్యమానంద హేతువయ్యెను, యుద్ధమునందలి వారిహృదయచలనమును నుద్వేగమును స్మృతికిఁ దెచ్చి, రాజకీయ జీవనమునకు బల్లెటూరి పరిస్థితులకును గల భేదమును సూచించు చుండెను. మరల గుఱ్ఱము నెక్కి ప్రయాణ మొనరించుచుఁ దన గ్రామ ప్రాంతమునకుఁ జేరుసరికి తనువు పులకాంకితమయ్యెను. ఆ యూరిముందు గల పెద్దచింతచెట్టును జూచినవెంటనే చిన్నప్పుడచ్చటఁ దాను గోతికొమ్మచ్చులనాడుకొనుటయు, తోడిబాలురతోఁ గూడి కుస్తీలు పట్టుటయు, రిక్తుఁడై పట్టణములో నుద్యోగమును సంపాదించుటకొఱకు బయలుదేఱి వచ్చిన ప్పుడు దనయన్నయ్య యాచెట్టుక్రింద తన్ను బీడుకొల్పుటయు, నొక్కసారి యాతనికి స్ఫురించి హృదయమును సంపూర్ణముగా నింపఁగా కంఠమువఱకు భావములు పొంగి, స్తంభింపఁజేసెను. ఒకనాఁడు దన యన్న నాతఁడు వచ్చి పిలిచికొనిపోవునప్పుడు దనకుండిన చిన్నతన మును, ఇప్పుడు తనకుఁ గల యోరిమియు ప్రపంచజ్ఞానమును చందన దాసున కొక్కపట్టునఁ గనుపట్టెను. తనకాలమున నెప్పుడును చిన్న పిల్లలతో నిండిన యాచెట్టునీడలో నిద్దఱు పసులఁ గాచు పిల్లకాయలు చిమ్మబిళ్ళ నాడుకొనుచుండుటతప్ప నాతని కేమియుఁ గనుపించలేదు. అంతయు నాతనిదృష్టికి మాఱినట్లే కనుపించుచుండెను. ఈతనిదుస్తు లను గుఱ్ఱమును జూచి యాపిల్లలిరువురును దిస్సపోయి నిలువఁబడఁ జందనదాసు గుఱ్ఱమును గ్రామమధ్యమునుండి తీసికొనిపోయెను.

రామపురమందు సుమారు పదిబ్రాహ్మణ గృహములుమాత్రము గలవు. ప్రతియింటికిని ముందున్న చిన్నవీధియరుఁగులపై గొందఱు మాటలాడుకొనుచుఁ గూరుచుండిరి. కొందఱు శిష్యులకు వేద పాఠములఁ జెప్పుకొనుచు విస్తళ్ళు గుట్టుకొనుచుండిరి. మఱికొందఱు

శాస్త్రవాదములను గావ్యములను జెప్పుకొనుచు నరుఁగులపై నుప విష్టులైరి. వారు నన్నుఁ బలుకరింతురో, లేకో! పలుకరించినయెడల వారి కేమి సమాధానము చెప్పవలయునో యని మనస్సంతయుఁ జందనదాసునకుఁ జలించుచుండెను. నూతనపురుషుఁ డెవ్వఁడో వచ్చుచున్నాఁడని వార లందఱు నీతని నరుఁగులనుండి వంగి చూచిరి గాని యెవరును గుర్తింపఁజాలరైరి. ఎవఁడో యొక రాజకీయోద్యోగి సాయబుగారి యింటికో, గ్రామాధికారియింటికో వచ్చుచున్నాఁడని యనుకొనిరి గాని, చందనదాసుతోఁ గలసి చదువుకొనిన యొకవి ద్యార్థి మనచందనుఁడే యని యఱచి క్రిందికి దిగెను. ఆయఱుపుతో నందఱు నరుఁగులనుండి దిగి, పోవుచున్న వానితో నొక్కసారిమాట లాడిరి. 'సుఖముగా నుంటివా! నాయనా!' యని యడుగువారును 'మనచందనుఁడేనా?' యనువారును, 'మంచియుద్యోగమైనది పోనీ!' అనువారునునై యావీధిలో నున్న యాశాలగోపాల మాతనిని బలుకరించిరి. వారి కందఱకును దగునుత్తరంబుల నిచ్చుచు నాతఁడు మెల్ల మెల్లఁగా వీధికొన నున్న స్వగృహంబున కరిగెను. అన్నగారింటికడ లేకపోవుటచేతను, వదినె యింటిలో వంటఁ జేసికొనుచుండుట వలనను ఆతనిని బల్కరించువా రెవ్వరును లేకుండిరి. ఇంతలో వీరివెంట వచ్చిన పెంకిపిల్లకాయలలో నొక్కఁడు తలుపుద్రోసికొని లోపలికిఁ బోయి, పనిచేసికొనుచున్న లక్ష్మమ్మను బిలిచి యెవ్వరో యొకయుద్యోగి వచ్చినాఁ డని తెలిపెను. పెనిమిటి యింట లేకపోవుటచే నామెయే పెరటి యింటిద్వారముకడకు వచ్చి వడిపోకలు నున్న యాతనిని జూచుచు తలుపోరగాఁ జేసికొని నిలువఁబడెను. ప్రక్క నున్న తక్కినవారందఱును 'లక్ష్మీ! మఱఁది చందన్న వచ్చినాఁడు!' అని చెప్పిరి. ఈమాట వినినవెంటనే లక్ష్మి బయటికి వచ్చి 'ఏన్నాయనా! నీవేనా! ఎవరో లెక్కలు తణిఖీచేయుటకు వచ్చిన సర్కారుదొంగ

చూసుకున్నానే! ఎన్నాళ్ళకో నిన్ను గుర్తుపట్టలేకపోయినాను. కులాసాగా నున్నావా! ఎన్నాళ్ళకైందిరా నిన్ను చూసి! కళ్లు కాయలు గాచిన ట్లున్నది నాకు!' అనెను. 'అమ్మా! నేనే! కులాసాగా నున్నాను.' అని చెప్పి సైనికోద్యోగమును దెలుపుచిహ్నములతో నున్న దుస్తుల నన్నిటిని దీసి యింటిలోఁ జిలుకకొయ్యకుఁ దగిల్చెను. సిగ్గుపడుచున్న పిల్ల లిద్దరిని నాతఁడు కౌఁగిలించి చేరఁదీసెను. చందనదాసుతో వచ్చి నవా రందఱు వాలనిసి విడిచి తమయింటికి తాము పోఁగా, నాతఁడు వదినెగారితో వంటయింటిలోఁ గూర్చుండి కబుర్లు చెప్పుచుండెను.

లక్ష్మి—నాయనా! నీవు వెళ్ళినదగ్గర్నుంచీ మే మెట్లావున్నామో చెప్పడానికి వీలులేదు. నీ వున్నప్పుడు మీయన్నయ్యకు కాస్త చేదోడుగా నుండేవాడివి. ఇప్పుడు పాపము తుడుముదగ్గర్నుంచి దేవతార్చనదాకా అన్నీ మీ అన్నయ్యయే చూచుకుంటున్నారు. ఈ మధ్యను చిన్నవాడికి చాలా జబ్బుచేసి రెండురోజులు బ్రతుకతాడనే అనుకోలేదు. కాని దేవుడికృపచేత మళ్ళా బ్రతికేడు.

చందన—వదినా! అంతజబ్బుచేస్తేనాకు కబురంపలేక పోయినారా! నేను మంచివైద్యుణ్ని పిలిపించి మందిప్పిస్తునుగదా!

లక్ష్మి—నాయనా! నీవు వెళ్ళినప్పట్నుంచీ నీకబురే మాకు లేదు. పోని ఒకసారి పట్నం వచ్చి కనుక్కుందా మంటే పాదుషా యెక్కడికో యుద్ధాన్ని కెళ్లారు, ఆయనతో అంద ఉద్యోగస్థులూ వెళ్ళారు, అని వూరెనిండా బుకారు. దానికోసం నాయనా నిన్ను మేము వెదకడమే మానుకున్నాం. కానినీవు వెళ్ళినదగ్గరనుంచీ మీ యన్నయ్య నిన్ను తలవని రోజు లేదు. ''అయ్యో! పాపము! వెళ్ళిపోయినాఁడు. వాని నెవ్వరు సంరక్షించుతారు. తల్లి దండ్రి లేని పిల్లకాయను పెంచాను. ఒకనా డేదో కోపం వచ్చి కూకలేసేసరికిఆగ్రా వెళ్ళి ఉద్యోగం చూసుకుంటూ నన్నాఁడు. ఉద్యోగమే సంపాదించు

కున్నాడో యేబాధలు పడుతున్నాడో నాకెరిక దెలుపుమా" అని యెప్పుడూ మీయన్నగారు అంటూనే యుంటారు. ఈ మధ్యనే యుద్ధంలో నీకు జబ్బుచేసిందని, యింకా యేవో మాటలు చెప్ప డానికి నోరురాదు, వ్రాసింది చాలు. పోకన్న తల్లి నీకేదో వచ్చాడని తెలిసి యింకా యెప్పుడో వొకపర్యాయం వస్తాడని యెదురు చూస్తున్నారు. నాయనా! నీకే ముద్యోగం! ఎంతజీతం! అన్నీ కబుర్లు చెప్పుదూ!

చందన—అమ్మా! నేను పాదుషా సైన్యములో గొప్ప యుద్యోగిగా నున్నాను. నెలకు మూడువందలరూపాయలు జీతమిస్తారు. నాకు పెద్దయధికారము, ఎంతోమంది గుఱ్ఱపుభటులు. నౌకర్లు, చాకర్లు, నాకింద వుంటారు. ఇప్పుడు ఉద్యోగవైభవంతో రావడం బాగుండదని యీలాగ గుఱ్ఱముమీద బయలుదేరివచ్చాను.

అవ్వ—నాయనా! సైన్యములో యెందుకు చేరావోయ్. ఒక్కగుండు దెబ్బ తగిలితే ప్రాణంపోతుంది. ఏదో గుమాస్తాపనైనా చూచుకుంటే యెంతబాగుండేది. చిన్నప్పటినుంచీ నీకు మొండితనం మావుంది. నాయనా! అవతలినీలకంఠాయబుగారు పిల్లలు నిన్నెప్పుడు తలుస్తూనే యుంటారుసుమా! అస్తమానం వాళ్ళయింట్లోనే వుండి పప్పిగడియలు ముక్కలు తిప్పుతూ వాళ్ళపిల్లలతో తిరుగుతూ వుండేవాడివి. చదువు మానేసి తిరుగుతున్నావని మీయన్నయ్య నిన్ను తిట్టేవారు. అవునుగాని వాళ్ళ పెద్దపిల్లకాయ నీస్నేహితుడు చచ్చిపోయినాడు సుమా!

చందన—అయ్యో! నాస్నేహితుడు రుస్తుంఖాన్ పోయినాడా! పాపము! సర్వైశ్వర్యములు గలిగిన యతడు తల్లిదండ్రులను దుఃఖసముద్రములో ముంచిపోయినాడు! నాకిట్టి యుద్యోగము వచ్చినదని యెంతయు సంతసించెడివాడు. నాప్రస్తుతస్థితి కాతడే

కారకుఁడు. అతని సహవాసముచేతనే యిప్పు డీస్థితికి నేను వచ్చుట తేఁటంటే నే నీశ్వరత్తు, ఈసాము నేర్చుకోడానికి వీలుండదుగదా!

అని యేమేమియో చందనదాసుని స్నేహితులను గుఱించిన సంగతులను, ఆయూరి ప్రస్తుత స్థితియును పట్టణ వర్ణనలును, వారు చర్చించుకొనిరి.

ఇంతలోఁ గొంతసేపునకుఁ జందనదాసుని యన్న యింటి కరుదెంచి, తమ్ముని జూచి యెంతయు సంతసించెను. అన్న యనినఁ జందనదాసునకుఁ జాలగౌరవము. చందనదాసుకంటె నాతఁడు సుమారిరువదిసంవత్సరములు పెద్ద. అన్నయందును వదినెయందును నీతనికి మాతాపితలయం దుండునంతటి భక్తి. అన్న చామనచాయ గలవాఁడు. వెండ్రుకలు కొంచెము నరసినవి. ముఖము విశాలమై యోర్పును జూపుచును. స్వభావముచేఁ గూడ నాతఁడు గోప్యిష్టి గాఁడు చాల నాలస్యమైన దని చెప్పి యాతఁడు స్నాన మొనరించి దేవతార్చనను ముగించి తమ్మునితోఁ గలసి భోజనమునకుఁ గూరుచుండెను, భోజనకాలమున నాతని జీతమును, నతని యుద్యోగమునొక్క గౌరవాదులను గనుఁగొని తనకుటుంబమునం దీనాఁటి కొక్కఁడైన పుట్టెను గదా యని సంతసించెను. భోజన మొనరించి చేతులను గడికొని యాగదిలోనే తాంబూలము వేసికొనుచు నొకచాపపైఁ గూరుచుండిరి. పాదుషా మెచ్చి తనకిచ్చిన శిరోభూషణము వారిరువురనకును జందనదాసు చూపించి వదినెకొఱకుఁదాను చేయించిన బంగారువస్తువులను దీసి యొసంగెను. తనదగ్గఱమిగిల్చి దాఁచిన సొమ్ములో నొకవెయ్యిరూపాయిల నన్నగారికి కట్నునిమిత్త మిచ్చి యెంతయు సంతోషపెట్టెను. వేయిరూపాయిల నెప్పుడును చందనదాసునియన్న యొక్కసారి కలిగియుండినవాఁడు గాడు. శిస్తులు వసూలు చేయవలసివచ్చినప్పుడుమాత్రము ధన ముండెడిది గాని యాధన మాతనిది గాదు.

ఇంత సొమ్మును దాను సంపాదించు కొనినవాఁడు గాఁడు. అతని కిచ్చుస్వల్పవేతనముమీఁదనే భార్యాభర్తలును, బిల్లలును గాలక్షేప మొనరించుకొనుచుండువారు.

తరువాతఁ గొంతసేపు పన్నెండుమ్మ లిడువృఁను నిద్రించి మధ్యా హ్నము నాలుగుగంటలవేళ వదినెగారు పెట్టిన పిండివంటలను దిని యిష్టాలాపములతో గొంచెముసేపు కాలక్షేప మొనరించెను. చంద నదాసు దనమిత్రునితల్లిదండ్రులను జూచుటకుఁ బోయివత్తు నిం టికడఁ జెప్పి బయలుదేఱి వెడలెను. రుస్తుమ్‌ఖాన్ తల్లిదండ్రు లాయూ రిలో నుండువా రంతదకంటె ధనికులు. పూర్వము వా రాగ్రామము నకే గాక చుట్టుప్రక్కలనుండు మఱికొ డుమూఁడు గ్రామములకును నధికారులుగా నుండిరి కాని యిప్పు డాయధికారము వారికి లేదు. అధికారము పద్ధతిప్రకారము లేకపోయినను, పలుకుబడియు, గౌరవ మును వారి కపరిమితముగా నాగ్రామములయందు, గలదు. ధనికుల మనియు, మహమ్మదీయుల మనియు, దొంతనంపుఁగులమునకుఁ జేరి నవార మనియు విజ్ఞవీఁగక చుట్టుప్రక్కల నున్న రైతుల కెల్లరకును దక్కువవడ్డితో ధన మిచ్చి మరలఁ బంటలకైఁ బుచ్చుకొనుచుం దురు. దగ్గఱనున్న బ్రాహ్మణులకుటుంబములకును శక్తివంచన లేక సాహాయ్యము సల్పుచు వచ్చుచుండుటచేతను వారినెల్లరును నవాబు లని వ్యవహరించుచు, పాలకులవలె గౌరవింతురు. అట్టి గౌరవమున కాస్పదులైనవారి కిరువురు పుత్త్రులు. అందు, బ్రథముఁ డగు రుస్తుం ఖాన్ చందనదాసునకుఁ బరమిత్రుఁడుగా నుండి, యీతనిని విద్యా విషయికకృషినుండి శరీరవ్యాయామమునకును, గుస్తీసాములకును దిం చెను. పాపము ! గతించిన యారుస్తుంఖానుచేతనే యీతని కిట్టియా యుధచాలన సామర్థ్యము గలిగెను.

చందనదాసు వారింటి కేఁగుటతోడనే నవాబు గుర్తింపలేక యెవఁడో యొకనూతనపురుషుఁడు వచ్చియున్నాఁ డనుకొని ప్రత్యు త్థాన మొనరించి కూరుచుండు మనియెను.

చందనదా సాసంగతిని గ్రహియించి 'అయ్యా! నన్ను మీరు గుర్తుపట్టలేదు. నేను మీ నందనుడను' అనిపలికి దుఃఖముచే లోపలి నుండి వెడలు రెండుకన్నీటిబిందువుల నాయన చూడకుండ మొగము ప్రక్కకుఁ ద్రిప్పివేసెను. చందనదాసుపేరు వినినతోడనే యాతని యాకారమును దన పుత్త్రుడును స్మృతికి వచ్చుటచేత బావురని యేడ్చి యాతని నొకసారి నవాబు కౌఁగిలించుకొనెను. చందనదాసు నకుఁ గడుపులో చెయి పెట్టి కలఁచినయట్లైపోఁగా నిశ్శబ్దమైన దుఃఖముచేఁ గన్నులనుండి బొటబొట కన్నీరు గారఁజొచ్చెను. ఇంతలో నింటిలోని యాఁడువాండ్రును బైటికి వచ్చి నూతనపురుషుఁ డున్నాఁడని లోపలకుఁ దగ్గిరగాని దను చందనుఁడు వచ్చినాఁ డని యెఱిఁగి వారును గొంచెము నేపేడ్చిరి. రుస్తుంఖాన్ ఏ వ్యాధితోఁ జనిపోయెనో, యెప్పుడు చనిపోయెనో మొదలగు సమాచారమంతయుఁ జందన దాసు దెలిసికొనెను. తరువాతఁ బ్రశ్నింపగా వారందఱికిని, బాదుషానుగురించియు నాతని దినచర్యగురించియుఁ దానెట్లభ్యున్నతిని బడసినదియు మొదలగు నంశములను విశదముగాఁ జందనదాసు దెలిపెను. నేను పోయివచ్చెదను. అని కొంచెముసేపు పోయిన తరువాత చెప్పి లేచి నచ్చుటకు సిద్ధముగానుండ వారు "నాయనా! ఇంక నాలుగుదినము లుండువా! నిన్ను చూచిననెంటనే మా వాఁడు లేచివచ్చిన ట్లున్నది" అని చందనదాసు నడిగిరి. దాని కాతఁడు "లేదు. నాకు సెలవులేదు. రేపే తిరిగి పోయి యుద్యోగమునందుఁ బ్రవేశింపవలెను." అని చెప్పి కన్నీళ్ళతో నందఱికడను సెలవుగైకొని యింటికి వచ్చెను.

చందనదా సొకసారి దన యూరిచుట్టును పూర్వపరిచితప్రదేశములను జూచుకొని యొకరిద్దరిని ప్రాఁతసంగడికాండ్రను బలుకరించి యింటికి వచ్చునరికి సూర్యుఁ డపరదిశయందు మునిఁగిపోయెను. పశువు

లన్నియు నిల్లకు వచ్చి చేరెను. సూర్యుడును నాతని కాంతులును సంపూర్ణముగా నపరజలధిని మునిగినతరువాత. ప్రభువు గతియించుటచే వ్యాపించు నరాజకబాధలవలె చీకట్లు గ్రామమంతయు నలముకొనియెను. అక్కడక్కడ రాజ్యము చేయుచుం దమశక్తికి సాధ్యమైనంత వఱకును న్యాయప్రవర్తనమును నెలకొల్పుటకుఁ బ్రయత్నించు సల్పులైన రాజన్యులవలె, నక్షత్రముల కాంతిచే మార్గగాములకు గుడ్డి గుడ్డి వెలుతురు రొసఁగఁబడుచుండెను. ఇట్టిసమయము నున్న వాకిటిలో చందనదాసొక నులకమంచముపైఁ గూరుచుండి ప్రక్క నొకచీడీపై దూరముగా నున్న వదినెగారితో మాటలాడుచుండెను. చెంతనున్న వసారాలో పిల్లలప్పుడే భోజనములు చేసి నిదురించుచుండిరి.

లక్ష్మి—నాయనా! ఱేపుదయముననే పోదువా! రాకరాక వచ్చినవాఁడవు రెండుదినములైన నుండుటకు వీలులేదా! నిన్నెన్ని దినములనుండియో చూడక కళ్లు కాయలు కాచి యున్నవి.

చంద—ఇంకేమి జాకు! నేను దగ్గరనే యుందును గావున మీయిష్టము వచ్చినప్పుడు వచ్చుచు. బోవుచుండవచ్చును. ఇంతకును అన్నయ్య నక్కడకే వచ్చి నాతోఁ గాపుర ముండవలసిన దని యడిగితిని గాని యాయన పిత్రుపితామహార్జితమైన యింటిని భూమిని విడిచి కాలు కదపలే ననియెను. కాన నెప్పుడో యొకసారి తీరికఁ జేసికొని మీరిరువురును గలసి రండు.

లక్ష్మి—అవును నాయనా! మీయన్నగారన్నట్లు నాకును ఈవూరు విడిచిపోవడం యిష్టములేదు. అక్కడ పట్టణంలో యెలా వుండాలో యేమిటో పల్లెటూరిలోని వాళ్ళం పల్లెటూరిలోనే వుంటాము. అయినా నాకు పట్టణంచూడాలనేవుంది. ఎప్పుడో వొకసారితీరిక జేసికొని పిల్లలతో బయలుదేఱి రావాలి. దానిమాటకేం గాని నాయనా! యిందాకా మీయన్నయ్యగూడా అన్నారు. నీవివాహము

మూలేంజేశావు. పాతికసంవత్సరములు పైగా దాటిపోయింది వయస్సు నీకు! ఇంకా పెళ్ళిలేదు. పిల్లవాఁడవు. డబ్బు చేతిలో దండిగా వుంటుంది, పట్నంచెడ్డది. నీమర్యాద యెలాకాపాడుకొంటావో! చెడు నడతలలో బడితివా, కష్టం వస్తుంది. ఇంతకును జదువుకొన్నవాఁడవు ప్రాజ్ఞుఁడవు గావా! ఆఁడదానను నీకు జెప్పుటకు నే నెంతదానను.

చందనదాసునకుఁ బెండ్లిమాట వినఁగానే యొడలఁ బిడుగు పడినట్లయ్యెను. ఫత్మీదా విగ్రహము కన్నులయందు దాండవమాడుట కారంభించెను. ఆమె యాతని కొనరించిన పరిచర్య స్మృతికి వచ్చిన తోడనే యాతనిశరీరమునందలి ప్రతిజీవకణము నుద్వేగముచేఁ జలింప నారంభించెను. లక్ష్మమ్మమాత్రము మాటలాడుచునే యుండెను. మనస్సునందలి క్షోభ నామె కేమి తెలియఁగలదు?

'సంప్రదాయము మంచిదైన యొకపన్నెండేళ్ళపిల్ల నెక్కడైనా వెదకి తెచ్చి నీకు పెళ్లి చెయ్యాలని అన్నయ్య చూస్తున్నారు. మనలో పెద్దపిల్లలు దొరకరు గాని యిప్పు డీతురకరాజ్యంలో పాదుషాయొక్క బోధలచే గొందరు దమపిల్లలను పదిపండ్రెండేళ్ళ వరకు నుంచుతున్నారు. గాని నాయనా! పట్నంలో తురకలకుమన వాళ్ళకు సమ్మంధాలు జరుగుతున్నాయఁట. అలాంటి వన్నిచూస్తే పాదుషాకు మంచియిష్టమట గాని, నాయనా నీవుమాత్రము వాటిలో దిగకుమా. జీతంరాళ్లూ ఉద్యోగం లేకపోతే పోయిందిగాని కులం మాత్రం చెరుపుకుంటే తరవాత యేగంగలోనో దిగాలె. నీది ఆయితాగ్నికుటుంబము. మీతండ్రితాతలు గొప్పయాగాలు యజ్ఞాలుచేశారని మీయన్నయ్య చెపుతూవుంటాయు. ఇప్పటిచక్రవర్తి చాలామంచివాఁడు గాని యిలా [illegible] అందరినీ తురకల్లో కలిపెయ్యడం ధర్మంకాదు—'

అని యేమేమిమో లక్ష్మమ్మ మాటలాడుచుండెను గానియందొక్కటియు నాతనిశ్రవణకుహరములనుదాటి మనస్సువరకునుబోనే

లేదు. చందనదాసునకు మతిపోయెను. ఒడలిఱుంగుము స్మృతితప్పెను. దేహమునందు చెమ్మటబిందువులు వెడలఁజొచ్చెను. కాని చీకటిలో వానిస్థితిని లక్ష్మన్న చూడలేదు. ఒకప్రక్క నాశ—ఇంకొకప్రక్క మతసంబంధమగు నడ్డంకి—మూఁడవప్రక్క ప్రేమ—నాల్గవప్రక్క భయము మూకీభావముఁ జెంది మానసమును నలువదిమైళ్ళదూరమునకుఁ గొంపోయిన చందనదాసున కన్నరాక తిరిగి స్మృతి గల్పించెను.

అన్నయ్య లేచి పాదప్రక్షాళనము చేసికొని సంధ్యావందనము సలిపినతరువాత నందఱును భోజనమునకుఁ గూరుచుండిరి. రాత్రిచందనదాసు నిద్రవోపుటకు మంచ మెక్కెనే గాని కన్నులు మూసుకొన్నను మనస్సు మాత్రవడ దాయెను. కాని కొంతసేపైనతరువాత కలఁతనిద్దుర వచ్చి యొకకల గనెను. ఆకలయందు తనకు లీలగా జ్ఞాపకమున్న తండ్రియాకార మస్పష్టముగా కన్నులముందు నిలిచెను క్రోధముచేతను దుఃఖముచేతను నరుణితములై యున్న లోచనములతోఁ దూఁగుచు పెదవులు పడవడ వడంకుచుండెను. ఆ పెదవుల మధ్యనుండి యొక్కస్వర మీరీతిగా నుప్పతిల్లెను.

'ఔరా! నీకు మ్లేచ్ఛసంపర్క మొనరింపవలసిన యభాగ్యము పట్టినది గాఁబోలు. దానివలన నైహికసౌఖ్యములును గౌరవాధిక్యమును నీకుఁ గలుగనున్నను గూడ నది పతనమునకే కారణము. ఓరీ! చెఱకుతుద వెన్ను పుట్టిన...అనునట్లు వంశమును జెఱుపునిర్భాగ్య......' అనఁబోవువఱకు త్రుళ్ళిపడి చందనదాసు లేచి కూరుచుండెను. ముందున్న దృశ్యము సంపూర్ణముగా మాయమయ్యెను. కొంచెము శరీర మాతనికిఁ దొలుత కంత మందెను గాని తరువాత 'కల లజీర్ణముచేతను మనోవ్యాకులతచేతను వచ్చు' నని యొక పండితుఁడు పాదుషాసభలోఁ జెప్పినవాక్య మాతనికి జ్ఞప్తికి వచ్చుటచే

ధైర్యము తెచ్చుకొని గుండె పదిలపఱచుకొనెను. కాని యీదృశ్య మాతని చిత్తముపై శాశ్వతముగా నాటఁబడెను, అట్టివివాహమున కెన్నఁడు నొడఁబడ నని నిశ్చయ మొనరించుకొని యాతఁ డారాత్రి మెల్లఁగా గడపి తెల్లవాఱువేళ వదినెదగ్గఱను, అన్నయ్యకడకు అనుజ్ఞగైకొని యాత్రాపట్టణమునకుఁ బయనమైపోయెను.

---

## పందొమ్మిదవ ప్రకరణము

### ఇస్లాము

మహమ్మదీయమత మని మనము సాధారణముగాఁ బల్కుచుండు మతమునకు సరియగునామ మిస్లాము. ఈమతమును మహమ్మదు గనిపెట్టియున్నాఁ డనునభిప్రాయముచేతనో లేక పునరుద్ధారణ మొనరించినాఁడనునూహచేతనో యీపేరు దీనికి వచ్చినది. నిజముగా నీమతమును మహమ్మదు కనిపెట్టలేదు గాని యాతనికాలమందలి యభిప్రాయములనే యాతఁడు సరిగా నాలోచించి పరమేశ్వరునియనుగ్రహముచే నలుగురకును దెలుపుదుచేసెను. మహమ్మదనునాతఁ డరేబియాదేశమందలి యొకబీదకుటుంబమున జన్మించి ఖడిజా యనుధనవంతురాలగు నొకవితంతువుకడ వ్యాపారమునకుఁ గుదురుకొనెను. ఆమెయాస్తిని జాగ్రత్తగా వృద్ధిచేయుచు చక్కఁగా నాతఁడు వ్యవహరించుటచే నామె కాతనియందు మంచినమ్మకము కుదిరెను. రానురాను వీరికి పరస్పరము సేవకయజమానులకుఁ గల యనురాగమే కాక స్త్రీపురుషులకుఁ గలుగు ననురాగముసయిత ముత్పత్తిఁజెంది యభివృద్ధికాఁగా ఖడీజాను మహమ్మదు పెండ్లిచేసికొనెను. మహమ్మదు తొలినుండియు నాలోచనాపరుఁడును, పరమేశ్వ

రునిమహిమలను సర్వదా చింతించుస్వభావము గలవాఁడును నగుటచే నాయలవాటీయనయం దభివృద్ధిచెంది తుదకు మనస్సంతయు నాధ్యాత్మికవిషయికములగు చింతలతో నిండిపోయెను. జనులతో నిండి శబ్దమయమైన పట్టణమును విడిచి దూరమున నిర్జనమై శాంత్యావాసమైన యొకపర్వతాగ్రమునఁ గూరుచుండి తదేకదృష్టితోఁ బరమేశ్వరుని మహిమలను జింతించుచుండెడువాఁడు. ఒకనాఁడు పరమేశ్వరుఁడాతనికి బ్రత్యక్షమైనట్లు స్ఫురియింపఁగా నాయుదంతమును దనభార్యకుఁ దెలిపెను. దాని కామె యెంతయు సంతసించి యొకపండితుని కావృత్తాంతమును దెల్పెను. మఱియొకసారియు నీతని కట్లే జరిగిన యుదంతమును బట్టణమునందలి పండితపామరుల కందఱికిని దెలిసెను. అక్కడనుండి మాటిమాటికి నీతని కట్టియనుభవమే కలుగుచువచ్చుచుండుటవలనఁ బ్రజ లెల్లరును మహమ్మదును మహాపురుషునిగా గుర్తెఱింగి భక్తివిశ్వాసములను జూపించుచు వచ్చుచుండిరి. మహమ్మద రేబియా దేశమునందు జన్మించుకాలమున నచ్చట నొక్క మతము లేకుండెను. కొందఱు భూజ్యాపస్తేజో వాయురాకాశములని కొందఱు గొన్ని చిల్లరదేవతలను, మఱికొందఱు మఱికొన్ని దేవతలను బూజించుచు సత్యదూరులై సన్మార్గ మెఱుంగక చెడిపోవుచుండిరి. పరమేశ్వరుఁ డొక్కఁడేయనియు తక్కిన యీదేవత లందఱును కేవలము కల్పితులే యనియును జనసామాన్యమునకుఁ దెలియక పోయినను గొందఱు పండితులయందు మాత్రమట్టి యూహలు స్ఫురణకు వచ్చు చుండెను. ఈశ్వరుఁడొక్కఁడే యనియును, అతఁడు శిలామృత్తికాదులచేఁ జేయబడిన విగ్రహములయందు లేఁ డనియును నిస్సంశయముగా మహమ్మదునకుఁ దెలియుటచే నాతఁ డాయభిప్రాయమునే యెల్లరకును దెలిపి మతమును స్థాపించెను. ఈతనికుటుంబమును బంధువులును మొదట

శిష్యులుగాఁ జేరిరి గాని క్రమక్రమమున నందఱును జేరఁజొచ్చిరి. తన మతముచే నార్జించినగౌరవమున నరేబియాదేశమునం దీతఁ డొక్కమతిగురుఁడే గాక రాజుగూడ నయ్యెను. మహమ్మదు భూలోకమును త్యజించి స్వర్గారోహణ మొనరించునకాలముననే "ఇస్లాము" నవలంబించినవా రెందరో యుండిరి.

మహమ్మదు గతించినతరువాత నాయనస్థానమున కెవ్వరు రావలయు ననుసంశయము విచారణీయము కాఁగాఁ దన్మతావలంబకులయందు రెండుకక్షలు బయలుదేఱెను. ఒక తెగవా రందఱుఁ గలసి అబూబేల్ అనువానిని పాలకునిగా నెన్నుకొనిరి. మహమ్మదున కల్లుఁడగు ఆలీ యనునాయనయే ఖాలీఫాగా నుండవలసిన దని రెండవ తెగవారు పట్టుపట్టిరి. క్రమముగా మహమ్మదీయు లందఱును రెండు తెగలై, సత్యదూరులై, కేవల మింద్రియాసక్తులై చెడిపోవుచున్నా రని మహమ్మదు దేవునియొక్క యేకత్వమును బోధించెను. 'ఇస్లాము' అనఁగా నందఱికిని సమ్మతమగు మతమును స్థాపనఁజేసి మహమ్మదు మరణించిన మఱుక్షణముననే ఒకతుచ్ఛరాజకీయవిషయముచే నిట్టిభేదము నుగల్పించి, మహామతమును బ్రజలు రెండుభాగములుగాఁ జీల్చివేసిరి. ప్రపంచమున మహానుభావులచే స్థాపింపఁబడిన మహామతము లీప్రకారముగానే చీలిపోయి, యనర్థములై పరిణమించి సంఘమున నంతర్భేదములఁ గల్పించి, ద్వేషములకు నహంభావములకును గారణము లయ్యెను. క్రైస్తవమతమును మహాత్ముఁడగు క్రీస్తు స్థాపించి గతించినకొంతకాలమునకు, రోమన్ కాథలిక్కు లనియు, బ్రోటస్టాంటు లనియు, నెన్నియో భేదములను గల్పించి, బైబులునకుఁ బెడర్థములు చెప్పఁగా, దేశశాంతికిని, మనశ్శాంతికిని, సత్యమునకు దూరులై యకారణములఁ గల్పించికొని, మానవత్వమునకుఁగూడ లోటువచ్చున ట్లొకపంథవా రింకొకయభిప్రాయమువారిని, చీల్చి చెం

డాడి తుట్టతుదకు కాల్చి గంపలెత్తిరి. ఒకేమతమును బోధించు వేద ముల యందలి యుపనిషత్తులను, బ్రహ్మసూత్రములను దీసికొని వేర్వేఱు పురుషులు వేర్వేఱర్థంబులఁ గల్పించి, పవిత్రమగు నార్యమతమును జెఱిచి ద్వైతాద్వైతవిశిష్టాద్వైతసిద్ధాంతంబులచే హిందువులయందలి యైక్యమునకు, వారిమతమునకు నష్టమును దెచ్చి, సాంఘికరాజకీయ విషయములయందుగూడఁ బలితులగున ట్లొనర్చిరి. పాప మీవిషయ మునే మహమ్మదు ఖొరానునందు చెప్పియున్నాఁడు. "అందఱికి నొక్కటే మత ముండినది. ద్వేషమే యిన్నిమతములకుఁ గార ణము." *

క్రమముగాఁ దక్కినమతములయందువలెనే మహమ్మదీయమ తమునందు జనియించిన షియా సున్నీ భేదములు వృద్ధిఁజెంది ఘోర రూపమునఁ బరిణమించెను. ప్రపథమమున జనియించిన యభిప్రా యభేదముచే మఱికొన్ని యభిప్రాయభేదములను వృద్ధిఁజేసికొను, మ తమునందలి ముఖ్యమంత్రమగు "పరమేశ్వరుఁడు తప్ప నన్యదేవత లెవ్వరును లేరు. ఆపరమేశ్వరునిదూత మహమ్మదు" అనువాక్యము నకు "ఆలీ పరమేశ్వరునియవతారము" అనుదానిని షియాలు చేర్చి పూజించుచుండిరి. షియాలకు మహాపురుషు లన్నను వారిగోరీ లన్నను జాలగౌరవము. మసీదులయందలి సాంఘికప్రార్థన వీరికి విధి గాదు. సాంఘిప్రార్థన యైచ్ఛిక మని వీరు సిద్ధాంత మొనరించిరి. అక్బరు పరిపాలనకు వచ్చినకాలమున నీభేదములు వృద్ధిలో నుండెను. రాజకీయోద్యోగులలో ముఖ్యులు సున్నీలై యుండుటచే, వా రెల్లరు ను, సున్నీలుగా నుండి షియ్యాలుగా మాఱినవారిని బాధపెట్టుచుం డిరి. సున్నీపథమును విడిచినవా రందఱును ప్రవాసశిక్ష విధింపవలసిన దను నొకచట్టమును నిర్మింపుఁడనియు నింతకుముందు చేసినవారిని

(* ఖొరాన్ ప్రకరణం, 11 సూరానుస్ రుకూ. 2. )

నిష్కాసితులఁ జేయుఁడనియు కోరుట కున్నతోద్యోగు లందఱును, మత గురువులగు నుల్మాలును నొకనాఁడు అక్బరుకడకు వచ్చిరి.

పండితులగు ఫైజీ ఫాజలులును, చందనదాసు రహీములును, భగవాన్ దాసు మానసింగులును. దక్కిన రాజోద్యోగు లందఱును బరివేష్టించియుండ నిండుకొలువునఁ గూరుచున్న చక్రవర్తికడకు పైని జెప్పిన సున్నీ లరుగుదెంచి, ప్రవాసశిక్ష విధించు పత్రముల నెదుటఁ బెట్టిరి. ఇట్టికోరిక యింతకుముందే చక్రవర్తి విని, మతగురువులు మొదలగువారు వచ్చియుండుటచే వారి నవమానించుట తగదని నాస్తియను జవాబును వాచ్యముగా నీయక వ్యంగ్యముగా నొసంగెను. పండితులుగాని తక్కిన యుద్యోగులుగాని తన మూర్ఖోద్యమమును విడువక యాకోరికనే రెండవసారి తెచ్చిపెట్టిరి. ఆకాగితములు చూచిన తరువాత నక్బరునకును వచ్చినవారికిని నీరీతిగా సంభాషణ జరిగెను.

అక్బ—అయ్యా! మీరు పేర్కొన్నవారి కేకారణముచే దేశాంతరవాసశిక్ష విధింపఁబడవలెను? అట్టివారు మహాదోషము నొనరించియుండ వలయునుగదా?

న్యాయాధికారులు — న్యాయమగు సున్నీమతమును విడిచి యన్యాయమగు మిథ్యాపథమును స్వీకరించినవారి కీశిక్ష నీయవలయును. వీరి కట్టిశిక్ష నొసంగుటకు మతభ్రష్టతయే కారణము.

అక్బ—రుమతభ్రష్టు లనఁగా నేమర్థము? మనశిక్షాస్మృతిలో నట్టి నేరమే లేదుగదా! అట్టి కొత్తనేరమును గల్పించి నూతన చట్టము నేర్పఱిచి, యింతకుమున్ను మారినవారినిగూడ నిష్కాసితుల నొనరింపవలసినంత యవసర మేమిగలదు?

న్యాయా—మతమునకు గురువు లుల్మాలు. వారు వచియించిన వాక్యముల నాధారపఱచికొనియే యీకార్యమునకు దిగితిమి.

పైని ఏలినవారి యనుగ్రహము." ఈమాటలు విని యక్బరు సాభి ప్రాయముగా నాబుల్ ఫాజలువైపు చూచిన నాతఁడు వెంటనే లేచి "యనుజ్ఞయైన యెడల గొన్ని వాక్యములఁ బల్కెదను" అని యనెను.

అక్బ—అవశ్యము నట్లే చేయవచ్చును.

అప్పుడు మతాధికారులగు సుల్తానులవైపు ఫాజలు తిరిగి యిట్లు పల్కుట కారంభించెను.

పండితులారా! మీరిప్పుడు విధించుచున్న శిక్ష సున్నీపథము నుండి షియామార్గము నకు మాఱినవారికేగదా! వారు పతితు లని మీయభిప్రాయము. అట్లయినయెడల షియ్యాలు సున్నీలుగా మాఱి నప్పుడు షియ్యాన్యాయాధికారులును వారిపండితులును వారిని శిక్షిం చిన యెడల మీరొప్పుకొందురా! అప్పుడు మీమనస్సు లెట్లుండును? న్యాయ మనునది దేనిపై నాధారపడి యున్నది? అది మీరు గొంచె మాలోచించితిరా? ధర్మమున కడ్డుదగిలి మీరు వర్తించుట న్యాయ మగునా? మత మనునది పుట్టుకచేతనా? నమ్మకముచేతనా? ఏపథ మునఁ బుట్టినవా రాపథముననే యుండవలసిన దని యెక్కడ నైన నున్నదా? అట్లుగాదు! సున్నీలమార్గములే సత్యములైనవి. షియాల పద్ధతు లధర్మభూయిష్టములు లని పల్కుదురా? మీమతమే సత్య మనుటకు మీ కేయధికారము గలదు? ఏమతము నవలంబించు వారి కయ్యదియే సత్యముగాఁ దోఁచును. అది వాదములపైని గదా స్థిర పడవలసినది. పోనీ! పుట్టినమతమునుండి మాఱుటయే యొకదోష మని మీయభిప్రాయమా? మీనుతములో మీరెంతమందిని జేర్చు కొనుటలేదు. ఆకారణమునఁ బూర్వమతస్థు లందఱును వారిని దమ యధికారబలమున దండింప నెంచుట ధర్మబద్ధ మని యింకొకరు గాదు, మీరొప్పుకొందురా? మత మనునది కేవలము నమ్మకముపై

నాధారపడి యున్నది. ఎవ్వని కేది సమ్మతమో యామతము నాతఁడు స్వీకరించును. అట్టి కార్యమునకు మీ రే యాటంకమును జెప్పఁగూడదు. ఈసందర్భమున పూజ్యగ్రంథమగు ఖొరానులో నేమని చెప్పియున్నది. "నిజానిజములను జెప్పినతరువాత బలాత్కరింపుము." ఆ ధర్మమును మీ రేల పాటింపఁగూడదు. మత మనునది రాజకీయవ్యవహారముల యందు రాఁగూడదనియు సర్వమతములవారును సమముగాఁ జూడఁ బడవలయు ననియుఁ జక్రవర్తి వారియాజ్ఞయయిన తరువాత మీ రెందుల కాయాజ్ఞను దిరస్కరించి ధర్మదూరులై ప్రవర్తించెదరు.

ఫాజలువాక్యములను విని యక్కడి న్యాయాధికారులు గాని యాల్మాలుగాని జవాబీయ లేకపోవుటచే రెండు నిమిషములు సభ యంతయు నిశ్శబ్దముగా నుండెను. కొంచెముసేపుండి చక్రవర్తి యనుజ్ఞ గైకొని రాజా మానసింహు డిట్లు పలికెను. "చక్రవర్తి యాజ్ఞను శిరసావహించుటకుఁ గాని, ఫాజల్ సాహేబు వచించిన వాక్యములయందలి సారమును గ్రహియించి యానందించుటకుఁ గాని సభవా రందఱును సంసిద్ధులు.

మొగలుసామ్రాజ్యమునందు యుద్ధముల నొనరించుటకును, మత వివాదముల సలుపుటకును, బలాత్కారముగా నొక మతము వారిని వేఱొక మతమునకుఁ ద్రిప్పుటకును, హిందువులును మహమ్మదీయులును మాత్రమే గన్పించుచున్నారు. గాని వారిరువురును భేద ములు లేకుండ సోదరులవలె నైక్యభావముతో కాలము గడపు చున్నారు. అయినను మహమ్మదీయమతమునకుఁ జేరిన యీరెండు తెగలవారును అకారణముగ వైరములకు నిలయము లగుచున్నారు. మహమ్మదీయ మతమందు షియాలును సున్నీలును దాయాదులవంటి వారు గావున వారిరువురకును నీవిధముగఁ గలహములు సంభవించు చున్నవి. నూతన పురుషులతోఁ గలసి మెలసి తిరుగుట కిరువు

రన్నదమ్ములకే భేదముండదు గాని వారివారి దురభిమానములు మాత్రము నశింపవు. ఇట్టి సందర్భమున శ్రీ యక్బరుసార్వభౌములు రెండు తెగలలోనుండు పండితులను బిలిపించి ప్రతివారమును వాదములఁ జేయఁ బ్రోత్సహించుట యెంతయు నుపకారకరమని చేయూహింతును." సభవారందఱును అబుల్‌ఫాజలును మానసింహునివాక్యములయందలి ప్రయోజనమును గ్రహియించి, సభల నెలకొల్పవలసినదని చక్రవర్తిని ప్రార్థించిరి.

తరువాత నిబదత్ ఖానా యను మందిరమునందు ప్రతిశుక్రవారమును సభలు జరుగుచుండెను. ఆసభల కెల్లరును వచ్చుటకనుజ్ఞ యీయఁబడుటచే సభాభవన మెప్పుడును నిండి క్రిక్కిఱియుచుండెను. మహమ్మదీయ సంఘమునందు సూఫీలను నింకొక తెగవారుగూడఁ గలరు. వీరు హిందువులలోని వేదాంతులవంటివారు. "సకలసృష్టికర్త యగు పరమేశ్వరుఁ డందఱకును సమముగాఁ బ్రేమింపఁదగినవాఁడు. ఆయనను బ్రేమించుటయే మతము. ప్రపంచము నందలి యద్భుతపదార్థము లన్నిఁటియందును నాయన మాహాత్మ్య మేదో విధమునఁ దాండవమాడుచునే యుండును అట్టి ప్రతివస్తువునందును సర్వశక్తుఁడగు నీశ్వరునిఁ జూచుట సద్ధర్మము" అని వీరియభిప్రాయము. ఈమతసభలయందు సున్నీలును షియాలును గాక సూఫీలును, ఇతరమతస్థులును గూడ హాజరగును, వివాదముల వినుచుండిరి. సున్నీలతరపున 'అబ్దున్నబీ' యును, షియ్యాలపక్షమున 'అబ్దుల్‌ముల్క'ను వాదములు సల్పుచుండిరి. వారివాదములయందు నూతనవిషయములు బయలుదేఱకుండుటయే గాక యొకపక్షమువారు న్యాయవాక్యములను బల్కినను గూడ రెండవతెగవా రొప్పుకొనకుండిరి. క్రోధావేశముచేఁ బండితులోడ తెలియఁగక యొకరి నొకరు దిట్టుకొనుచు న్యాయబద్ధులు కాకుండుటను గ్రహించి యక్బరు చక్రవర్తి

సలహాపై నొకనాఁ డీక్రిందివాక్యముల నాబుల్ ఫాజలు సభలోఁ బలికెను.

"పండితు లందఱును తమతమవాక్యములే సత్యములైనవని పల్కుచు దురాగ్రహముచే సత్యదూరు లగుచుండుటవలన ఫలమింతయును గనుపట్టుట లేదు. మనసభలలో న్యాయమును బరీక్షించి తీర్పుచెప్పుటకు సర్వాధికారియు, సమవర్తియు నగు నాతఁ డొకఁ డుండవలెను. అట్టివానితీర్పునకు మతాధికారు లందఱును లొంగియే తీఱవలయును. అట్టియధికారమును, న్యాయమూర్తులు, ధర్మపథానువర్తులును, పక్షపాతరహితులును, సత్యపథాన్వేషులు నగు బాదుషావారి యందుంచవలయునని సభవారికి మనవి చేయుచున్నాను. ఈయభిప్రాయమునకు వ్యతిరేకముగాఁ దలంచువా రెవరైన నున్నయెడల లేచి మాటలాడవచ్చును." ఆమాటలను విని సభలోనివా రందఱును 'సెబాసు' అనిరి. కొందఱు సహింపలేనివా రున్నను గూడ పాదుషా యాగ్రహమునకు వెఱచి యానియమమున కొప్పుకొనవలసినవారైరి. వెంటనే "మతవివాదములయందు మతాధికారుల మగు మేమందఱమును శ్రీచక్రవర్తివారితీర్పును ధర్మబద్ధముగా నెంచి శిరసావహించుచున్నాము. ఈనియమమునకుఁ దప్పినయెడల మేము నిస్సంశయముగా దండ్యుల మగుదుము" అను భావమును వెలిపుచ్చు వ్రాఁతగల యొకపత్త్రిక వారికడకుఁ దేఁబడెను. దానియడుగున ముల్లా లందఱును సంతకముల నొనరించిరి. దానితో, రాజకీయవిషయములయందే గాక మతవిషయములయందును సర్వస్వతంత్రత యక్బరుచక్రవర్తికిఁ బ్రాప్తించెను. సూక్ష్మబుద్ధి గల నావికుఁడు సర్వాధికారవలను బూని తననోడను సురక్షితముగా రేవునకుఁ జేర్చును. కాని యసమర్థుఁ డగు వాఁ డాయధికారములనే దుర్వినియోగ మొనరించును. నాఁటికార్యక్రమము పూర్తియైన తరువాత సభ ముగిసెను.

# ఇరువదియాఱవ ప్రకరణము

## క్రైస్తవులు

అప్పుడే తెల్లవాఱుచుండెను. సూర్యబింబ మింకను నుదయింపలేదు గాని యరుణకాంతులు మాత్ర మాతనిరాకను దెలుపుడుచేయు వేత్రహస్తులవలె ముందు దోఁచుచు పూర్వదిక్కు నలంకరించుచుండెను. రాత్రియంతయు నుక్కగా నుండుటచే నిదురపట్టని జనులందఱును బ్రభాతవాతపోతములచే నిదురించుచుండిరి. గాని లేవలేదు. అల్పులయందలి దోషముల లక్షితములై యుండును గాని యధికులయందుమాత్ర మవి యనుగుణముగా వర్ధిల్లి ప్రపంచమునకు మహావర్థదాయకములుగా నుండు నని తలఁచి కాఁబోలును, మనుష్యులెల్లరు నిద్రించుచున్నను దనకృత్యములఁ దాను నెఱవేర్పక తప్పదని తూర్పునం దుదయింపఁదలచిన భానునివలెనే యక్బరుపాదుషా గూడ లేచి తన సౌధమునకుఁ బ్రక్క నున్న యొకపెద్దఱాతిపైఁ గూరుచుండి మనమున నేదియో యాలోచించుచుండెను. దృష్టులను క్రిందికిఁ బఱపి తలవాల్చి కాళ్ళను ముడచి దీర్ఘాలోచనాపరుఁడై కూరుచున్న చక్రవర్తి మనమున నిన్నటిసభయందలి సంగతు లన్నియు దొరలుచు నీరీతిగా భావములఁ బుట్టించుచుండెను.

'మత మనునది లేక దేవునియునికియే తెలియక, పశుతుల్యులై, యనాగరకులై, జ్ఞానశూన్యులై మనుష్యులు జీవించుచుండు కాలమునఁ బరమేశ్వరుని కరుణావిలాసమున మహామహు లుద్భవించి చరాచరనియంత యగు నాయనవార్తను దెల్పుదురు. ఆరేబియా దేశమున మండుటిసుకలో జనియించి, నిర్మలమైన సూర్యతేజస్సుచేఁ దప్తమైన మనస్సుతో పవిత్రములైన భావములతో మానవజాతియేకత్వమును, ఈశ్వరుని మహామహిమలను వ్యక్తమొనరించితివిగదా!

మహానుభావా! విద్యలేదు! చదువుటకు వ్రాయుటకుఁగూడ శక్యము కాలని నీకు పుస్తకములవలన జ్ఞానము లభించె నని యెవ్వరైన ననఁ గలరా! మహాపురుషసంపర్కమువలన వచ్చిన దనవచ్చునా! హీరా పర్వతముపైఁ బరమేశ్వరునిఁ గన్నులారఁ గాంచి యాదర్శనప్రభావామృతమును గ్రోలితివిగదా? ప్రతిరోమకూపమును భక్తిచే నిండి యుండిన నీవు మంచి మార్గమును జూపి ప్రపంచాభివృద్ధికాముఁడవై ప్రకటించిన సత్యపథమును మఱచి యిస్లాముమతావలంబకులు తమలోఁ దమరు కలహముల కాలవాలము లయ్యెద రని యెఱింగియుంటివా! ఈమూర్ఖులు నీవు వచియించిన మాటలను మఱచి సాంఘిక రాజకీయవిషయములను బట్టుకొని మతమునందు గలహములఁ బెంచి యిప్పటికి నా భేదములను విడుచుటలేదుగదా! 'సృష్టికర్తను విడిచి వేఱువారిని బూజించు మనుష్యులను గష్టపెట్టకుము' అను నీపలుకును మఱచి కొంతకాల మితరమతావలంబకులను బాధపెట్టుచుండిరి. ప్రతిమతమునకు నీవంటి మహాత్ముఁ డొకఁ డాధారభూతుఁడై యుండవలయును. కావుననే 'ప్రపంచమంతయును నాబోధకులచే నిండి యున్నది' అని చెప్పఁ బడినది. అన్నిమతములును మహాత్ములచే స్థాపింపఁబడియుండుటచే నన్నియు నీశ్వరునిఁ జేరుటకే మార్గములుగా నుండవలయును. అట్టి సందర్భమున వీ రేల ద్వేషములకు గుఱియయ్యెదరో! ఒకగ్రామమును జేరుట కనేకములైన మార్గము లుండవచ్చును. అందేమార్గముననైనను బురుషుఁడు పోవచ్చును. ఒక మార్గమునఁ బోయినవాఁ డన్యపథము ననుసరించినవానిఁ గని నిందించుట న్యాయమగునా? ఒక్క మార్గము నెఱింగినవానికంటె నన్నిమార్గముల నెఱుఁగుట జ్ఞానాభివృద్ధికిఁ గారణ మగు ననుట నిస్సంశయము. అజ్ఞానమువలన వచ్చు నభివృద్ధికి మేర యుండదు. మూర్ఖులగు నుల్మాలకును మొల్లాలకును సర్వమతపరిజ్ఞానము నొసం

గినఁ దప్పక వృద్ధికి రాఁగలరు. అప్పు డన్యమతములనుగాని తమమత మునందలి వేఱు తెగలవారినిగాని నిందింపరు—

అని పరిపరివిధముల నాలోచనలు సలుపుచుండ సూర్యభగ వానుని వేఁడికిరణములు శరీరమునకుఁ దగిలి యుష్ట్రుని ప్రబోధితుని గావించెను. అట్లు ప్రబోధితుఁడై యనేకతభావనాపరంపరనుండివిడు వడి లోనికిఁ బోయి స్నానాది కృత్యములఁ దీర్చుకొని సభాస్థానము నకుఁ దగినవస్త్రులను ధరించి యప్పుడే పండితులతోడను, ఉద్యోగు లతోడను నిండియుండిన సభకుఁబోయి ఫాజలుతో నీరీతిని భాషించెను.

అక్బ—అనుదినమును మన మొనరించెడు సభల కితరమతా వలంబకులను బిలిపించి వారికిని మాటలాడుట కవకాశ మిచ్చిన యెడల, మతములయొక్క యధికన్యూనతలు సర్వులకు బోధ పడఁ గల వని నే నెంచుచున్నాను.

ఫాజల్—సర్కారువారు సెలవిచ్చిన దెంతయును నిజము. ప్రపంచమునందలి సర్వవస్తువులును నూతనవస్తుసాంగత్యమున నేయభి వృద్ధిఁజెందును. జ్ఞాన మనునది యొకరిసొమ్ము గాకపోవుటచేతను, ఎల్లరును దానికొఱకే పాటుపడుటచేతను, నేర్చుకొనవలసినది ప్రపంచ మునం దపారముగా నుండుటచేతను, వివిధములైన విషయములు వివిధములుగా మతపురుషులే గనిపెట్టి జనసామాన్యమునకుఁ దెలుపుదు చేసిరి. ఒకమతము నవలంబించుచు వేఱొక్కమతము వాసనయే యెఱుంగక యన్యుల నందఱను మూఢు లనుకొనుచున్న మనపండిత మ్మన్యులకన్యమతజ్ఞానము పరమోపకారి యగును. దాని సందియము లేదు. కావున మనకుఁ దెలిసినంత మట్టుకు పండితుల కందఱకును లేఖలను వ్రాసి యీ సమాజమునకుఁ బిలిపించవలసిన దను నభి ప్రాయ మెంతయును ప్రస్తుతస్థితి కుపకారక మని చెప్పక తప్పదు.

ఫాజల్ పల్కిన పల్కులను విని సభవారును బాదుషాయు సంతోషపూరితస్వాంతు లైరి. తోడనే యన్నిమతములవారును సర్కా

రులలో జరుగుమతవాదములయందు పాల్గొనవచ్చు ననియు నన్యమత ధిక్కారమును దూషణయు లేకుండఁ దమమతముల యుత్కృష్ట్యమును దెలుపుకొన వచ్చు ననియు బ్రకటన చేయఁబడెను. ఈయుత్తరువును ఆగ్రా పట్టణమునందే గాక మొగలు సామ్రాజ్యమున నున్న యన్ని పట్టణములకుఁ బంపెఁ. సూర్యార్చకులకు ప్రధాన గురువగు దస్తూర్ మహేర్జీరాణా యను నాతనికి జైనమత గురువులగు హీరవిజయసూరి, విజయసేనసూరి మొదలగువారందఱికిని గుజరాతున కుత్తరములు వ్రాసిరి. వారిని సగౌరవముగా నిచ్చటికిఁ బంపవలయు నని గుజరాతుపట్టణపు సుబేదారునకు లేఖ పంపిరి. వేదవేదాంగ పారంగతులై మహావిద్వాంసులైన నైష్ఠికాచారపరులకును, చార్వాకులకును, యహూదమతస్థులకును, వేసేలు, కెమ్మెల్లరకును లేఖలు వ్రాసిరి. ఆసమయమునఁ జందినబాసు లేచి యిట్లనెను "పశ్చిమదేశమునుండి వచ్చి గోవాపట్టణమున నివసించుచుఁ దమ మతమును వృద్ధి చేయుటకుఁ బ్రయత్నించు శ్రేష్ఠముఖులగు ఖుడతకీచులకుఁ గూడ నాహ్వాన మంపవలసిన దని నామనవి." అది విని యక్బరుచక్రవర్తి "అవునవును, సమయమునకు జ్ఞాపకముగఁ దెచ్చితివి. వారికడనున్న నూతనవస్తువులను జూచిరమ్మని యంపిన హాజీహాబిబుల్లా, మనకొఱ 'ఆర్గను'ను గొని తెచ్చెను. ఆయార్గను నుపయోగించుచు సాంఘిక ప్రార్థన మొనరించుట వారి కలవాటనియు, మతమనిన వారి కెంతయో పట్టుదల యనియు మన కంతకుముందు తెలియును. వారి కొఱ లేఖ వ్రాయవలయును" అని ఫాజలువైపు చూచి చెప్పిన వెంటనే యాతఁడు దనచెంత నున్న లేఖకునకు వ్రాయవలసిన దని సంజ్ఞ చేసి యీప్రకారముగాఁ జెప్పఁదొడంగెను:—

"పరమేశ్వరుని యాజ్ఞ చొప్పున:—

దేవునియొక్క స్థానము దీప్రపంచమున నిలుపఁబడిన మహామ్మద్ అక్బరు పాదుషా రంపించిన లేఖ.

పాల్ మహాసభాప్రభు శిష్యులకు పత్రికాంశములలో ముఖ్యాంశములు:—ప్రప్రథమమున నక్బరుచక్రవర్తి వారికి బరమస్నేహితుఁ డని గ్రహింపవలసినది.

"ఈయుత్తరమును మావారియగు నబ్దుల్లాను బంపియున్నాము. ఆతనితో మీయొక్క మహావిద్వాంసు లిద్దరు వారిరువు రిక్కడకుఁ దమ తమ గ్రంథములను బట్టుకొని రావలసినది. మీమత గ్రంథములలోఁ గల సర్వవిషయములను దెలిసికొనవలయు నని మాకు ఖండితమైన కోరిక గలదు గావున వారి రాక మాకెంతయు సంతోషదాయకముగా నుండును. వారు నాకాప్తులై సర్వవిధములనుగూడ గౌరవపాత్రు లయ్యెదరు. ఇక్కడ కనుగొంచి వారిమతగ్రంథములలోని యంశములను లెస్సగా విశదీకరించినతరువాతఁ దగుసాహాయ్యముతో మంచిబహుమానముల నొసంగి తిరిగి పంపువారము. మేము వారి నందఱను బరమేశ్వరుని కార్యముకొఱకుఁ బిల్పించుచున్నాము గావున వా రెట్టిభయమును జెందనక్కఱలేదు" రచనపూర్తియైన తరువాత నాజాబును మడచి పైవిలాసము వ్రాసి యాయుత్తరము నబ్దుల్లాచేతికి బాదుషాయాజ్ఞచొప్పున నాగుమాస్తా యందిచ్చెను.

ఆనాఁటికి మతకార్యములు పూర్తి యగుటచే రాజకీయవ్యాపారములను బరీక్షించుటకు పాదుషా యుపక్రమించెను. సుమారు నాలుగువందలగుఱ్ఱములు సేనయం దుపయోగించుటకుఁ దీసికొని రాఁగా వానిని బరీక్షించుటకుఁ జక్రవర్తి సైనికోద్యోగులతోఁ గలసి వెడలెను. సర్కారునందలి యశ్వశాస్త్రజ్ఞు లాగుఱ్ఱములను బరీక్షించిరి గాని తాను స్వయముగాఁ బరీక్షింపనివస్తు వేదియుఁ గూడ సేనకుఁ జేర్పరా దని యాతఁ డింతకుము న్నాజ్ఞ చేసెను. వచ్చిన గుఱ్ఱముల నన్నిటిని ఒక్కొక్కటివంతున వరుసగాఁ బరీక్షచేసి యనుమానము గల రెంటినితప్ప తక్కినవాని కన్నిటికి ననుజ్ఞ యిచ్చెను. అశ్వపరీ

తులో నక్బరసదృశుఁడగుటచే రెండుగుఱ్ఱములను దిరిగి పరీక్షచేయించి పండితులచే నవి నిరుపయోగము లని యొప్పించి మందలించి పంపివేసెను. తాను బరీక్షించి యుత్తమములుగా గణించిన యశ్వముల నన్నిటిని సర్కారుముద్రచేఁ గాల్పించి సైన్యాధికారికిఁ బంపివేసెను. భోజనకాలము సమీపించుటచే నాఁటిఁ డానాఁటికి కార్యక్రమము ముగించి లోనికిఁ బోయెను.

---

## ఇరువదియొకటవ ప్రకరణము

### బంతియాట

పట్టణమును గట్టించినప్పుడు తగుజలాధారములు నిర్మింపక పోవుటచేతను గాలక్రమమునఁ బట్టణమభివృద్ధిగాంచుటచేతను ఫతేపూర్ సిక్రీలో నీటి కిబ్బందిగా నుండెను. జలాధారము లేనిపట్టణము పట్టణమే గాదు గావున నక్బరుచక్రవర్తి యీకొఱఁతను దీర్చుటకై కార్మికశాఖాధికారితో నాలోచించి దగ్గఱనుండు కొండలలో నొక విశాలమైన సరస్సును నిర్మించెను. తనకడ నున్నపురనిర్మాణచాతురీధురీణుల యాజమాన్యముక్రిందఁ గట్టఁబడిన యాసర స్సాఱుమైళ్ళ పొడువును నాలుగుమైళ్ళ వెడల్పును గలిగి యొకసముద్రమువలె లొప్పారుచుండెను. ఆతటాకమునుండి పురమునకు జలమును దెప్పించుటకుఁ గాలువల నుపయోగించుటవలన నాసీరము చెడిపోవు నను నభిప్రాయముతో గొట్టముల నుపయోగించి, ఫతేపూరుసిక్రీలోని ప్రతియింటికిని మహాలునకును జలము, అహోరాత్రము లఖండప్రవాహముగా వచ్చున ట్లేర్పాటుచేసెను.

ఆసరస్సునొడ్డునఁ బెద్దమైదాన మొకటి కలదు. దానిపై నొకటిరెండుదినము లుండుట కను వగునట్లు చక్కనిమందిరములు గట్టి

యుండెను. ఆకాసారతీరమున నిలువంబడి నలుగడలఁ బాఱంజూచి నవానికిఁదన్నిర్మాతయొక్క హృదయవైశాల్యమును, గాంభీర్యమును దోఁపకపోవు. అందు సహజముగా జీవించెడు జలపక్షులేఁ గాదు, విదేశములనుండి వివిధములైనపక్షులను దెప్పించి చక్రవర్తి పెంచుచుండెను. రాజహంసలు మొదలుకొని కొంగలవఱకును గల సర్వ జలపక్షులు నందుండుటచే నక్కడికరుగుదెంచి వాని నీక్షించిన జూపరులు సృష్టివైచిత్ర్యమునకు మెచ్చుకొనుచు మానసికారాధనా పరులై యుందురు. వానికిఁ దోడు నల్లగలువలు, యెఱ్ఱదామరలు, శోణోత్పలములు, పుండరీకములు, నసితాంభోజములును నందు లెక్కకు మిక్కిలి పిక్కటిల్లుచుండును ఒక వాయువిమానముపై నెక్కి యాకాసరస్సును దిలకించువారికి నవరత్నములతో నిండియున్న యొక వెండిపళ్ళెరము స్ఫురింపకపోదు. ఆ జలాధారమునందు నిండు వెన్నెలలో జలవిహారములు సల్పుటకుఁ దగినట్లు చిన్న చిన్న పడవ లచ్చటచ్చటఁ గట్టబడియుండెను. ఆపడవ లన్నియుఁ బురము నందలి జనులెల్లరకును బనికివచ్చునట్లు సదుపాయములు చేయఁబడెను. నాజను లెక్కి తిరుగ నావలను నడుపుటకును, మునిఁగినవారిని లేవ దీయుటకును మనుష్యు లక్కడ సిద్ధముగా నుందురు. ఆచెఱువున నొక భాగముమాత్రము పాదుషా యుపయోగమునకుఁ బ్రత్యేకముగా నుంపఁబడెను.

విశాలమైన కంకరచేఁ గట్టి పఱుపఁబడి, గచ్చుచేసిన ట్లొప్పుచుండు నామైదానమున గుఱ్ఱములపై నెక్కి కొందఱు రౌతులు బంతుల నాడుచుండిరి. ఒక్కొక్క రౌతు చేతియం దొక బెట్టెదగు లావుపాటి బెత్తముండెను. ఆబెత్తమునకుఁ గొనయంటించిన యొక కట్టెముక్కతో, సుమారు మూఁడంగుళముల దళసరి గల పలాశ కందుకమును గొట్టుచు నాయాట నాడుచుండిరి. ఆబంతి గుఱ్ఱపు

డొక్కలకుఁ దగిలినను నయము లేకుండ నుండునట్లుండును. అందాడు చుందు సేనవారంద్రుసు రెండుపక్షములుగా జీలి బంతిని దమ ప్రతికక్షుల గమ్యస్థానము (Goal) గుండా పోఁద్రోలుటకుఁ బ్రయత్నించుచుందురు. ఒకదాని కొకటి యెదురుగా నాగమ్యస్థానములు రెండును రెండుప్రక్కల నున్నవి. ఆగమ్యస్థానమును గాపాడుచు నొక్కొక్కడొకాశ్వికుఁడు జాగరూకుఁడై యుండ, మిగిలిన మువ్వురును బంతిని దమ ప్రతికక్షుల గమ్యస్థానముగుండా పంపించుటకుఁ బ్రయత్నించుచుందురు. బంతి యేదిక్కునఁ బోవుచుండునో యావైపునకు గుఱ్ఱమును వేగముగాఁ బరుగెత్తి యచ్చటనే నిలుచుట కలవాటుపడియుండును. ఆగ్రిగుఱ్ఱములపై నెక్కి యక్బరు మొదలగువార లందఱు నాయాట నాడుచుండిరి. దీనినే పాశ్చాత్యులు హిందూదేశమున నేర్చుకొని 'పోలో' యను నామమున నాడుచున్నారు. చక్రవర్తి కొంచెమునే పాయాట నాడి దగ్గఱ నున్న యొక నూపాపైఁ గూరుచుండఁగా మిగిలినవా రాడుచుండిరి. అప్పుడు చందనదాసు రహీములు గూడ నాడుచుండిరి. అందొక సందర్భమున బంతిని గొట్టుకొనుచు చందనదాసు సూచవలె గమ్యస్థానమును జేరఁబోవుచుండెను. వానిని జూచి పాదుషా మానసింహునితో నిట్లనెను. "ఊచవలెఁ బోవుచున్న మా చందనదాసు బంతిని గొట్టుకొనుచు నావలిప్రక్క కాపరియైన రహీము కంటిలో దుమ్మువైచి గెలుపొందును." అదివిని, మానసింహుఁడు "తన సహాయులు దగ్గఱ నుండక పోవుటంబట్టియు నావలిప్రక్క నున్న నలుగురుగూడ నేకమగుచుండుటచేతను నా బంతిని దప్పక తిరుగఁగొట్టెదరు. అందును రహీ మతిజాగరూకుఁడై యున్నవాఁడు" అనియెను. అట్లైనయెడల నీసందర్భమున గెలిచినవారికొక యాటగుఱ్ఱమును బహుమానముగా నిత్తును. ఎవరు గెలుతురో చూతము" అని పలికి చూచుచుండఁగాఁ దన కెదురుగావచ్చు మువ్వ

రను దప్పించుకొని యేదో రీతిగా రహీము ప్రక్కనుండి బంతిని చందన దాసు పటిపెను. వచ్చుచున్న వానికడ నున్న బంతిని లాగుటకు బెనుగులాడు నుద్దేశముతో రహీము చందనదాసును సమీపించెను గాని యాతఁడు వచ్చుచుండుట గనిపెట్టి యొక దెబ్బతో నాబంతిని గమ్యస్థానము నకుమనుండిపోవునట్లు చేసెను. తఃమను ఖ్యాఁతో నుటచే నూనసింహుఁ డెంతయు విశ్వాసవిహీనుఁ డయ్యెను. గాని చక్రవర్తి మాత్రము తాను వచియించినట్లు గుఱ్ఱమును చందనదాసున కొసం గెను. ఇంతలో గోవానుండి క్రైస్తవగురువులు దఖునకు వచ్చినారని పట్టణమునుండి కబురు రాఁగాఁ జందనదాసు ఫజలులకు వారికిఁదగు సదుపాయములను జేయుటకుఁగాను చక్రవర్తి యంపి, కొంచెము సేపు తానాయాట నాడి సిక్రీపట్టణమున కేఁగెను.

---

## ఇరువదిరెండవ ప్రకరణము

### పట్టణము

వివిధదేశములనుండి వచ్చిన మతగురువు లందున ముఖ్యము గా క్రైస్తవులకుఁ జక్రవర్తిపట్టణ మగుసిక్రీయం దందలి కట్టడములను జూడవలయు నని కోరిక జనియించిన సమాచార ము సార్వభౌముని చెవులఁ బడినతోడనే యాతఁ డాబుల్ ఫాజల్ చందనదాసులను వారి యీాప్సితమును నెఱవేర్చుటకుఁగాను బంపెను. వారిరువురును మత గురువులు నివసించు బసలకుఁ బోయి వారిని గుఱ్ఱపుబండ్లపై నెక్కించుకొని పట్టణ మంతయుఁ జూపించుటకుఁ బయనము చేసిరి. వా రెక్కిన బండ్లకు ముందువెనుకలఁ బదిమందిసిపాయిలు గౌరవసూచనకొఱకును అవసరముపడినచో రక్షణకొఱకును గూడఁ బోవుచుండిరి. పట్టణ

ముఁ యుండిరి, సంపూర్ణముగా సర్వస్థలములను జూచుట యొక్క దినమున సాధ్యముగా దని యారాత్రికి బట్టణ మంతయు చుట్టుదిరిగి రావలె నని నిశ్చయించుకొనిరి. ప్రథమమున పాదుషాను షాలునుండి బయలుదేరి, యనారిబజారులు మొదలగునవి చూచుచు పోవునప్పు డచ్చటి బాటలవైశాల్యమును, దీపస్తంభములరమ్యతయు, మార్గనైర్మల్యమును చూచిన పురుషులహృదయముల నెంతయో యులరించెను. ఆబజారులో సమస్తవస్తుజాలమును కుప్పతెప్పలుగాఁ బడి యమ్మతమునకు సిద్ధముగా నుండెను. వివిధములైన యున్నివస్త్రములు, దూదిబట్టలు, గాజు, మట్టి, వెండి, బంగారు, ఇనుము మొదలగు వానితోఁ జేయఁబడిన యెల్లసామానులును, చీనాదేశమునుండి తెప్పింపఁబడిన పింగాణీపాత్రలును, ఆచుట్టుప్రక్కల తోఁటలలోఁ బెరుగుచుండు ఫలములు పుష్పములు, విదేశములనుండి తెప్పించిన పత్రకుసుమాదులును, పలువిధములైన మిఠాయిదినుసులును, ఇది యననేల, యెల్లపదార్థములు లెక్కకు మిక్కిలి నిండి, రూపిత్తి సమృద్ధిగా తాండవమాడుచుండిన బజారువీథులను గాంచి నూతనపురుషులందఱును చక్రవర్తి పట్టణముయొక్క యైశ్వర్యమును జూచి యాశ్చర్య మందిరి. ఒకానొక దుకాణములో నున్నరత్నముల రాసులఁ గాంచి వారు నివ్వెఱపడిరి. బజారువీథులలోఁ బడి పట్టణముకోనకేఁగ ప్రాకారము చుట్టును సుమారేఁబైమైళ్ళపొడవుగల గోడయొకటి యుండెను. అందు తొమ్మిది ద్వారము లున్నను ముఖ్య మగునాల్గింటిని మాత్రము వారు చూచిరి. క్రైస్తవమత గురువులలో మార్సార్థీ యను నాతఁడు ప్రతిద్వారము కడను దిగి యాగోడల కొలఁతలును ద్వారముల యౌన్నత్యమును, వాని యందచందములును సంపూర్ణముగాఁ దిలకించుచు, నీయుదంతము నంతయు వ్రాసియుంచెదనని ప్రక్కనున్న ఫాజల్ మొదలగువారితో నుడువుచుండెను.

ఆనాఁడు పట్టణమంతయు నొక్క పరుగున నశ్వశకటములపై నెక్కి తిరిగి, యప్పటికే సూర్యాస్తమగుటచే నింటికిఁ బోయిరి. చక్రవర్తిచేఁ గట్టింపఁబడిన మహోన్నత ప్రాసాదములను, కట్టడములను సమగ్రముగాఁ జూచి వచ్చుటకు నిశ్చయించుకొని మఱునాఁడు సాయంకాలము బయలుదేఱిరి. వారు ప్రథమమున నౌబత్ ఖానాకడకుఁ బోయిరి. అది కోట సన్నను. అక్కడినుండి వరుసగా నన్నికట్టడములకు దిరిగివచ్చినప్పటికి పరీక్షింతముగాక యని వారు తలంచుకొనుటచే నక్కడికే కేగిరి. తాళములు మొదలుకొని నగారా వఱకును గల నృత్యవాద్యములును, పిల్లనగ్రోవి మొదలుకొని బాకా వఱకును గల గానసాధనములును, తంబురాలు మొదలుకొని వీణావఱకును గల తంత్రీగానసాధనములును, ఇది యని యన నేల, గానసంబంధమైన సర్వయంత్రములు నచ్చట నుండెను. పాశ్చాత్యదేశమునుండి తెప్పింపఁబడిన "ఆర్గన్" అను వాద్యవిశేషముగూడ నచ్చట నుండఁగా దానిని దిలకించి వారందఱుగూడ నత్యాశ్చర్యమగ్నమానసులైరి. వాని నన్నిటిని గాంచి యొకచ్ఛాందసుఁడు "అయ్యా! గానకళావిశారదు లిక్కడ నెందరో గలరా?" అని ప్రక్కనున్న చందనదాసు నడిగెను. దానికాతఁ డిట్లు ప్రతివచనము చెప్పెను.

"అయ్యా! గానమన్నను చిత్రలేఖనమన్నను మా చక్రవర్తికే గాక ప్రజల కందఱికిఁ గూడ, మంచిగౌరవము నందవలసిన విద్యలని యభిప్రాయము. గానకళయం దుత్తము లని పేర్వడసిన మహానుభావులను వ్యయప్రయాసలకు వెనుదీయక యెంతదూరమునుండియైనను బిలిపించి దనయాస్థానమునందు మా చక్రవర్తి నెలకొల్పుచున్నారు. హిందువులు, ఇరేనియనులు, తురేనియనులు, కాశ్మీరదేశవాసులు, వీరు వారన నేల? యెల్లదేశములవారును గానకళాప్రదర్శనార్థ మిక్కడకు వచ్చియున్నారు. లాలాకళావంతుఁడు, మియాన్

లాలు అను మహాపురుషు లిర్వురును బాబుషాకు గానకళయందు గురువులై వారి కత్యుత్సాహమును గల్పించిరి. ఇక్కడ నున్న గాయక శిఖామణులందఱిలో నుత్తమోత్తములై, యమూల్య రత్నమై, "తాన్సేన్" అనుమహానుభావుడు కేవలసరస్వతివలె గానముచేయును. ప్రతిదినమును జరుగు సంగీతసభలు ప్రస్తుతము జరుగుచున్న తమసభల కొఱకు కాంపుచేయఁ బడినవి.

నౌబత్ ఖానా యంతయును జూచి దగ్గఱనున్న టంకశాలకడకు వారేగిరి. అక్కడ మామూలుప్రకారము దమకడ నాణెములు మొదలగు విలువఁగల పదార్థము లన్నియును దీసి కావలివానిచేతికిచ్చి పరీక్షయైన తరువాత లోనికిఁ బోయిరి. అక్కడ లోహములు కరఁగి రేకులుగాఁ జేయుస్థలములను, నాణెములను దయారుచేయుటకుఁ జెక్కింపఁబడిన యచ్చులును, వానిని దూనికచేయుచోట్లును జూచి వారు పరమానందభరితులైరి. అక్కడనుండి వారందఱును ధనాగారమున కేఁగి, రొక్కమును దాఁచియుంచి తాళములు వైచెడు మందసములు వాని నెల్లను రక్షణ మొనరించుమార్గములను గాంచి కొంతదూరము రాజమార్గమునంబడి పోయి 'దివానీ ఈఆమ్' అనుమందిరమునకు బోయిరి. ఆమందిరము న్యాయస్థానము. అక్కడ దోసకారులను విచారించి న్యాయమును తీర్పు చెప్పుదురు ఆకట్టడముయొక్కయౌన్నత్యమును నందు పఱచిన రాళ్ళ సౌభాగ్యమును గాంచి 'అహాహా! ఏదేశముననైనను ఎక్కడనైన నిట్టికట్టడములను గట్టించినమహారాజుండెనా' యని యచ్చెరువంది దాఫ్తర్ ఖానాకుఁ బోయిరి. అందు రాజకీయవిషయములకు సంబంధించిన లిఖితము లుంపఁబడెను. ఆగది సుమా రేఁబదియడుగుల పొడవును ముప్పదియడుగుల వెడల్పును గలిగి చక్కనిడాబాచే కప్పఁబడియుండెను. అక్కడినుండి వారు రాజద్వారమును జూచుటకుఁ బోయిరి. ఏబదియడుగుల యెత్తుగల కట్టడమం దేనుఁగు

లుగూడఁ బోవుటకుఁ దగినంత వైశాల్యము గల తలుపులతో నా ద్వారము రాజద్వార మను నామమునకుఁ దప్పక తగియుండెను. ఆ స్తంభములపై నానుకొనియున్న రెండు గోపురములు రెండు ప్రక్కలను మనోహరములై యలరారుచుండెను. ఆద్వారముపై కెక్కుటకుఁ గట్టిన పదమూడుమెట్లును, చుట్టుప్రక్కల నున్న గోడలును నేలయు నూనె పోసి యెత్తుటకు వీలుగా నున్న వనిన నతిశయోక్తి యేమియును లేదు. తరువాత వారందఱును రాజద్వారములోఁబడి రాచనగరునుండి మసీదు చెంతకుఁ బోయిరి. అక్కడి కేఁగినవెంటనే చందనదాసు మెలఁకువతో "ఇది మహమ్మదీయు లుదయము సాయంత్రము దేవునిఁ బ్రార్థించు స్థలము. ఆప్రార్థనకే నమాజ్ అని చెప్పుదురు. లోనికట్టడముల యొక్క సౌందర్యమును జూచుటకిచ్ఛగలవా రందఱును రావచ్చును" అని మతగురువు లంగీకరించుటను దెల్పఁగాఁ దొలుత నొకరిమొగ మొకరు చూచుకొనుచు నూరకుండిరి. గాని, యొకరుమాత్ర మిందేముండు నని యడిగిరి. "ఇం దేవిగ్రహము నుండదు. చేతులును గాళ్ళును గడుగుకొనుటకు వీలుగా జలమువాత్రముండును. ఇది నమాజ్ వేళ గాదు గనుక నొక రిద్దఱు ఉల్మాలును మసీదుసేవకులును దప్ప మఱియెవ్వరు నుండరు." అని చందనదాసు చెప్పిన జవాబు విని యాతని వెనుక నొకరిద్దఱు పోవుటకు మొదలు పెట్టఁగాఁ దక్కినవారును మెల్లఁగా వెనువెంట వెడలిరి. మహమ్మదీయులైనను దేవునిఁ బూజించుస్థలముగదా యని తలఁచినవా రందఱుఁ బోయిరి. గాని యిద్దఱుమాత్రము లోపలి కేఁగకుండ వెనుక నిలువంబడిరి. లోపలికిఁ బోయినపురుషు లక్కడ రాళ్ళపైఁ జెక్కఁబడిన చిత్రములగు పుష్పములు, ఫలములు, లతలు మొదలగు నగిషీపనులను గాంచి యెంతయు సంతసించిరి. తెల్లని చలువరాలును, యెఱ్ఱరాళును, నల్లనిరాలును, వివిధవర్ణములుగల యెన్నియో రకముల రాలును

నందుపయోగింపఁబడి సూనులవలె చూచువారికన్నులు మిఱుమిట్లు గొలుపుచుండ, "నీపనితన మే దేశస్థులది?" యని వారడిగిరి. ఆమాటకు అబుల్ ఫాజల్ "ఈపట్టణ మంతయు బాహావుద్దీన్ అను నొక శిల్పిశేఖరుని యాజమాన్యముక్రిందఁ గట్టఁబడినది. ఏ యే దేశమునం దేయేశిలలు లభించునో, వాని నన్నిటి నిట్లు చెక్కి సిద్ధము జేయుటలో నెఱింగిన పనివాండ్రనేకు లాయనక్రిందఁ బనిచేయుచుందురు" అని చెప్పెను. వారందఱును గలసి యాప్రక్కనున్న బలంద్ దర్వాజాను గాంచిరి. అది రాజద్వారమును బురుడించుచు నాలుగుప్రక్కలు గలిగి యున్నతములైన గోపురములతో నొప్పుచు మనోహరముగా నుండుటచే మాన్ సార్టి యెంతయు నాశ్చర్యమగ్నమానసుఁడై యక్కడనే తెప్పవాల్పక చూచుచు నిలువఁబడెను. అక్కడనుండి వెడలి వారు "షేక్ సలీమ్ చిస్టీ" యను మహానుభావుని గోరీని జూచుటకుఁ బోయిరి. తెల్లనిచలువరాలచేఁ గట్టఁబడినందుల మిలమిల మెఱయుచు చిత్రవర్ణములచే నలంకరింపఁబడిన గోరీని గాంచి యాపురుషులలో నొక్కఁడు "అయ్యా! ఈకట్టడము హిందువులచేఁ గట్టఁబడి నట్లు గుర్తులు గనుపట్టుచున్నవి" అనియెను. అది విని ఫాజలు, "పవిత్రస్థలము లెవ్వరు గట్టినను పవిత్రస్థలములే యగును. విద్యాదేవి మహమ్మదీయులను, హిందువులను అన్నిజాతులవారిని సమముగాఁ జూచుచుండును. కృషినిబట్టి జ్ఞానముగాని కులము ననుసరించి కాదు. హిందూశిల్పులయం దట్టిశక్తిసంపన్నులుండుటచే దీని నిర్మించుటకువారే నియమింపఁబడిరి, హిందూదేవాలయములను మీరు పరీక్షించిన యెడల నందు మహమ్మదీయశిల్పముయొక్క లక్షణములు సువ్యక్తము లగును" తరువాత నక్కడివా రందఱకు నాబుల్ ఫాజలా ద్వారము నందలి పనితనమును జూపించెను. నల్లరాతిపైఁ జక్కని ముత్తెము చిప్పలు పొదిగియుండుటచే నది మనోహరముగాఁ గనుపట్టుచుండెను

"దీనిని గ్రహించుట కేమయ్యెను" అని హాన్‌రాస్ట్ అడిగెను. "సుమా
రు యువలక్షలరూపాయలు దీనికొరకు వెచ్చింపబడెను" అని షాజహా
జవాబు చెప్పి వారి సంకేతిని రాజా బీర్‌బల్ గృహమునకు పంపివేసి
పోయెను. అందనేకములైన హిందూముసల్మానుల యొక్క పటములను
గాంచి వీని నెవరు వ్రాసిరని యడిగిరి. అది విని "స్వామీ! క్రీస
గ్రభాగమున సంస్థానమునందు దొరకనూర్గురు చిత్రలేఖకులు రాజకీయో
ద్యోగము లందున్నారు. అందు బసావన్, దస్వంత్ అను చిత్రలేఖ
శిఖామణులు సదృశమేధావంతులై రాజసభాగౌరవము బడసియు
న్నారు. అందు దస్వంత్ అనునాయన శ్రీశంకరులవారి యాకార
మును వ్రాసి నాకిచ్చెను. ఇట్టిచిత్రములను గాదుసామహాలులో
మీరెన్నియో చూడగలరు. పారసీకదేశమునుండి వచ్చిన పండి
తులశక్తియు, హిందూశిల్పమును గలిసి యిట్లు మూర్తిభవించియు
న్నవి. ఖ్వాజా అబ్దుల్ సమద్ అనునాయన చక్రవర్తికి చిత్రలే
ఖనమున గురువుగా నుండి యాకళ నభివృద్ధిని గాంచెను. ఈకళయం
దభిరుచి పెరిగి యొకనాడు చక్రవర్తి చిత్రలేఖనమున నిష్ణపడిన
వారని నేను బహూకరింపను. చిత్రలేఖకుడు పరమేశ్వరుని గాంచు
టలో నెంతయు శక్తియుక్తుడు. ఏమనగ, జీవము గలజంతువు
యొక్క యాకారమును వ్రాయునప్పుడును, దానికి ప్రత్యంగరచ
మొనగూర్చునప్పుడును గల కష్టము నెఱుగును గావున బరమేశ్వరు
సృష్టిరచనాకౌశల్యమును నాతని మహిమలను చిత్రలేఖకుడు గుర్తె
ఱుంగగలడు." అని అందఱితో జెప్పెను. తరువాత సంఘమున
గలసి అబుల్ ఫాజలు గృహమున కేగి యచ్చట వారొసంగి
పుష్పఫలాదులను సేకరించి సంతుష్టిజెంద యచ్చోట వాసి తమ
బసలకుజని సనదిసము జరుగుచున్న సంభలందువలెనే మఱునాడు
మాటలాడవలసినవారెల్లరు దమగ్రంథములను జూచుకొనుచు
గూరుచుండిరి.

## ఇరువది మూఁడవ ప్రకరణము

### దివానీఖాస్

జ్ఞాన మనునది యొకమహాసముద్రము, ఎవరికి లభియించిన సాధనములతో వారాసముద్రమునందు దమయిష్టమువచ్చిన మార్గమునఁ బ్రయాణము చేయుచుందురు. ఆప్రయాణమునందు వారికిఁ గన్పించిన ప్రదేశములును, వారికిఁ గలిగినయనుభవములుమాత్రమే సత్య మనియు మిగిలినదెల్ల నసత్య మనియు మానవకోటి భ్రమించుచుండును. మనము గన్నారఁ దిలకించు జలసముద్రమువలెఁ గాక మనోనయనముచేమాత్రము దిలకింపవలసిన జ్ఞానజలధి యపారమై, యనంతమై యుండుటచే నభిప్రాయభేదము లధికముగానుండును. ఒకసారి యేవురు గ్రుడ్డివాండ్రేనుఁగును జూచుటకు బయలుదేఱిరి. అందఱును నాయేనుఁగు నాకారమును హస్తముచే నిమిరి స్పర్శజ్ఞానముచే నెఱుఁగవలసినవారలే గాని యక్షిసందర్శనముచే నొక్కసారి సంపూర్ణమైన దాని రూపమును గనుగొనుటకు శక్తిగలవారుగారు. వారిలో నొకఁడేనుఁగు కాలును, మఱియొకఁ డొకయంగమును, ఇంకొకఁ డితరొకయంగమును స్పృశించి యేనుఁగు కఱ్ఱవలెనున్న దని యొకఁడును స్తంభమువలె నున్నదని యింకొకఁడును గోడవలె నున్న దని వేఱొకఁడును పలికి భిన్నాభిప్రాయములతో నెంతయోసేపు వాదించి వెడలిపోయిరి. వివిధములగు మతముల నవలంబించువారును నిట్టివారే యగుదురని చెప్పుట యెంతయు సమంజసము. నిశ్చయముగా నిదమిత్థ మని వచియించుటకు మతమునందు ప్రత్యక్షప్రమాణము సున్న. ఎవరికిఁ దోఁచునట్లు వారు వారికి లభించిన జ్ఞానలేశములచే సిద్ధాంతముల నొనరించి వానినే ప్రపంచమునందలి సర్వసత్యమని నమ్ముచుందురు. పర్మలమై, జ్ఞానవంతమై, యోజనాప్రధానమై,

పక్షపాతరహితమైన మనస్సున నొక్కపర్యాయము మీఁద యున్నియు స్ఫురించినయెడలఁ దప్పక వానిలో నిసారమంతయు క్షీరసముద్రమును మథించితీసిన యమృతమువలె తేలఁగలదు. ఇట్టి యభిప్రాయముతోడనే మతగురువులను సమావేశ మొనరించుటకు సార్వభౌముఁడు సిద్ధపడెను.

ప్రప్రథమమున సున్నీలకు షియాలకును కలిగిన వాదములను వినుటకుగాను 'ఇబదత్ ఖానా' యను నొక మందిరము గట్టఁబడెను. క్రమక్రమముగ నన్నిమతములవారును నరుగుదెంచి తమ వివాదములందు పాల్గొను నాచారము ప్రబలినతరువాత నామందిరము విడిచి దివానీఖాస్ మందిరమునందే యీసభలు జరుగఁబడుచుండెడివి. ఆ మందిరమున నాలుగుప్రక్కలను నాలుగుమతములవారు గూరుచుండి సావధానచిత్తులై వాదప్రతివాదములయందు పాల్గొనుచుండిరి. విశాలమైన యాభవనోపరిభాగమునంతను మోయుచు, హిందూసామ్రాజ్యమును భరించు చక్రవర్తివలె, నొక్కటియే దృఢమైన స్తంభముండెను. ఆ స్తంభమునుండి యనేకములైన శాఖ లన్నిదిక్కులకును వ్యాపించి భారవహనకార్యమున సహాయభూతములుగా నుండెను. అందొక పార్శ్వమున నొకయెత్తయిన యాసనమునఁ జక్రవర్తి యాసీనుఁడై యుండగా నాయన కిరుప్రక్కల నిరువురు వజీరులు గూరుచుండియుందురు. వారిలో నొకఁ డాబుల్ ఫజల్. ఒక్కొక్క మతము వారొక్కొక్కదినమున మాటలాడుటకు దగిన యవకాశ మొసంగి, వారి వాదప్రతివాదములను సరియయిన మార్గములలోఁ ద్రిప్పి సభను సరిగా నడపించు నధికార మాబుల్ ఫాజల పై మోఁపబడెను. అట్టి యధికారియుఁ గొన్ని నిబంధనలును, లేకుండ వీరితో వేగుట కష్టమని చక్రవర్తికి స్వానుభవమువలన వ్యక్తమయ్యెను.

మొదట నగ్నిపూజాధురంధరులు దమ మతముయొక్క యాధిక్యమును వెల్లడించిరి. "ప్రపంచమునందు ప్రత్యక్షముగా మన కన్ను

లోకోపకారి పరమేశ్వరుని యవతారములు పంచభూతములు. సూర్యభగవానుడు నిత్యము నుదయించి తన కాంతిచే ప్రపంచమును వెలిగించి నైర్మల్యమును జేకూర్చకున్న యెడల విశ్వమంతయు నశించిపోవును. అతడుదయింపకున్న ప్రపంచమునందలి సచరాచర సంతతి యంతయు నొక్కసారియే ప్రమగ్గు ననుటకు సంశయము గలదా! అట్టి సర్వసంపత్ప్రదాయకమై సృష్టిస్థితిలయ హేతుభూత మైన సూర్యుని తేజస్సెక్కడనుండి వచ్చినది? అగ్నినుండియేగదా! అట్టి యగ్నియే పరమాత్మ. అతనినే యందఱుఁ బూజించుట ముఖ్యము.'' అను నభిప్రాయము గల యుపన్యాసములను గొన్ని దినము లొసంగి ముగించిరి. తరువాతఁ గొన్ని దినములు చార్వాకులు తమ చార్వాక సిద్ధాంతములు దెల్పిరి. జైనమతావలంబకులు భూత దయయే పరమకళ్యాణగుణ మనియు నట్టిగుణమునే పరమేశ్వరుఁడు సకలప్రపంచమునకు బోధించుచున్నాఁ డనియుఁ జెప్పి విరమించిరి. కర్మకాండప్రధానులగు హిందువులు గొందఱు తమ సిద్ధాంతములను సంపూర్ణముగా సభవారికి దెలుపుచుచేసిరి. తరువాతఁ గ్రైస్తవులు తమ వ్రతగాథలను పఠించి తెల్పుచు, ప్రపంచోత్పత్తిని వివరించిరి. కాని వీరు మాత్రము న్యూలవలెఁగాక పరమతములను దూషించుటకుఁ బ్రారంభించిరి. క్రైస్తవమతము తప్పఁ దక్కిన మతము లన్నియు నసత్యము లనియుఁ దన్మతావలంబకు లందఱును నరకమునకే పోవుదు రనియుఁ బలికిరి. కాని యాబుల్‌ఫాజలు సాత్వబుద్ధి గలవాఁడై వారిని క్రమమార్గమునకుఁ ద్రిప్పి వాద మును ముగింపజేసెను. ఇట్లనేకులు వాదములను సల్పి ''మన పాండిత్యములను, మన మతౌత్కృష్ట్యమును వెలువరించి పాదు షాను మెప్పించుకొంటిమి. ఇఁక నాప్రాజ్య సుఖములను బొంది సంతోషించుదము'' అని యెవరిలో వారే సంతసించు

చుండిరి. అందఱును తమతమ పాండిత్యములను వెల్లడించినతరువాత బాదుషా యూబుల్ ఫాజలును లేచి మాటలాడు మని కోరెను. ఆయన నదినయసాధారణవాగ్ధోరణితో నిట్లు ప్రసంగించెను.

'మహానుభావులారా! పండితోత్తము లందఱును నానానేకమతముల గుఱించి తెలుపు చేసి మిమ్ము మాత్రమే గాక విను వారి నందఱిని గూడఁ దిరింపఁజేయఁ గలిగిరి. అవి యన్నియు వినిన తరువాత నేను శ్రీచక్రవర్తిగారితో మాటలాడియుంటిని గాన వారి యభిప్రాయ మును గొంత వఱకు కనుఁగొనినను మనవి చేసికొనుచున్నాను. ప్రతిమత మునందును గొంత మంచియు గొంత చెడ్డయుఁ గన్పించుచునే యున్నది. ఎవ్వరి నడిగిన వారే 'మామతమే సత్యము, తక్కిన దంతయు నసత్యము' అని పల్కుచున్నారు. ప్రపంచములో నున్న యన్నిమతములవారును పరలోకమునకు బోయి యొక్కఁడుమాత్రము స్వర్గమునకుఁ బోవునా? ఇది యెంతమాత్రము నమ్మఁ బొసఁగదు. వేర్వేఱు మతములవారు దేవుఁ డున్నాఁడా? లేఁడా? ఉండిన వాని నామగుణరూపాదు లెట్టివి? ఆయనను బూజించుట యవసరమా? అనవసరమైనయెడల దత్పూజవలన లాభమేమి? లాభముండినయెడల నాపూజనము సల్పు టెట్లు? ఈవిషయములనే చర్చింపవలయును గాని పుక్కిటిపురాణములను సాంఘికరాజకీయవ్యవస్థలను, కులాచారవర్తనములను దెచ్చి మతములో గుచ్చెత్తి, జాతిభేదములను గల్పించి మతమునకుఁ బరమావధియైన శాంతిని ధ్వంసము చేసి మతము నొక హృదయాంతర క్షోభముగా నొనర్చియున్నారు, హిందూమతములోని యద్వైతవాదులు జగత్తు మిథ్య, బ్రహ్మ సత్యము, ప్రపంచమంతయు బ్రహ్మమయమే కాని వేఱు లేదు, తక్కిన దంతయు భ్రాంతిమయ మని పల్కిరి అది చక్కఁగనే యనిపించుచున్నను దన్మతావలంబకులు జ్ఞాన మని కబుర్లు మాత్రము చెప్పుచు పురాణగాథాప్రవాహమునఁ బడి

కొట్టుకొనుచు కృత్రిమములైన ప్రతిమార్చనాదులనాచరించుచు తాము గనుఁగొంటి మని పలుకుసత్యము నొకరికిఁ దెలుపక యజ్ఞానులవలె నసత్కార్యములను జేయుచుఁ దక్కినజీవుల నంతటిని మహాంధకార కూపమునఁ దత్ప్రకార మాచరించుచు పైవారి కదిదెలుపుదు చేసినఁ గదా దాని సార్థక్యము వెల్లడియగును ? పాండిత్యము గలవాఁడు దనజ్ఞానమును జూపింపక దక్కినపనులకుఁ దెలియనీయక దానును తెలివితక్కువ వానివలె మాటలాడుచుండుట ప్రతిభయా ! ప్రాగల్భ్యమా ! లేక యజ్ఞతను గప్పిపుచ్చుటకుఁ దెచ్చికొన్న యవగుంఠనమా ? యేమియో యర్థముగాఁ జాలదు. పరమేశ్వరుని నిత్యకళ్యాణగుణములలో నొకటగు దయయే మతమునకు ముఖ్యాధార మని యు దయావంతమైన శీలమే మంచిమత మనియు జనుల పలికియున్నారు. లోకసుఖముకొఱ కట్టిదయ కొన్నిచోటుల ముఖ్యముగా వచ్చును గాని, హింస లేకుండ ప్రపంచము జరుగునా ? ప్రకృతి మనకు బోధచేయున దేమి ? చిన్న జంతువు పెద్దజంతువున కాహార మేల కావలయును ? మానవసౌఖ్యమే పరమేశ్వరుఁడు చేసిన సృష్టి యొక్క యవధి యైన యెడల నకారణముగా, ననాలోచితముగా నుపాండములు, పిడుగులు. ప్రళయములు సంభవింప నేల ? ఒకజంతువు సుఖము మఱియొక జంతువునకు దుఃఖ మేల కావలయును ! కావున వారు చెప్పినదియే సర్వసత్య మని పలుకుట తగదు. అయినను వారు దెల్పిన దయాప్రధానమార్గమునుమాత్రము సంపూర్ణముగా విడువను దగదు. క్రీస్తే దేవుని కొమరుఁడు, అతడే దేవునికడనుండి సత్యమును దెచ్చెను. తక్కిన మతముల ననుసరించినవా రందఱును దేవుని కప్రియమును నొనరించినవారలగుదురు.'' అనుక్రైస్తవసిద్ధాంతమును నశ్లైయున్నది. తక్కినమతస్థాపకులుగూడ వారితో సమానమైన మహానుభావులే! దీనిని గుఱించియే నాకా

నొకగ్రంథమున నిట్లు చెప్పఁబడినది. "ప్రపంచమంతయు బోధకులతో నిండియున్నది. ప్రతిజాతికిని బోధకుఁడు గలఁడు." *

ఇట్టిపరస్పరవిరుద్ధములు గలిగియున్నను సర్వమతములకునాశయ మొక్కటియే యగును. అందఱిని సృష్టియొనరించినవాఁడొక్కయీశ్వరుఁడే. ఆయన యెల్లరకును సమానబుద్ధిని బ్రసాదించి, సమమైనహక్కు నొసంగియున్నాఁడు. ఆమహామహునిదృష్టియందు వీఁడీమతమువాఁడు, వాఁడామతమువాఁడు నను భావ మున్నట్లు గనుపట్టదు. ఒకచక్రవర్తిచేఁ బరిపాలింపబడు నీదేశమునందే యున్నిమతభేదములు, భాషాభేదములునుండి మానవసంఘమును జిన్నచిన్నభాగములుగాఁ జీల్చి వేయుచున్నయెడల, ననంతమైన సచరాచరప్రపంచమున నెన్నిమతము లుండవలయునో యోచించుకొనుఁడు. ఆమతములన్నియు నిజముగా సంతుష్టికిని హృదయశాంతికిని కారణములు కానేకావు. అంతటితో నూరకుండక యామతములు ప్రపంచమునఁ బరస్పరవైషమ్యములకు క్షోభములకుఁ గారణములగుచున్నవి. విగ్రహములను బూజించుచుండెడు హిందువుల దేవాలయములలోని కేఁగినను శూన్యములైన మహమ్మదీయుల మసీదులలోని కేఁగి మానసికారాధన మొనరించినను, క్రైస్తవులప్రార్థనాలయములలోని కేఁగిభానువారమునాఁడుసాంఘికప్రార్థన మొనరించినను, మన మొనరించుకార్య మొక్కటయే. సర్వమునకు నియంతయై, సర్వశక్తుఁడైన యొకపరమేశ్వరుఁడు మనపై నున్నాఁడని యొప్పుకొని యాతని నే యన్నిమతములవారును బూజించుచున్నారు. ఆయన నేప్రకారముగాఁ బూజించిననేమి యనుసంశయమునుమాత్ర మెవ్వరును గుర్తెఱుంగుటలేదు. ఒకమతమువార లింకొకమతమువారితోఁ గలసిమెలసి తిరుగుచుండి, యొక్కదేశమువారై, యొకేవిధములైన భావములచేఁ బెంపొందింపఁబ

* కొరాన్. ప్రక్క. 11 — 21

డిన యిచ్ఛలఁ గలిగియు, మతభేదములచే గల్పింపఁబడినదూరమును మాత్రము పోగొట్టుకొనఁజాలకున్నారు. ఒకరితో నొకరు సంబంధములు గాని, తుదకు పంక్తిభోజనములను గాని యొనరింపకుండ మతములు ప్రతిబంధకము లగుచున్నవి. మతములు తెల్పెడి నాధ్యాత్మిక విషయములను గ్రహించి వాదించుచు, జీవాత్మపరమాత్మలకుఁ గలసంబంధములను జూపింపవలసినదే గాని ప్రపంచసంబంధములైన సాంఘిక రాజకీయ వ్యాపారికవిషయములయందు దేనియు ముఖ్యముగా నుండుట కసంగత మాలోచనీయము. అన్ని మతముల నష్టముగాఁ బెట్టుకొనుటవలన మతపరమావధియైన మనశ్శాంతి లభింపకపోవుటయే గాక యైహికసుఖములు గలిగి, వృక్షలతాగుల్మములతే గృహాలంకారములై, సూర్యచంద్రాదులే దీపంబులై, భూమియే విశాలమైన యంగణమైన యీప్రపంచగృహంబునఁ బుట్టిన యీయఖిలమానవకోటికిని మతమునఁ దిన్నభేదము లేల? కావున నన్నిమతములయందలి యున్నతాభిప్రాయములను, సర్వజనహితకరములగు పద్ధతులను నేరియుంచి, సర్వసమ్మతమై, సత్యమై, దయాసత్యశౌచాదిగుణప్రధానమై, భూతదయామూలకమై, జ్ఞానదాదాయకమగు నొకేమతమును మీరంఱును గలసి బోధింపవలసినది. దేశవృద్ధికిని, ఆత్మశాంతికిని, జ్ఞానోదయమునకును మీరందఱును బాటుపడుదురుగాక —అల్లాహో అక్బర్—" అని చెప్పి యాబుల్ ఫాజలు గూరుచుండినతరువాత సభయంతయు నిశ్శబ్దముగా నుండెను. అక్కడ కరుదెంచినపండితు లెవ్వరును పెదవి మెదపుటకు సాహసింపరైరి. కొంచెముసేపైనతరువాత చక్రవర్తియాజ్ఞననుసరించి పండితులందఱకును బహుమానము లొనరింపఁబడెను. తరువాత సభ చాలించి యెవరియిండ్లకు వారు వేంచేసిరి. మొదటినుండి కొనవరకును సభయందలి సమాచారమును సంపూర్ణముగా కన్నులారఁ గాంచి చెవులార వినినట్టి చందనదాసు మనస్సునందు మాత్ర

మొక పెద్దతుపాను బయలువెడలెను. ఇంతవఱకును ప్రశాంతమై, నిర్మలమైన సముద్రమువలె నాశాంతిహతమైన యాతని మనస్సునందు భావతరంగము లమితముగా నుప్పొంగఁజొచ్చెను. అక్కడ పండితు లందఱు వచియించిన వాక్యములను దలఁచుకొనుచు నాతఁ డింటికిఁ బోయెను.

---

ఇరువదినాల్గవ ప్రకరణము.

కల.

మతసభలయందలి తుదిరోజున జరిగినసంగతు లన్నియును మనస్సున యోచించుకొనుచు చందనదాసు స్వగృహమున కేఁగునరికిఁ జాల నాలస్యమగుటచే వంటవాఁడు పదార్థము లన్నియు లనూ రొన రంచుకొని యింటికడఁ గూరుచుండెను. ఇల్లు చొచ్చి తనయంగీల నన్నిటిని దీసి పాదప్రక్షాళనాదుల నొనరించుకొని భోజన మాచరించి తల్పముపైఁ బండుకొనియెను గాని నిద్దురపట్టుటలేదు. అన్న మాటలు వదినె చెప్పినపలుకులు, రాత్రివచ్చుచుండెడు కలలు నాతని మానసమును రాయిచేసి ధీరత్వ మను గుణమును బైటికిఁ దెచ్చెను. ఒకానొక యధికవిషయమునకు కేవలదృష్టిజన్యమైన ప్రేమనుద్రోసి వేసెద నని నిశ్చయ మొనరించుకొనెను. ఎల్లకాలమును బ్రహ్మచర్యాశ్రమమున నుండుటకు నిశ్చయించుకొనెను గాని సభాస్థానమందలిపండితుల జ్ఞానాజ్ఞానప్రధానములగు వాదములచే జనియించిన హృదయక్షోభమునం దిప్పుడు దరిగానక కొట్టుకొనుచుండఁ దీరమునం దొక చిన్న దీపమువలె నాబుల్ ఫాజల్ యొక్క జ్ఞానజ్యోతి మినుకుమినుకు మని కన్పించుచుండెను. క్రమక్రమముగా నయ్యది మండి పెద్దదై మార్గ

మును జూచెను. ఆతేజస్సంతకంతకు వృద్ధియగుచుండుటచే విశ్వమంతయుఁ దేజోమయమై గనుపట్టఁదొడంగెను గాని యప్పు డప్పుడద్దానిచేఁ గన్నులు మిఱుమిట్లు గొలిపి యొక్కక్షణములో నంతయు నంధకారబంధురమగుచ గోచరించుచుండెను. ఆతనిమనస్సున నెప్పటికప్పుడుప్పతిల్లిన భావముల నన్నిటిని గ్రహియించి వ్రాసియుంచెదము.

"మతము మత మని యింతకాల మోపికపట్టితిని. నిజముగా మతములు సాంఘికవిషయములై మనుష్యుల ప్రాపంచిక సౌఖ్యములను గూడ నశింపఁజేయుచున్నవి. ఇన్ని మతములయం దేది నిజము? అన్నియు నిజమేనా? కాదు! కాదు! అవును! అవును!— అన్నియు నిజమే! అన్నియు నబద్ధమే! ఏమతమును యథార్థ్యము నంతయుఁ దెలుపఁజాలకున్నది. ప్రతిమతమునందును గొంతసత్యమును గొంత యసత్యమును నున్నదని యొప్పుకొనక తప్పదు. ఇన్ని దినములును బండితులు దమమతగ్రంథములను దీసి చెప్పిన దేమి? పిడుగునకును బియ్యమునకును నొక్కటే మంత్ర మనునట్లు వారెంతసేపును నొక్క పద్ధతినిగురించియే చెప్పిరి. ఆహా! మతస్థాపకుల కొక్కయంశము చేతనే పరమేశ్వరుని నిజమైన సర్వశక్తి గోచరింపఁగా, భక్తిచే వారు దాండవించిరి. కాలక్రమమున వారివిశ్వైకవ్యాపకమగు శక్తి మనకు లేకపోవుటచే వారిమాటలనుమాత్రము గ్రహియించి యందలియర్థమును గ్రహియింప లేకున్నాము. హిందువులేమి! మహమ్మదీయు లేమి! జ్ఞానమునకు జాతితో నేమి సంబంధము? అది యొకరిసొమ్మా! ఆత్మ యనునది గల దనియు నాయాత్మ దిక్కాలాదిప్రతిబంధకములచే భిన్నముగా దనియు నెఱుంగుటయే హిందూమతసారము. నేను మహమ్మదీయకన్యకను వివాహమాడఁగూడ దని యెక్కడనున్నది! ఇది యంతయు సహవాసప్రాబల్యముచే జనియించిన దురూహ. అంతకుమించి యింకేమియును లేదు. ప్రపంచమునం దేదేశమైన

నేమి? ఏజాలియైన నేమి? అందఱికి నొకటే మతమని యీదినమున నిర్ణయింపఁబడినదే! నాయన్నయు వదినెయు నే మనుకొందురోగదా! ఇంతకును వారితో నాకేమి ప్రయోజనము? నే నొనరించినకర్మయొక్క ఫలమును నే ననుభవింపవలసినది కాని వారి కేమి? తప్పక వివాహము చేసికొనియే తీరువాఁడను. నాఁడు మాతండ్రి కలలో నన్ను వారించెనే? పితృవాక్యముఁ ద్రోసివేతునా! ఛీ! ఇదేటిభ్రమ! ఇదియంతయును నాభ్రమయే! ఆభ్రమయే, యానిశ్చయరాహిత్యమే నన్నుఁ గలరూపమున వచ్చి బాధించినదని చెప్పకతప్పదు. ఇంతకును నీకాలమున నిట్టి వివాహము లెన్ని జరుగలేదు! హిందువులను మహామ్మదీయులు, మహామ్మదీయులను హిందువులును బెండ్లిచేసికొని యున్నారు. వివాహము చేసికొన్న మతమున కేమి లోటువచ్చును? పాదుషావివాహము చేసికొన్న స్త్రీలు హిందువులా? మహామ్మదీయులా? హిందువులను బెండ్లిచేసికొనుటచే చక్రవర్తియేమి హిందువయ్యెనా? నేను వివాహము చేసికొనుటయే కర్తవ్యము. కాని నేనడిగిన వారిత్తురా? నన్ను పాణిగ్రహణ మొనరించుకొనుట కామె కేమైననభ్యంతరముండునేమో? ఛీ! ఇది ఘోరము! ఉండదు. ఆమొగనందును నాకనులయందును ప్రేమరసము పొంగి పొరలుచుండును. ఆనాఁ డామె యొసంగిన విసనకఱ్ఱయే ప్రేమసందేశము. దానిపైనున్న చిత్రము నాభిప్రాయము. పైనుండి ఫలము పరిణతమై జాఱుచున్నట్లు గన్పట్టెడిని. నిజముగా నాఫలము నాకొఱకే నిర్మింపఁబడినది. ఆనాఁడు నాకు జబ్బుగా నున్నప్పు డామెకన్నులనుండి వెడలిన కన్నీళ్ళను మంచముప్రక్క నిలువఁబడనప్పు డామొగమునందలి దైన్యమును దెలుపుటకు శక్యముగాదుగదా! నిస్సంశయముగా నామె నన్ను వివాహ మాడితీరును. నేను వారిరువురను మిర్జాబారినుండి సంరక్షించినప్పుడు చూపించిన కృతజ్ఞతాస్ఫోరకమగు మోముఁదమ్మి

గాంచుట శక్యమే? నిశ్చయముగా నామె నాకొఱకే యీశ్వరునిచే ప్రకల్పింపఁబడియెను. పైజీఘాజులు లెన్నఁడు నీకార్యమున కడ్డువచింపరు. తప్పక రేపీసంగతిని పైజీకిఁ దెలియఁజేయుదును. నోటితో నేనాసంగతి నాలాపింపను. కాకితము వ్రాసి వారి కొసంగెదను, దానిని వారు చదువుకొని చేయఁదగిన కార్యము నిర్ధారణ సల్పుదురు. అని యేమేమియో యోచించుకొనుచు కన్నుమూసిన కొంచెముసేపునకు నాతఁడు గాఢనిద్రాపరవశుఁ డయ్యెను. సుమారొక రెండు మూఁడుగడియలకుఁ బెల్లవాఱుననఁగా నాయన కొక కలవచ్చెను.

ఏదియో సందర్భముపై నొకనూతనపట్టణమునకుఁ బోయి వీథులందుఁ దిరుగుచుండ నాతని కొక యుద్యానవనము గన్పించెను. చిన్నచిన్న చెట్లు, పూలమొక్కలు, చిత్రపత్రములతో శోభిల్లువృక్షములు గలిగి రమణీయమైన యావనముయొక్క బహిర్ద్వారము తెఱచియుండ నాతఁడు లోనికిఁబోయి, యేపనియు లేకుండుటచేఁ గొంచెమటునిటుఁ బ్రచారముసల్పుచు పవనాయాతగంధముల నాస్వాదించుచుండఁగా దాహము మిక్కుటమయ్యెను. ఆ వనమందు జలపానాతురుఁడై నలుదిక్కులను దిరుగుచు, జల్లని నీటితో సన్నని చప్పుడు గల్గి ప్రవహించుచుండు నొక చిన్న యేటికాలువను గాంచెను. దాహము దీర్చుకొని యొక సురపొన్ననీడను శ్రమ నపనయించుకొనుచుఁ గూరుచుండి తనదృష్టుల నావలిప్రక్కకుఁ బఱపిన తోడనే దత్తటమున నొక యువిద భువనమోహనకరమైన రూపముతోఁ గన్పట్టెను. ఆమెను గాంచినవెంటనే యాతనిమనస్సు చలించెను. ఆ తన్వంగియుఁ బ్రేమపూరితములైన చూపులను వీనిపైఁ బఱపెను గాని యచ్చట కేఁగుట కాప్రవాహ మడ్డుగా నున్నది. "అది యెంతలోఁతుగా నున్నదో? నా కీఁతరాదుగదా!" అని యనుకొనుచు నాయొడ్డునఁ దిరుగుచుండఁగా నొకగుఱ్ఱ మొకటి వానికి లభించెను.

ఆగుట్టముపై నాతఁ డెక్కి ప్రవాహములో దిగెను. అయ్యయో! యీనీరు మోకాలిబంటిమాత్రమున్నది. నిష్కారణము భయపడితిని- అని తలంచుచు నావలిపక్కఁ జేరి యక్కడి సుందరీమణి హస్తాంబుజమును స్పృశించి ముద్దువెట్టుకొను ప్రయత్నములో మోమును జేర్చుచుండ నొకతేఁటి చూరుక్కునఁ గుట్టెను. తత్క్షణమే యాతఁ డొక కేకతోఁ జేయిలాగికొని గబగబ మంచముపై నుండి లేచి నల్గడలు పరికించి యది కల యని యెఱింగెను. ఆతరుణి యెవ్వరు——పహ్మీదా !——

అప్పుడే పక్షులు కిలవారావములు సేయుచుండెను. ప్రాగ్దిశ యందుఁ గొంచెము కొంచె మెఱుపు దోఁచుచున్నదని గ్రహించి యహర్ముఖోచితకృత్యములం దీర్చుకొని ఫలాహార మొనరించి రాత్రి వచ్చిన కలనుగుఱించి చింతించుచు కొలువుకూటమునకుఁ బోయెను.

నాఁటి సభలోఁ జక్రవర్తి యాగ్రాకుఁ బోనున్నాఁ డనుసంగతి విని యాతఁడు ప్రయాణమునకు సంసిద్ధుఁడై పాదుషావెంబడి యాగ్రా పట్టణమును జేరుకొనెను.

---

## ఇరువదియైదవ ప్రకరణము



### అగ్ని

ఆగ్రాకుఁ బోయిన మఱునాఁటి యుదయమునఁ జందనదాసు దన యింటిలోఁ గూరుచుండి పిట్టకలముతో నొక బెంగాణి సిరాబుడ్డిని ప్రక్కనుంచి జర జర వ్రాయ మొదలుపెట్టెను.

మిత్రుఁ డగు నాబుల్ ఫైజీకిఁ జందనదా సనేక వందనములు-

సుహృన్మణీ !

మన యిరువురకును స్నేహము గలిగి సుమారొక యాఱు సంవత్సరములు మించినది. ఆగ్రాపట్టణమునందు నాకు మీకంటె మిత్రులును హితులును లేరనుసంగతియు మీకు విదితమే. నాయందు చక్రవర్తికి దయగలుగుటకుఁ దనుప్రేమయే కారణమని చెప్పక తప్పదు. నాకొకసారి యుద్ధములోఁ బ్రాణదాన మొనరించినవారు మీరేగదా! ఇన్ని మేళ్లు మీరు నాకొనరించినందులకు మీఋణమును నేనెట్లు తీర్చుకొనఁ గలుగుదునో తెలియకున్నది. ఎన్నియోసారులు వివాహము చేసికొనవలసినదని నాకు సలహా నిచ్చుచున్నను గూడ మీ మాటను బెడ చెవిని బెట్టి బ్రహ్మచర్యవ్రతము నవలంబించుటకు గారణమును మీ రూహింపఁజాలరు. మీస్నేహమును నేను సంపాదించి నప్పటినుండియు నాకొకవిధమగు నూతనభావ ముత్పత్తిల్లినది. మీకు బంధువును సోదరితో సహానురాలును నగు పహిమీదాయే యా మార్పునకుఁ గారణమని మీకుఁ దెలుపుటకు లజ్జించుచున్నాను. ఈ వాక్యములను స్వయముగా మీతో నేను బలుకఁజాలక వ్రాతమూలముగాఁ జెప్పుచున్నాను. ఇంతవఱకు మీకాసంగతి దెలుపకుండుటకుఁ గారణము నామనస్సునందలి పిచ్చినమ్మకము పోకుండుటయే! కోరికకు నాకే యడ్డము దోఁచుచుండ నాజన్మాంతమును బ్రహ్మచర్యము నవలంబింప నెంచి యింతకాల మూరక యుంటిని. తమసాంగత్యముచే నుద్భవించిన జ్ఞానాగ్ని యంతకంతకు వర్ధిల్లి మొన్న జరిగిన సభయందలి వాదప్రవాదములచేఁ బ్రేరేపఁబడి మహాజ్వాలయై యజ్ఞానమును సంపూర్ణముగా ధ్వంస మొనరించెను. వివాహ మొనరించుకొ మ్మందురో లేక బ్రహ్మచర్యమునే యవలంబించి యుండుమని యెదరో! మీయానతికొఱకు వేచియున్నాఁడను. నాయుత్తరమును జూచినతరువాత నీవిషయమునందు మీ కేమైనను బ్రతిబంధకములు గన్పించినయెడ నొరులకు దీనిని దెల్పక మాటుపఱచెద రని నా ప్రార్థన.

ఇట్లు తమమిత్రుఁడు
చందనదాసు.

అని లేఖను వ్రాసి మడిచి పెట్టి లకోటా చేసి తన చొక్కా జేబులో నుంచుకొనెను. ప్రాతఃకాలముననే లేచి వస్త్రములను ధరించి సైను సిద్ధము చేసి తెచ్చిన గుఱ్ఱము నెక్కి షైజీ యింటికిఁ జందనదాసు వెడలెను. గమ్యస్థానముకడ గుఱ్ఱమునుండి దిగి యక్కడ నున్న నౌకరును గాగుఱ్ఱము నిచ్చి లోనికిఁ బోయి ముందుండు పడసాలలోఁ గూరుచుండి, లోపలికిఁ గబురంపెను. షైజీయును లోనుండి వచ్చి యాతని చెంతఁ గూరుచుండఁగా వారిద్దరకును నీరీతి నుత్తరప్రత్యుత్తరములు జరిగెను.

షైజీ—మిత్రుఁడా! వార్త లేమి? మొన్న జరిగినమతసభలలో హిందూమతమునుగురించి మీపండితులు వాదప్రతివాదములు సల్పిరిగదా! మొత్తముమీఁద మీయభిప్రాయ మేమి?

చంద—అయ్యా! సభ లన్నియు సాంగముగా వీక్షించియుండి వాద ప్రతివాదములను సంపూర్ణముగా వింటిని. మహరాజులువచించిన వాక్యము లెంతయు సమంజసముగాఁ గనుపట్టుచున్నవి. ఇట్టి యుద్భుతములగు నూహాలు గల చక్రవర్తి లభించుట మనయదృష్టమని చెప్పకతప్పదు. వేయేల! యీసామ్రాజ్యమునం దున్న జను లందఱును నొకే మతము గలవారై యుండినచో నెంత బాగుండునో నేను జెప్పఁజాలను. భారతవర్షమున కట్టిస్థితి యచిరకాలములోనే రాఁగల దని నాయూహ.

షైజీ—మనుష్యుఁ డొకటి గోరినఁ బరమేశ్వరుఁ డింకొకటి నిర్ణయించును. కార్యమునుండి కార్యమునకు మనమనస్సులు దైవయత్నముచే నాకర్షింపఁబడును. ప్రప్రథమమున సున్నీలకును షియ్యాలకును గల యంతర్భేదములను వారించుటకై యీసభ లారభింపఁబడినవి. క్రమముగా నన్యమతావలంబకులకుఁ గూడ నందు స్థానమొసంగుట కేవల మీశ్వరకల్పన మని చెప్పకతప్పదు. దానితో

నాయభిప్రాయము వృద్ధిఁజెంది తుట్టతుద కీర్తిని బరిణమించుట యెంతయును వర్ణనీయము. ఈనూతన మత స్థాపననుగురించి మీయభిప్రాయమేమి ?

చంద— నామన స్త్రీసభలచే సంపూర్ణముగా నూఁజిపోయినది గాని యిది యందఱకు సమ్మత మగునా ? వారు వచ్చి నూతనమతములోఁ జేరుదురా ? జ్ఞానము గలవారికిని బండితులకును నిది త్వరలో సమ్మతము గావచ్చును గాని మూర్ఖులకును విద్యాగంధము లేని వారికిని నింత వేగ మిదిమనస్సున కెక్కుట గష్టము. అయినను గాలముతో వారును మార్పుఁ జెందుదురు.

ఫైజీ— మూర్ఖతయే శిరణ్యము గాఁగల జనసామాన్యమునకిది యెక్కుట చాల కష్టము. ఇంతకును మతాభిమాన మను పేరు పెట్టి నానావిధముల బ్రజలనుండి ధనము లాగుచు డంభముతో దిరుగు పురోహితులును, బూర్వాచారపరాయణులును, మతగురువులును మనకుఁ బ్రబలవిరోధులు. ఈమతము వరుసగా నిద్దఱుముగ్గురు చక్రవర్తులకాలముతో గౌరవముఁ జెందినయెడ విశేషము వృద్ధిగాంచునని నాయభిప్రాయము. ఏది యెట్లున్నను మనముమాత్రము మొదట జేరవలయును.

చంద— నిన్న నింకను మనమతవిషయికమైన యభిప్రాయములు మొలక లెత్తినవి. తత్సంబంధమగు నిబంధనల నన్నిటినిదయారుచేసినతరువాత నందు చేరుట కేయభ్యంతరము గలదు?

ఫైజీ— ఆమాట కేమి గాని క్రైస్తవమతగురు వగుమాన్యాస్టని మీరు గమనించియుంటిరా! సమస్తజనులకును దయచూపించుటయుఁ బ్రపంచాభివృద్ధికి సంపూర్ణముగా నాత్మసమర్పణ మొనరించుటయును వారిమతధర్మములుగదా! అట్టిధర్మములు గలిగి యేసుక్రీస్తుచే బోధింపఁబడిన మతమునకు గురువై యుండియు నాతఁడితరమతముల నేల యంతకర్ణకఠోరముగా నిందించెను?

## ఇరువదియాఱవ ప్రకరణము

### జ్వలనము

చందనదాసు సైజీగృహమును వీడి యింటికిఁ బోయినదినముననే సుమారు పదకొండుగంటలవేళ రహీము తనయింటిలోఁ గూర్చుచుండెను. తన చొక్కా జేబులో నున్న యొకయుత్తరము నాతడు దీసి పరీక్షించుచుండెను. దానిపై లక్కోటా వేయఁబడియుండుటయు, పైని సైజీగారికి అని విలాసము వ్రాయఁబడియుండుటయుఁ జూచినతరువాత నందేముండునో చదువవలయుననుకుతూహలము రహీమునకు బుట్టెను. న్యాయముగా నాయుత్తరము సైజీకిఁ బంపవలసి యున్నను లోనున్న కుతూహలముచే నాతఁడు లక్కముద్రను జించి లోనిసంగతులను జదువుటకుఁ బ్రారంభించెను. చదువుచున్నకొలఁది నాతనిముఖవికాసము మాఱుచునే యుండెను. కన్నులెఱ్ఱవాఱఁజొచ్చెను. ఒడలు గజ మఱచెను. కటువు లదరుట కారంభించెను. లేఖ నంతను బూర్తి చేసి క్రిందనున్న "చందనదాసు" అను నక్షరములఁగూడఁ జదివి యాలేఖను విసర్జించెను. శరీరమంతయు నుద్వేగముచే వడఁకుచుండ లేచి యిటు నటు దిరుగ నారంభించెను. లోన మండుచున్న యగ్నిపర్వతమునుండి బయల్వెడలు నుష్ణవాయువులవలె నాతనిశ్వాసము నిప్పులు గ్రక్కుచుండెను. శ్వాసమును ద్వారగా విడుటచే వక్షఃస్థలము ముందునకు వెనుకకుఁ గూడఁ జలించుచుండెను.

"ఔరా! నాకీతఁడు సైతానువలె దాపురించెను. తొలుతనుండియు నీతఁడే నాయున్నతికి విరోధకముగా నున్నాఁడు. మొదట నాకచిన్నయుక్తిచే నన్నోడించెను. యుద్ధమునందుఁగూడ నాకడ్డు వచ్చెను. నన్నుఁ జంపుట కెదురుగాఁ గత్తికట్టివచ్చినవారును నింత యుపచారము నాకొనరింపలేదు. వారిని జూచినను నాకింత యాగ్ర

హాము లేదు. వాఁడు బంతియాటయందుగూడ నాకష్టమివిలి చక్రవ
ర్తియొక్క సదభిప్రాయమును సంపాదించెను. సద్దయు స్వోగమునకు
వచ్చియుండిన నన్నామె వివాహ మాడుననుగదా! యక వేదియుండ
నితఁడే నా కష్టముగా గావలయునా! ఛీ! ఈశ కి దం శిక్ష వొనరిం
పవలె, నాకుఁ గన్నార నిద్రపట్టవలె! ఏమిచేయ జాలను? దేనికిని
సార్వభౌమునకును వైరమొల్లు గూర్పఁగల్గుదును? రాజసభయందలి
ముఖ్యోద్యోగు లందఱు నీతనికిఁ బరిచితులు. అంతియేగాక యీతఁ
డెప్పుడును వారి వెనుకఁ దిరుగుచుండును. నాకట్టిప్రేమ నాతనిచ్ఛల
వెనుకఁబోవదు. నేనును వారివంటి యుద్యోగి నైనప్పుడా నీచుల వెంట
నేల దిరుగవలయును. ఆతఁ డెక్కడనో పల్లెటూరిలో నెవ్వరియింటనో
జనియించెను గావున నిట్టినీచత్వ కొప్పుకొనెను. వానివంశముయొక్క
నీచతను వాఁడే చెప్పక చెప్పుకొనుచున్నాఁడు. ఉంతనికిని పైజీకిని భేద
ముగూర్చుట విశేషము గష్టము. నేనున్నతోద్యోగమున నుండి
కులమువాఁడనైనను పైజీ యొకనాఁడైన నన్నుఁ బలుకరింపఁడు.
తొలుతఁ బలుకరింపనివానిని నే నేల పలుకరింపవలయును.

ఇట్లాతఁ డేమియో లోపల ననుకొనుచుండఁగా దలుపు
దెఱచుకొని లోని కెవ్వరో వచ్చిరి. ఎవరు వారని రహీము ప్రశ్నిం
పఁగా నానూతనవ్యక్తి నేను రామబాయి నని జవాబు చెప్పెను.
వివాహవిషయమున సలహా చెప్పుచుండుటచే రామాబాయి కీతనికడ
విశేషముచనవు గలదు. రహీమున కామె యందు నెంతయో విశ్వా
సము. తప్పక ఫహ్మీదా నామె వివాహమున కొప్పుకొనఁగల దని
యాతనికి గట్టినమ్మకము. మేడపై కామె వచ్చినవెంటనే యాతఁడు
దనచేతిలోని యుత్తరము నొసంగి యందలియభిప్రాయమును దేట తెల్ల
ముగాఁ దెల్పెను. అది విని యామె యించుక సేపు మోము వాంచి
యిట్లుపలికెను. నిజముగా నీయుత్తరము నాతఁడు వ్రాసియుండవచ్చును.

యితఁడు నైజాంగారికి బలముగా వచ్చునప్పుడు పోవుచు నింటివద్ద ష్యునివలె వర్తించుచుండును. ఈతఁ డామె నొకసారి యుద్ధసమయమున రక్షించె నని కూడఁ జెప్పుచు చెప్పితి. ఉదయమున నైజీకిని ఉదనగాసునకును జరిగినసంభాషణ వినియుంటిని గాని యాప్రసక్తి యెందు గాలేదు. ఈతఁ డిట్లు ప్రయత్నము చేయుట మనకు క్షేమకరము గాదు.

రహీం—ఇట్టియన్యాయమున కీతఁ డొడఁబడునేమో యని నే నూహించుచునే యుంటిని. గాని నీవు చెప్పుటచేతను, నాయభిప్రాయమును బలపఱచుకొనుటకుఁ గావలసిన నిదర్శనములు మరల లభింపకుండుటచేతను నాయూహను మరల్చుకొనవలసినవాఁడ నైతిని. ఈతనికిని నైజాము ప్రజలకును గల మైత్రి సర్వవిదితము. వీనిని గాంచిన యెడల జక్రవర్తికిని నెంతయో విశ్వాసము. వీఁడు ఫహీమీదాను గోరుచున్నట్లు నైజీకిఁ దెలిసినయెడలఁ దప్పక యామెను వాని కొసంగునేమో యని నాభయము.

రామా—ఆహా! మీ కాభయము వలదు. మాయక్క వానిమనస్సు నాకు బాగుగాఁ దెలియును. ఈతనిఁ బెండ్లిచేసికొనుట కామె యొప్పుకొనదు. ఆ జాగ్రత్త నేను చూచుకొనెదను గాని మొత్తముమీఁద నీతఁడు నీకు మంచివాఁడు గాఁడు. ఎట్లైనను నీవు సమయము గాంచిన గాని నీయభివృద్ధి కాటంకము తొలఁగిపోదు గావున నట్టికార్యమునకుఁ దగు నేర్పాటులు నీవు చేయవలయును.

రహీం—ఏమి చేయుటకో నాకుఁ దెలియుటలేదు. ఎదురుగాఁ బోయి వానిని కత్తితోఁ బొడిచి వత్తును. అప్పుడు నాకడ్డు దగులుట మాని వేయును.

అని చెప్పి గోడకు దగిల్చిన ఖడ్గమును రహీము చేతితోఁ దీసికొనఁగా రామాబాయి వానితో నిట్లనెను.

భావకిరణము లప్పుడప్పుడు మొలకలెత్తు హృదయసీమవలె, నక్కడక్కడ గన్పట్టు నొక్కొక్క నక్షత్రముదప్ప శూన్యమైన యాకాశమునందు దృష్టినిగిడ్చి, మనసు నాలోచనాప్రవాహమునఁ బడఁద్రోసి ఫహ్మీదా కూరుచుండెను. ఉదయము రహీమునింటిలో జరిగిన సంగతి యంతయు స్మృతికి వచ్చుటచే రామాబాయి యేదోమిషపై పహ్మీదా వివాహవిషయము నెత్తవలయు నని తలఁచి యామెపాదములకడఁ గూరుచుండి యామెతో మాటలాడుటకు వేచియుండెను. రామాబాయి యింటినౌకరైననుగూడ నామె కక్కడివారితో మంచి చనవుగాని, యింటివ్యాపారములయందు ప్రవేశముగాని లేదు. ఉదయమునను సాయంకాలమునను నియమితకృత్యములను పూర్తిచేసికొని యింటికిఁ బోవుచుండును. పహ్మీదా రామాబాయితో నెప్పుడును దనస్థితినిగుఱించి మాటలాడదు. సైజీతో పారస్యముగుఱించియుఁ గవిత్వమునుగుఱించియుఁ గడపుకాలము పోఁగా మిగిలిన యల్పకాలములోఁ గొన్నిపుస్తకములను తనంతట తానే చదువుకొనుచుండును. లేనియెడల మనోహరముగాఁ బాడుకొనుచుండును. సైజీ ఫాజలుల భార్యలతోఁగూడ నీమె విశేషము మాటలాడు స్వభావము గలది గాదు. అట్టిసందర్భమున రామాబాయికి పహ్మీదాకడఁ జనవు లేదని వేఱె చెప్పవలయునా! పహ్మీదా మనస్సౌధములలో విహరించుచు బాహ్యప్రపంచమును మఱచి తన్మయత్వమును జెందినప్పుడు రామాబాయి రెండుమూఁడుసారు లీతఱుణము దు, తీరికతో నున్నదని యెంచి మాటలాడుటకుఁ బ్రయత్నించెను గాని, యామెచే కసరులు దిని వెడలిపోయెను. ఈ సందర్భమునఁగూడ రామాబాయి జడియుచునేవచ్చి యామె కాలికడఁ గూర్చుండెను. తరువాత మెల్లఁగా సంభాషణసూత్రమును లాగ మొదలుపెట్టెను.

రామా—అమ్మా! నీవెల్లప్పుడు నేదో చింత యొనర్చుచునే యుందువు. ఇట్టివయస్సున నీమనస్సు చింతాక్రాంతమై యుండుట

యేల ? సర్వసౌఖ్యముల ననుభవింపవలసిన యౌవనమున నుండియు నెన్నఁడో యీడుతీఱిన ముసలివారివలెఁ గూరుచుండు వేల ?

పద్మ:—ఇదా చాల గంభీరమైన హృదయముగల స్త్రీయగుటచే దనహృద్గతభావముల నెవ్వరికిని దెలుపక, వికసించని తామరమొగ్గ నిజసౌరభము నెట్లు లోలోన నణఁచి వేసికొనునో, అట్లే మాటి వేయును. రామాభాయి యడిగిన ప్రశ్నకుఁ సంభాషణము చాలింపఁ జేయు జవా బేదో యిచ్చి యుండవలసినదే గాని యీనాఁడేకారణముచేతనో విశేషము సంబంధము లేకున్నను నామె ప్రశ్న కీరీతిగా జవాబు చెప్పెను.

పద్మ:—పుస్తకములే నాకు శరణ్యములు. అందీప్రపంచమంతయు నద్దములోవలెఁ బ్రతిఫలించుచుండును. వానిఁ బఠించుచుండుటవలన నా కెన్నఁడును దుఃఖము గలుగక శాంతియే కల్గుచుండెను. వ్యాపకములేక సోమరులై కూరుచుండువాని కెప్పుడు నేదో విచార ముండియే తీరును. సర్వదా కార్యాపహృతమానసులైనవారి కాశలుగాని దుర్మార్గములగు నాలోచనలుగాని కలుగఁబోవు. ఆకారమున, నేనెల్లప్పుడును గ్రంథపఠనముననే కాలముపుచ్చుచుందును.

రామా:—నీకు వయస్సుమాడఁగా పాతికసంవత్సరములకంటె నెక్కుడు లేదుగదా! ఈకాలముననే యిట్టివైరాగ్యము పుట్టనేల ? ఇంతకంటెఁ జిన్నవయస్సునందు పెండ్లిచేసికొని యొండలో భర్తలతోఁ గాపురము చేయుచుండఁగా నొకసన్న్యాసినివలెఁ బువ్వులనైనఁ దాల్పక మంచిఫలాహారములనుగూడ నొనరింపక యెప్పుడును బుస్తకములతోనే కూరుచుందువు. ఇది నీవయస్సునకును రూపమునకునుగూడఁ దగనిపని. నిన్నుఁ బెండ్లియాడుట కెంతమందియో ధనికులు. రూపవంతులు, నుద్యోగులుగూడ వెంటనే యొప్పుకొందురు. అనుకూలుఁ డగువాని నొకనిఁ బెండ్లియాడి సర్వసౌఖ్యముల ననుభవింపక యిట్టి

గుడ్డలను వేసికొని భోజనమైనను బూర్తిగాఁ జేయఁ నోఁటికి జిక్కఁగా యెడవు. భోగముల కాస్పదమైన యవ్వనము తొలఁగిపోయినతరువాత నెవ్వరును ననుభవింపనగునది లేదు. పూర్వకర్మ విశేషముచే యందఱును దానిని గాంచి సంతసించుచుండఁగాని యున్నవారికి నాయట్టుల సిద్ధముగా నున్నప్పు డెవ్వరికిఁ గావలెను? ఇంతవఱకు నిట్టి యుచిత వివాహము లేక పోవుటచేతనే వచ్చుచున్నదని నేనూహించెదను. వల్లె యనిన యెడల నీకుఁ దగిన వరుని సుగుణసంపత్తి గలవానిని, చక్రవర్తికొలువులో గౌరవనీయ మగు నుద్యోగమునం దున్నవానిని, సాటికులము వాని నొకనిని దెచ్చి యొకసముహూర్తములో నీపాదములకడఁ బడ వేయుదురు.

ఫహ్మా — రామాబాయి! నాకు వివాహముకంటెఁ బుస్తకములే బాగుగా నున్నట్లు దోఁచుచున్నది. వివాహ మొనరించుకొని యెడల మగనియిష్టానిష్టములతో సంబంధించిన సుఖదుఃఖములను మన మనుభవింప దప్పదు. అట్టి సుఖదుఃఖానుభవము గ్రంథపఠనమునందుండదు. ఇష్టములేనివాని నెవనినో కట్టుకొని వానితో మనస్సుగలియక యెన్నియో బాధలు పడుటకంటె బ్రహ్మచారిణిగా నుండుట మేలు. పరమేశ్వరుని ధ్యానించుకొనుచు, సృష్టివైచిత్ర్యములఁ గాంచుచు, మహాత్ముల పాదధూళి శిరమునఁ దాల్చి, యన్యచింత లేక కాలము గడపుటకంటె నుత్తమ మేదియు లేదు.

రామా — అమ్మా! నీవు బ్రహ్మచారిణిగా నుండు ననిపల్కినపల్కులు వినుటకు నాకెంతయు విచారము గల్గుచున్నది. ఏవయసునకు దగిన పనులా వయసునఁ జేయవలసియున్నది. ఇంతకును బెండ్లిచేసికొనకుండు తప్పు నీయది గాదు. నీకుఁ దల్లిదండ్రులు లేకపోవుట యొకగొప్పలోపము. నిన్నుఁ జిన్నవయసునుండియుఁ బెంచి పెద్దదానిని జేసిన ఫైజీ ననుసరించి, యాయనపిచ్చిలో మునుఁగుచుండువు తన గ్రంథములు, రచన, మొదలగువానినడుమ నీవివాహముమాట

యాతనికి జ్ఞప్తి యుండదు. నీవు నైజీ మొదలగువారెంత గావలసిన వార లైనను పెనిమిటిబిడ్డలవంటివారు గా రని తెలిసికొనుము. నీ వొక ధనికుఁ డగుమహమ్మదీయునిఁ బెండ్లియాడి, యెప్పుడును బిల్లలతోను నైశ్వర్యముతోడను దులఁదూగుచుండఁగాఁ జూడవలె నని యున్నది.

ఫహ్మా—రామాబాయి! చిత్తమునకు శాంతి లేనప్పుడు ధనముతోఁగాని బిడ్డలతోఁ గాని పనియేమి? వారందఱును దృప్తికిఁ గారణము గారు. నిరతముగా బ్రహ్మచర్యము నవలంబించుటకే నేను నిశ్చయించితిని.

రామా—అమ్మా—నీవు చదువుకొనినదానవు. నీ వెఱుఁగనిది లేదు. నాకుఁ దోఁచినది చెప్పితిని. నీమాట లేమియు నాకర్థము గాలేదు. నాకుఁ దోఁచినది చెప్పితిని. నీమాట లేమియు నాకర్థముగా లేదు. పైని నీయిష్టము.

ఇట్లు చెప్పి చీకటి యెక్కువగుటచే సెలవు దీసికొని రామాబాయి తనయింటికిఁ బోయెను. చీకటి యలముకొనుటకుఁ దోడుగా నాకాశమున నక్కడక్కడ మబ్బులుగూడఁ గప్పుచుండెను. ఆమబ్బులసందులనుండి నక్షత్రములు ఫహ్మీదా మొగమును దొంగి తొంగి చూచుచుండెను. ఆచీకటిలో మందిరము వెనుకఁ గూరుచుండి ఫహ్మీదా తనభావికాలస్థితిని యోజించుకొనుచుండెను.

'ఆతఁడు బ్రాహ్మణుఁడు విశేషించి పూర్వాచారపరాయణులలోఁ బెరిఁగినవాఁడు. నన్నుఁ బెండ్లిచేసికొనుట కట్టివాఁ డొప్పుకొనునా? రూపముననను, విద్యచేతను, సామర్థ్యమునందును నాకంటె నాతఁ డెంతయు నధికుఁడు. విశేషించి మత మనునడ్డంకి యొకటి యాతనకుఁ గలదు. ప్రపంచమునందలి సర్వచరాచరజీవకోటికిని సృష్టికర్త యొక్కఁడేగదా? ఆతనికి బిడ్డలైన మానవులయం దన్నికు

లములు నిన్ని భేదములు నేల యుండవలయును? ఈయంతర్భేదముల
వలన నొకింతయు లాభము లేకపోవుటయే గాక, దుఃఖమునకుఁ గారణ
ములై యవి మానవసంఘమునకుఁ గలఁతలను దెచ్చిపెట్టుచున్నవి.
అయినను బండితులుగూడ కులభేదములను విడువఁజాలనప్పు డేమి
యొనరింపవచ్చును? ఆయన ప్రప్రథమమునఁ గొంచెము ప్రేమాస్పద
ములగు నవలోకనములను బఱపుచు దయామయమైన హృదయమం
దలి భావములను దెలుపుడుచేయఁజొచ్చెను గాని. కాలక్రమమున
నీవైపు వచ్చుటయే మానుకొనెను. మనఃపూర్వముగా పరిణయించిన
వరుఁడు లభియింపనియెడ శాశ్వతబ్రహ్మచర్యమే శ్రేయోదాయ
కము. శిరీషకుసుమపేశలమై, సుధామధురమై, చెన్నొందు, నా యువ
మధురోక్తులను వీనులార వినుటకు నోచుకొనలేను. సౌందర్యాత్మ
తాండవమాడుచుండు నాముఖసీమనుండి వెడలుచుండు కనుచూపు
లచే నాశరీరము పవిత్రము గానేరదు. విద్వాంసుఁడు, సుందరుఁడు,
పరాక్రమశాలి, యౌవనవంతుఁడు — ఇన్నిగుణము లాతనియం
దున్నవు డట్టివాఁడు లభియించునా! అది వట్టికల్ల! ఆజన్మాంతమును
బ్రహ్మచర్యముతోడనే కడపుదానను. జ్ఞానము వచ్చినది మొదలు
నాకు విద్యనేర్పిన ఫైజీయే సోదరుఁడును గురుఁడును. ఆయన వ్రాసిన
గ్రంథరాజములఁ జదువుకొనుచు పూర్వకవుల భావసముద్రములలోఁ
గొంతకాల మోలలాడుచుందును. ఛీ! అందనిపండ్లకై యఱ్ఱులు
సాపుటవలనఁ బ్రయోజన మేమి! ఏనాఁటికైన నేను గోరినఫల మం
దునా! వట్టిభ్రమ. పరాత్పరుఁడే నాకు శరణ్యుఁ డయ్యెడుఁగాత!
మహమ్మదు ముఖమునుండి యీశ్వరుఁడు వచించిన పల్కులను
దలఁచుకొనుచుఁ గాలము పుచ్చెదను. హృదయపూర్వక మగు
ప్రేమకు స్థానమైన వాని కర్పింపలేని యీదేహమును జిత్తమును
నీశ్వరునికే యర్పింతును."

అని యనుకొనుచు నాసుందరి యాకాశమువైపు చూచుచుం డఁగా, మేఘావృతమయ్యును నందొక నక్షత్ర మఖండముగాఁ బ్రకాశించుచుండెను. దానిం గాంచి మరలఁ దనమనస్సునందలి భావదూలికను స్మరించెను.

"అపారమగు నంతిరాశిమునఁ దిరుగుచున్నది. ప్రపంచము నందలి యాశలును, మోహములును, సుఖదుఃఖములును దానికొనైన నంటజాలవుగదా! చుట్టుప్రక్కలనున్న మేఘమాలికలు దానిపొంతకైనఁ బోలేదు. ప్రశాంతిమై యున్న దానిచాలనము నాకంత శాంతిని బోధించుచున్నది. ఆనక్షత్రములలో నెక్కటిమైపోయి యుండినయెంతి బాగుండును. అప్పుడు పరమేశ్వరుని తేజఃప్రవాహము నాపైఁ బడును. దానఁ బరిపూతనై ప్రతిహతాశలు గల తనువువీడి, చలించుచుఁగూడ నచంచలముగా నుందును. తీరనికోరిక లావ్యక్తికి లేనే లేవుగదా! సంగదోషమువలననే బంధములు జనించుచున్నవి. ఆబంధములు లేకుండ, నిశ్చలమై, స్థిరమై, నిర్వికల్పమైన యానక్షత్రమందు నాయంతిగాత్మ లీనమై, యీమనస్సునకు సంకల్పశక్తి లేకుండు నెడల నెంతయు నదృష్టవంతురాలను. ఎవ్వనిఁ బ్రేమించితినో వానికిడఁజాలని యీశరీరమును దుచ్ఛముగా మతియొకని కర్పింపనా! ఈశ్వరా! నీకే యర్పింతునుగాక!

---

# ఇరువదియెనిమిదవ ప్రకరణము.

ఆహాయము.

రాత్రి సుమారు తొమ్మిదిగంటలకు భోజన మొనరించి చందనదాను బయటికి వెడలి నలుదిక్కులఁ బరికించుసరి కాకాశ ఘంటయు

మేఘావృతమై, భూమి యంతయు నంధకారబంధురమై యుండెను. కృష్ణపక్షపు రాత్రి యగుటచేఁ జంద్రుఁడు పొడసూపుటయే లేదు. అక్కడక్కడ నున్న నక్షత్రములుగూడ దట్టమైన మేఘమాలికచే సంపూర్ణముగాఁ గప్పఁబడి, కటికిచీకటి యావరించుకొనెను. "ఈ చీకటిలోఁ బోవుటా? మానుటా? నిర్ధారణచేయవలెను. రేపు ప్రొద్దునఁ బోయి కార్యము చక్కఁబెట్టుకొనవచ్చును. అని యనుకొనుచు నింటిలోనికిఁ బోయెను. ఉదయము పైజీకీయవలసిన లేఖ నెచ్చటఁ బెట్టితినో యని యాతఁడు దనయిల్లంతయు గాలించెను గాని యది గనుపింపలేదు. "ఎక్కడనైనఁ బాఱవేసితినిగాఁబోలు! నేనుదయము మార్గమధ్యమున జేబు నొకసారి సవరించుకొంటిని. అప్పుడు జాఱిపడె నేమో! దొరకినవా రెవ్వరైనను దానిని జదివినచో—అపాయ మేమి? తెలిసిన తెలియనిమ్ము. అల్లుండదు. లకోటాచేసి పైవిలాసము వ్రాసినసంచి నెవరు చింపుదురు. ఎవరికి దొరకిన వారే పైజీ సాహెబున కందఁజేతురు. ఈవిషయమున జంక నక్కఱలేదు. అయినను సాయంకాలము యమునానదీసికతాతలంబున విహరింపఁబోయితిని గాని ముఖ్యమైన యిక్కార్యమును విడిచివేసితినిగదా! పోనీ, రేపు మఱియొక లేఖ వ్రాసికొని పోవచ్చును" అని తలఁచి చందనదాసింటి లోనికిఁబోయి కొంచెముసేపటి నిట్టుఁ బ్రచారముచేసి యేమియుఁ దోఁచకుండుటచే మరల నిట్లు తలంచెను. "పోనిమ్ము. పోయియే వచ్చెదను. ఆయుత్తరము వారి కందియే యుండునేమో! రాత్రి వచ్చెద నని చెప్పియుంటిని గాని మామూలుమాట యని యాతఁ డెంచుకొనియుండకుండునా! ఏది యెట్లున్నను రాత్రి యిప్పుడింటికడ నుండి యేమిచేయవలయును? కొంచెము తిరిగివచ్చినమైన నుండును" తరువాత నాతఁడు దనయంగీని దాల్చి, పాదరక్షలను దగిల్చి పైనొక ధొవ్వలైవేసికొని చీకటియైనను పరిచితమగు మార్గము గావున మెల్లఁగా

నడచుచు బయలు దేఱెను. ఆకాశమంతయు మబ్బులచే నలముకొనఁబడి యంధకార మినుమడించి యుండెను. కొంతదూర మాతఁడు పోవుసరికి మార్గమునకుఁ బ్రక్కనున్న యొకపెద్దయింటినుండి వెలుతురు వీధిలోనికిఁ బడుచుండెను. ఆవెలుఁతురునకుఁ గనుపట్టుచున్న నీడలు మనుష్యు లచ్చోఁ గూరుచున్నట్లు చెప్పక చెప్పుచుండెను. చీకటిగా నుండుటచే జనసంచారము లేనివీధులు ప్రశాంతతను జాటుచున్న యాసమయమున, నొకమనోహరమగు గానమచ్చోట వినఁబడుచుండెను. ఆగానసుధ ననుభవించుటచే ననిర్వాచ్యమగు నానందము చందనదాసునకుఁ గలుగఁ జొచ్చెను. తద్రసానుభూతి గలుగుచున్నకొలఁదియుఁబవిత్రభావప్రరోహములుహృదయసీమయందుద్భూతములుగాఁదొడఁగెను. అయఃకాంతముచే నీడ్వఁబడు నినుమువలె మనస్సును దనపై పాకర్షించుకొను శక్తిగల యాగీతము పాడుచుండు చోటునకుఁ బోవనెంచి, చందనదాసు ముందునకుఁబోవుచు వీధియందుఁబడుచున్న వెలుతురును జేరి నిలువఁబడెను. దీపములచేఁ బ్రకాశించుచున్న యాయింటియరఁగులపై నెందఱో పురుషులు కర్ణాంజలుల, గీతామృతమును గ్రోలుచుఁ గూరుచుండ, వారినడుమ నొక్కవ్యక్తి, నడిమివయసువాఁడు, దృఢమైన కాయముగలవాఁడు, కూరుచుండి హిమాలయదరీకుహరమునుండి వెల్వడెడు గంగాప్రవాహమువలె, గానమాధురిని వెల్లివిరియఁ జేయుచుండెను. శబ్దరూపమున వెల్వడిన యాశక్తి యంతరాళమున వ్యాపించి గాలిలోని యణువులను దాండవింపఁజేయుచుండెను. ఆపురుషునిముఖమును జూచినవెంటనే యక్కడ స్వేచ్ఛావిహారము సలుపుచున్న పవిత్రత, మూర్తీభవించిన భక్తియుఁ బుంజీభూతమైన తన్మయత్వమును పాంథుల నరికట్టుచుండెను ఆనయనములనుండి వెడలుచున్న తేజఃప్రవాహములు భక్తిసరతరంగములలో లీన మగుచుండెను.

ము; మున కడుగువైచుట మాని చందనదాసచ్చట స్తంభించి తదేకదృష్టితో నాపాట నాలకించుచు నిలువఁబడెను. ఆతఁడు గాన మొనరించుచున్నది. రామాయణము. ఆహాహా! ఆతఁడు వచియించు చున్నవి మాటలా! యమృతంపు తేటలా! సులభమై, నిర్మలమై, సాఁగి పోవుచున్న కవిత్వధోరణి యెవ్వరిది? బంగారమునకుఁ దావి యబ్బి నట్లు, సుగంధయుక్తములైన మలయపవనాంకురముల కాస్వాదనీయ మైన మాధుర్యము గలిగినట్లు. సహజసౌందర్యరాశి కొక యచ్ఛమైన ముక్తాహార మలంకరించినట్లు, అసాధారణరూపనిర్మాణచాతురీధురీణుఁ డైన శిల్పిశేఖరునిచే నిర్మింపఁబడిన మనోహరవిగ్రహమునకు జీవన మొసంగినట్లు గీతనారాగముచే నెత్తియు సొబఁగడుచు వీనులపైఁ బడుచుండెను. పైని నిలువఁబడియున్న చందనదాసును గాంచి యా యింటియజమాను "డయ్యా! ఎవ్వరో బయట నిలువఁబడినట్లున్నది. దయచేసి వచ్చి కూరుచుండుఁడు." అనెను. తాను పోవుచున్న కార్య మును సర్వము మఱచి, యా పిలుపుతో నాతఁడు డరుగుదెంచి వారి చెంతఁ గూరుచుండెను. రామాయణకథాసారముమాత్రము, నిర్మల మై, మధురమై, పావనమై యొప్పు పాల్కడలిలోని తరంగములవలె, వినువారిహృదయసికతాస్థలంబులపైఁబడి, యక్కడియర్థమునుదనలో లయ మొదరించుకొనుచు నెక్కడికో కొనిపోవుచుండెను. ఆపురాణము వినుపురుషపుంగవులకు, బాహ్యవస్తుజ్ఞానము, కాలచలనము, అన్య కార్యవిషయిక జిజ్ఞాసయు నంతర్హితమై మనఃప్రభ యంతయును కుంభగతమైన దీపప్రభవలె నొప్పుచుండెను. పాడుచున్న యాతఁడు కౌపీనముతో సమానమగు నొకచిన్నవస్త్రమును దాల్చియున్న, నంగ మున స్ఫురించుమహానుభావత్వమునకుమాత్రము లోటు లేదు. చదు వుచున్నఘట్టము నాతఁడు పూర్తి యొనర్చునప్పటికి పండ్రెండుగంటలు పైఁబడెను. పురాణశ్రవణమైనతరువాత నింతమధురమైన గ్రంథము

నీభాషలో వ్రాసినవా రెవ్వరు?" అని చందనదాసు ప్రశ్నించెను. "వీరు కవిచక్రవర్తులగు తులసీదాసుగారు. ఈరామాయణమును వీరే రచియించుచున్నారు. గ్రంథముపూర్తి కాకున్నను, దన్మాధుర్యమును మాకుఁ గొంచెము చవిచూపింపవలయు నని చదివి విన్పించుచున్నారు. కవియే నిజగ్రంథమును జదువుచుండఁగా వినునంతటి యదృష్టము గలుగుటవలన మన మెంతయుఁ బవిత్రుల మైతిమి." అని యాప్రశ్నకు గృహయజమానుఁ డుత్తరమిచ్చెను. చందనదాసు తులసీదాసునకు భక్తితో నమస్కరించి యింటికిఁ బోవుటకు బయలు దేఱెను. గాని పొడుచుకొన్ననుగూడ కన్నులు కానరాని యాచీకటిలో సామాన్యుఁ డగువాఁడు దిగ్భ్రమఁ జెందవలసినదే. ఎంతచీకటియైనను గొంతసేపు కన్నులలవాటుపడినతరువాత దృశ్యములీల లైనను కన్నులకుఁ గనుపట్టక తప్పదుగావునను మార్గము సుపరిచిత మగుటచేతను జందనదాసు ముందునకుఁ బోవుచుండెను. సందులపై వచ్చు సందులలోఁ బడి పోవుచుండఁగా నొకచోట చిన్నచప్పుడు వినిపించెను. సహజముగ మంచిధైర్యశాలియు, బలవంతుఁడును నగు చందనదాసా చప్పుడునకు జడియక తత్కారణ మరయఁగోరి ముందునకంజవేయుట మాని నలుదిక్కులఁ బరికించుచు నిలువఁబడియుండెను. అప్పు డాతనిముం దొకమానవుఁడు బెద్దకఱ్ఱ నెత్తికొని నిలువఁబడినట్లు తోఁచెను. ఆకఱ్ఱతో శిరముపై నాతఁ డొక్క పెట్టుఁ బెట్టుచుండఁగా నెంతధైర్యశాలియో యంత చుఱుకుగలవాఁడు గావునఁ జందనదాసు. కఱ్ఱయొక్క పతనమును గ్రహించి చంగున నెగిరి తప్పించుకొనెను, వెంటనే రెండుప్రక్కలనుండియు నిరువురుచొప్పున మోటకత్తులను దాల్చి నల్లని మనుష్యులు వచ్చి నిలువఁబడిరి. ఆ నిలువఁబడినవారు యమభటులను జ్ఞప్తికిఁ దెచ్చుచుండిరి. వారిని గాంచినతోడనే చందనదాసునకు మనోమండలమున నొక్కసారి

మెఱపు మెఱసినట్లు చిన్నప్పుడు విన్న భూతములకథలు, దయ్యముఁ ముచ్చటలును స్ఫురించెను. రాత్రియం దున్న యీయంధకారమును, నొంటిపాటును, మనస్సునందలి యన్యచింతయు, వ్యక్తుల మాహాత్మ్యానుభవదర్శనమును నట్టి యభిప్రాయమును గల్గించెను. గాని మెఱపు వలెనే యది గతించెను. ఎదుట గన్పించెడు స్థూలము లగు నాకారములును, వారిచేతుల నుండు నాయుధములును, వారి యుద్యమమును గలసి యాతని చుఱుకుఁదనమును బురికొల్పి లేవఁదీసెను. నలుగురును గలసి చుట్టువేసినను లేడిపిల్లవలె గెంతివచ్చి యాతఁడు తప్పించుకొనెను. ధైర్యము తక్కువయై యుద్ధములపరిచితి లేక వీరుఁడుకాని సామాన్యమానవునకే యీచుఱుకుఁదనముండి, యిట్టి యవస్థవచ్చిన యెడల వెనుదిరుగకుండఁ బరుగెత్తి ప్రాణరక్షణకై పాఱితీరును. చందనదాసునకు మాత్రము పాఱునూహ దట్టలేదు. ఎంతమంది యుండిరో, దానెట్టిస్థితిలో నుండెనో, వారేమి చేయఁదలఁచుకొనుచుండిరో మొదలగు విషయముల నొక్కపర్యాయము నూచినఁగాని యాతఁడు పాఱిపోవువాఁడు గాఁడు. ముందువచ్చినవాఁ డొకఁడును, రెండుప్రక్కల నుండి యురుగుదెంచినవా రిరువురునుగాక వెనుక నిరువురుగూడ నుండిరి. వారిని గుర్తించెను గాని చేత నాయుధమైన లేదు. ఆతఁ డేమి చేయఁగలఁడు? "ఓరీ! నన్నుఁ జంపిన మీకేమి లాభము? నన్నుఁ జంపుటయే నిజముగా మీరు గోరుచో నాకొక కత్తి నిచ్చి కావలసినయెడల మఱి యిరువురను సాయము దెచ్చికొనుఁడు" అని వారిని గాంచి చందనదా సనినమాటలను పెడచెవిని బెట్టి యాతనిపైఁ బడుటకు వారు ముందునకు వచ్చుచుండిరి. ఇంతలో ప్రక్కమళుపు నుండి నాలుగుకిరణములు వీరందఱిపైఁ బడెను. కళవళపడుచు నావైపు దిలకించుచుండిరి. అత్యల్పకాలములోఁ బదిమంది రాజభటు లామళుపునుండి వచ్చిరి. వారిచేతికడ నున్న రెండులాంత

దులచే నాస్థల మంతయును వెలిగింపఁబడెను. వచ్చినవారు రాజభటు లని గుర్తెఱింగి, దొంగలు పాఱిపోవుట కారంభించిరి. గాని చందన దాసు 'దొంగలు' అని యుచ్చైస్స్వరముతో నఱచి, పాఱిపోవుచు వారిలోఁ దనకు దగ్గఱ నున్నవాని నొకనిని బట్టుకొనెను. దొంగలను మాట వినఁబడుటతోనే రాజభటు లందఱును పాఱిపోవుచున్న వారి నంటిరి. ఒక్కఁడు మాత్రము చందనదాసుకడ నిలువఁబడి యొరకని వానిని బంధించెను. ఈ యలుపునిని యిండ్లలోని వారు లేచి వీథు ములలోని బయటికి వచ్చిరి. వీధి యంతయుఁ బట్టపగ లయ్యెను. పరువెత్తిన భటు లందఱును గలసి యొక్కనిని మాత్రము పట్టుకొని రాఁగలిగిరి. ఇంతలో నందఱును జందనదాసును గుఱించి యిట్లు చేసిరి "వీఁడు బందిపోటువాండ్రు! వీరిని దీసికొనిపోయి బంధించి విచారణచేయుదురు. తక్కినవారును దొరకగలరు." అను చందన దాసుమాటలను విని యాతనిని వారి యింటికడ నుండి దొంగలను విడిచి, దొంగలను జైలుకడకు రాజభటులీడ్చుకొనిపోయిరి.

'ఏమిది! వీరు కల్లు త్రావిన ట్లున్నారే! నన్ను దోచుకొనుటకు వచ్చినదొంగలా? నాకడ నేమియును లేదే! ఈ ధని గృహము మూలల దాఁగియుండి పట్టణమున నెల్లరను దోచుకొనుచున్నారా! అట్లయిన పురమంతయు నివఱకే మాఱుమ్రోగ నుండదా? ఎక్కడ నుండిన దీపస్తంభములోని దీపమాఱిపోయినది. గాలిచే నాఱియుండునా! లేక యదియు వీరికృత్యమైయుండునా! ఈపట్టణములో నింత మంది రక్షకభటు లతిజాగరూకతతోఁ గాచుచుండఁగా నాపైనే పడి మంది నీచులు పడయత్నించుటయా? అంతయును హాస్యాస్పదముగా నున్నదే! ఆలోచించినకొలఁది నేమియు తేలుటలేదు. నాపై కుట్ర చేయుట కెవ్వరి కేయుపకృతిని నొనరించినవాఁడనుగానే' అని పరిపరి విధముల నాలోచించుకొనుచు నింటికేఁగి పాదప్రక్షాళన మొనరించుకొని పరుండెను.

---

# ఇరువదితొమ్మిదవ ప్రకరణము

## శౌర్యము

నిద్ర యనునది శరీరమానసిక బాధల కౌషధము, గాని మిక్కుటమగు బాధతో నున్నప్పుడు నిద్రపట్టదు. ఆలోచన యధికమై మనస్సునకు శాంతి లేనప్పుడు నిద్ర యనునది యలభ్యము. చిత్తము చింతాభరమున నలఁగిపోవుచుండ శరీరముకూడ నిద్రాదూరమైన నలఁగిపోవలసినదే. తన కార్యముల నన్నిటిని ముగించుకొని రహీము శయ్యపై కెక్కుసరికి రాత్రి మూఁడుగంటలు దాటెను. మంచముపైఁ బండుకొనిన యాతఁడు మరల లేచెను. ఇటునటుఁ బ్రచారము సల్పెను, దగ్గఱ నున్న కుర్చీపైఁ గూరుచుండెను. మరల మంచముపై కెక్కెను ఏమి చేసినను నిద్ర లేదు. ఆగ్రహము, చింత, అవమానము, ఆశ, అసంతుష్టి, యన్నియు నన్ని ప్రక్కల నాతని చిత్తశాంతిని నుల్చివేయుచుండెను. ఆగ్రాపట్టణమందలి యశేషజనరాశియు నానందసముద్రమున నోలలాడుచు నిర్వికల్పసమాధితోఁ దుల్యమైన గాఢనిద్రయందుండ నొక్క రహీముమాత్రము శయ్యపై నిటునటుఁ బొర్లాడుచుండెను. ఎప్పుడు సూర్యోదయ మగునా! ఎప్పుడు దైనిక కార్యమగ్నత నన్నీ చింతనుండి వెడలనడచునా! యని యాలోచించుచుండెను. ఆతని మనస్సులోని యూహ లన్నియు నిట్లుండె నని చెప్పవచ్చును.

'అయ్యయ్యో! పోయినవారిలో ముఖ్యు లిరువురు పట్టువడిరి. ఇది యంతయుఁ జక్రవర్తికిఁ దప్పక తెలిసియే తీరును. అప్పుడు నామర్యాద నిలుచునా! ఏమి చేయవలెను? ధనము వ్యయమయ్యెను. మర్యాద పోవును. కోరిన కార్యమూ కాలేదు. నాకొఱకుఁ బ్రాణములనైనఁ ద్యజింతు మన్న మిత్రులందఱును గడగండ్లపా లగుదురు,

నాసంబంధమును వారు పైకికి వచ్చియుందిరా నాకుఁ బ్రాణములు
పోవుట తప్పదు. వచ్చియుండకుంటిరా! వారికిఁ దప్పదు. ఎట్టిచిక్కు
తటస్థించినది! ఆదుర్మార్గుని నాశనము చేయఁ లేకపోనా? అది
యసంభవము. దేశమునందంతటను పిరికివాఁడని పేరుపొందితి గాక
లేక తిరుగుచుండు నాకుఁ బిఱికిపంద యని యపఖ్యాతి కూడ వచ్చి
నది. ఎదురుగా నేగి యుద్ధ మొనరించి నాశనము చేయుట మాని
చాటునఁ జంపింప యత్నించినందువలన లాభమేమి? చంపయత్నిం
చినవారు పట్టువడుట, నామిత్రులకు నేనే కష్టములఁ దెచ్చిననాఁడ
నగుట, నాయాశయము కొనసాగకుండుట విశేషించి యపఖ్యాతి.
ఇవిగాక ఉన్నోన్నతప్రాణమానములకు భయము. నేనే తిన్నగాఁబోయి
యాతనికి శిక్ష నొనరించిన నెంత బాగుండియుండును! వారి నందఱను
గూడ గాడదారి మాటలను విని నిస్సారముగా నింత దగిలించి
యుంటిని. వానితో యుద్ధ మొనరించి నిర్జించుటయో, లేక యాయప
కీర్తి పాలగుటకంటె చచ్చుటయో మేలు. వీరోచితముగా యుద్ధ
మొనరించి శత్రువును నిర్జింపక యిట్టివంకరమార్గములకుఁ బాల్పడుట
యెంతయుఁ దెలివితక్కువ. కానిమ్ము. ఇప్పుడైనను పోయిన దేమి?
వానితో యుద్ధమొనరించి జయించియే తీఱువాఁడ. ఓడితినా! చచ్చి
నవారికిఁ బ్రపంచముతోఁ బనియేమి? జయించితినా! ఆయువతి
నన్నుఁ దప్పక పెండ్లియాడియే తీరును. వెనుదిరుగరాదు. వెనుదిరు
గుటవలన నెన్నియో నష్టములు వచ్చితీరును.

అని పరిపరివిధముల నాలోచించుకొనుచుండఁగా నుదయదిశా
ముఖమునఁ గొంచెము తెల్పునుఁ దరువాత నెఱ్ఱపును గనుపట్టెను.
భానుబింబ మొక్కసారి నభోభాగముపై కరుగ దెంచి పట్టణమునం
తయు వెలుంగవెల్లువలలో ముంచివేసెను. రహీంఖాఁ మంచమునుండి
లేచి కాలకృత్యములఁ దీర్చుకొని యశ్వము నెక్కి చందనదాను నిం

టికిఁ బోయెను. ఆయింటికడఁ దన గుఱ్ఱము నొకసేవకుని చేతి కి
చ్చి లోపలికిఁ బోవఁగానే, వాకిటియొక సేవకుఁడు రహీము కూరుచుండుటకో
యాసనమును దెచ్చి వేసెను. ఆతఁడు నేను వచ్చితి నని చెప్పవలసి
దని యాసేవకునితోఁ జెప్పెను గాని యాసేవకుఁడు "నిద్రపోవుచున్నా
రు" అని జవాబిచ్చుటచే నాసనముపైఁ గూరుచుండి వేచియుండెను.

చందనదాసునకుఁ బాపము రాత్రి యాలస్య మగుటవలన
నిద్రపట్టలేదు గాని, తరువాత మందమారుతము సోఁకుటచే గాఢ నిద్రా
పరవశుఁ డయ్యెను. ఉదయము ప్రొద్దెక్కినను గూడ నాతఁడు లేవ
లేదు. సూర్యకిరణములు సూదులవలె గవాక్షపురంధ్రములనుండి వచ్చి
యాతనిఁ బ్రబోధింపఁగా లేచి దంతధావనాదుల నొనరించుకొని యింటి
లోనికిఁ బోయెను. తరువాత రహీముసాహెబు వచ్చియున్నారని
తెలిసి యతఁడు "ఎంతసేపైనది" అని చెప్పినవానిని బ్రశ్నించి సుమా
రొక గడియసేపైనది అనుజవాబు విని "అయ్యో! నాకొఱకు నిరీక్షించి
యున్నారే!" యనుకొని వెంటనే యాతనికడ కేగెను. వానికడ కేగి
సలా మొనరించి రమ్మని చెయిపట్టుకొని లోపలికిఁ దీసికొనిపోయెను.
అక్కడ నాయన నొకయాసనముపైఁ గూరుచుండఁ జేసి తాను నాసీనుఁ
డయ్యెను. రహీమునకుమాత్రము శరీరమంతయు మండుచుండెను.
హృదయమునందు బయలుదేఱిన యసూయ యనుజ్వాల తన
యుష్ణతను శరీరమునం దంతటను వ్యాపింపఁ జేసెను. ఆయసూయయే
శబ్దరూపమున నాతనిముఖమునుండి గొంచెముసేపులో బయలుదేఱి
రానున్నది. పాపము! నిర్మలహృదయుఁడై, కల్మషశూన్యమైన
మనస్సుగల చందనదాసున కీసమాచార మేమి తెలియును? కూరు
చున్న రహీమును జూచి చందనదా సిట్లనెను.

చందన—అయ్యా! నిన్న రాత్రి చాల యాలస్యముగా నిద్రించు
టచే వేగము లేవలేకపోతిని. ఆకారణముననే మిమ్ము నూరక నిల్పి

చందన — నేను వ్రాసినదే యీయుత్తరము. అందువలన దోషమేమి? కాని యీలేఖ మీకెట్లు వచ్చినదో నాకుఁ దెలుపవలెను.

రహీము — మీరు దీనిని వీధిలోఁ బాఱవైచుకొంటిరి. కావున నది నాకు లభియించెను. ఏది యెట్లైనను షహామీరాదాను వివాహము చేసికొనుటకు మీరు నిశ్చయించుకొన్నవారేగదా! ఇఁక నబద్ధము చెప్పుటకొఱకప్పుడు మీరిష్టపడినను గూడ నేనొప్పుకొనువాఁడను గాను.

ఈమాటలు వినినతోడనే చందనదాసునకుఁ గోపము వచ్చి యిట్లనెను.

చందన — అయ్యా! మీసంభాషణము రుచించుట లేదు. నాకార్యములతో మీకేసంబంధము గలదో నాకిసుమంతయును దెలియకున్నది. నాయిష్టము వచ్చిన కన్యకను నేను ప్రేమించుటకు మీయభ్యంతర మేమియో నాకుఁ దెలియుట లేదు గావున నాప్రసంగమును గట్టి యింకొకప్రసంగమునకు దిగుఁడు.

రహీము — అయ్యా! నేనిక్కడ కరుగుదెంచుటయే యీప్రసంగముకొఱకు. షహామీరాదాను వివాహము చేసుకొనఁదలచుకొన్నవాఁడొక్కఁడే యుండవలయును. ఆమెనామము నిన్నిదినములనుండియు జపించుకొనుచు వేచియున్నాను. కావున మన మిరువురమును నుండఁ జాలము ప్రత్యేకముగా యుద్ధముచేసి మనయిరువురిలో నెవ్వరు గెలుపందెదరో వారే వివాహము చేసికొనవచ్చును. రేపు సూర్యోదయకాలమున నొక్కరహస్యస్థలమునఁ గలిసి ద్వంద్వయుద్ధము చేసి యందు గెలుపొందుటకుఁగాని చచ్చుటకుఁగాని సంసిద్ధులైయుండక తీరదు.

ఈమాటలు వినుసరికిఁ జందనదాసునకబ్బురము పుట్టెను. ఆతనికిఁ దనహృదయాధిదేవతను రహీము ప్రేమించుచున్నట్లించుకంతయును దెలియదు. ఈవార్త యాతని కశనిపాతమువలె దోఁచుటయే గాక రహీముపై నెంతయు జుగుప్సయు విసుపును బుట్టించెను.

కడచినరాత్రి జరిగినసమాచారమునకే యాతనిమన స్సెంతయు నాందోళనము నందుచుండగా వినూతనమైన యీవ్యవస్థ నెట్లెదుర్కొనవలయునా? యనుసంశయము పెట్టఁజొచ్చెను. యుద్ధ మొనరింపుటయా! లేదా! యనుసంగతి వెంటనే నిర్ణయము చేయవలయును. నిన్నరాత్రి జరిగినయీయంత యంతయును నితఁడే కారణమై యుండునో పునేమో! కాని నిశ్చయించుటకు వీలులేదు. వీఁ డెన్నియోసారులు నన్ను నసూయాపూర్వకములైన చూపులతోఁ జూచుచుండెడివాఁడు. ఒకసారి వీనికి బుద్ధి చెప్పినఁ దీరవలయును. ఇప్పుడు నేను లేదనినచోఁ జేతకానివాఁడ నని లోపల భావించుకొనును. ఇదిగాక నేను ప్రేమించిన కన్యకకొఱకై యుద్ధముసేయవలసిన దని పిలువఁగా లేదని పోఁగలనా!'' అని యాలోచించి యిట్లు పల్కెను.

చందన—నీయిష్టము వచ్చినచోటికివచ్చి నీతో ద్వంద్వయుద్ధ మొనరించుటకు నా కేయభ్యంతరమును లేదు. స్థలమునుమాత్ర మిప్పుడే నిర్ణయింపుము.

రహీము—ఈపురమునకుఁ దూర్పున నున్న బాటప్రక్క నొకక్రోసుదూరమునఁ దోఁట యొకటి కలదు. అతోఁటప్రక్క మనము పోరుటసరియేనా! ఈశపథము నిశ్చయము గావునఁ దప్పక రావలయును'' అని చెప్పి తనయాసనమునుండి పలుకకుండ లేచి వెడలి పోయెను.

---

## ముప్పదియవ ప్రకరణము



### మరణము

వివాహమైనతరువాత సుమారు నాలుగుసంవత్సరములకు సీతమ్మ కాపురమునకు వచ్చెను. అప్పటినుండియు మగనియొక్కయు

నత్తమామలయొక్కయు నభిప్రాయము లంతయు స్పష్టముగా వ్యక్తము లయ్యెను. స్వభావముచే సీతమ్మ సుశీలురాలు, విద్యావతి ఏపని నొనరించినను నాలోచన లేకుండ జేయునది కాదు. ఆమె పల్లెటూరియందే పుట్టిపెరిగినను గూడ నుదారస్వభావమును విశాలహృదయమును గలిగి క్రొత్తయలవాటుల నంగీకరింప గలిగియుండెడిది. ఎల్లప్పుడు నొకే యలవాటునకు లోబడి యభివృద్ధికి గర్భశత్రువు లగువారగాన నచంద్రమామ లామె స్వేచ్ఛ నెంతయు నిరోధించుచుండిరి. మతసంబంధములైన గ్రంథములుగాని, నీతిదాయకములైన పుస్తకములును నామె లభియించినంతమట్టుకు చదువనిచ్చిరి కాని యట్టిపనికి నాగానందాదు లొప్పుకొనుచుండిరి. ఇంగ్లీషుకోడ లెట్టియూథులలో తమకోడలును నట్టియూథములో జేరఁగావలయు నని వారికోరిక. వారికంటె నెక్కుడువిద్యావతియైనయెడల నామె తమ్ము లెక్కచేయదేమో యని వారిభయము. ఆకారణమున వారామె స్వేచ్ఛ నెన్నివిధముల నిరోధించుటకు వీలగునో యన్నివిధములను గూడ నిరోధించుచునే యుండిరి. మగడును నత్తమామలును దనయూహలకు కొనసాగకుండ రాచివేయుచున్నను పాపము సీతమ్మ వారి కనుకూలముగా వర్తించి, తనజీవనమునకును దక్కినవారికినిగూడ సౌఖ్యము నొసంగుటకు వీలైనంతప్రయత్నము చేయుచుండెను.

ఇట్లుండఁ గొంతకాలమునకు నాగానందున కాగ్రాలో పనియయ్యెను. అక్కడ, కచ్చేరినుండియేవియో, సరిహద్దులనిమిత్తమైన తగాయిదాలకొరకు స్వయముగాఁ గుటుంబముతో వెళ్ళి నాగానందుఁడు స్వగృహమునఁ గాపురముండెను. చంద్రచూడుఁడు పిన్నవాఁడయ్యును దండ్రిగుణములచే యనుసరించుచుండెను. తండ్రికి వేదమైనను వచ్చును గాని యీతని కదియు రాదు. ఉదయమున లేచి చద్దియన్నముఁ దిని యొకచోఁ గూరుచుండును. మధ్యాహ్నభోజనము

నకు వేళయైనప్పుడుసూర్యుఁడు పడమటి దిక్కుననుండి లేచును. పదిగంటల భోజన మొనరించి కొంతసేపు విశ్రమించును. రాత్రియంతయు నిద్రించినను బగలాతఁడు నిద్రలేకుండ నుండఁజాలఁడు. సాయంకాలమున చల్లగాలికైనను యమునానదికిఁ బోయి యచ్చట సంధ్యావందనాది కృత్యములను జేసికొనఁగూడదా! యని సీతమ్మ యాతని ననునయించినను గాని యెన్నఁడు నామాట లక్ష్యపెట్టక, యింటిలోనే పరుండియుండు వాఁడు. ఇట్లుండ నొకనాఁడు చంద్రచూడునకు జ్వరము వచ్చెను. ఉష్ణము వచ్చిన దినమైన జంకక నాఁటి భోజనముఁ బెట్టించుటచే రాత్రి యగుసరికి జ్వరము హెచ్చెను. వైద్యునిఁ దీసికొని రావలసిన దని చెప్పి సీతమ్మ యత్తమామలను నిర్బంధించెను గాని వారామె మాటలను జెడచెవిని బెట్టిరి. రాజవైద్యు లున్నను వారిమందు లున్నను నాగానందున కెంతమాత్రము నిష్టము లేదు. వారి యౌషధములను సేవించుటవలన నాచారము నిలువదనియు కులము చెడు ననియు నాగానందునకు గట్టినమ్మకము. ఆదినమున తిథివారనక్షత్రములను లెక్కచూచుకొని యొక జ్యోతిష్కునియొద్ద కేఁగి ప్రశ్న యొనరించి సులువుగా నుండునని యాతఁడు వచియించిన జవాబుతోఁ దుష్టి నంది యూరకుండెను. సీతమ్మమాటలను విని, వైద్యముకంటె జ్యోతిషమునందు నమ్మక మెక్కువ గలవాఁడు గావుననే "గ్రహచారము బాగుండిన యెడల నాతఁడు దప్పక స్వస్థత నందును. లేని యెడల నెన్నిమందులు వేసినను గూడ బ్రతుకఁడు" అని తలఁచి యూరకుండెను. కాని సీతమ్మ యత్తగారితో నెన్నో చెప్పి వైద్యునిఁ దెప్పించవలసిన దన్ని బతిమాలెను. కష్టముమీఁదఁ నాగానందుఁడు వైద్యునికడకుఁ బోయెను. పాపము రామనాథుఁ డుండినయెడల నీబాధ నాగానందున కుండియుండదు. క్రిందటిరాత్రి జరిగిన పోరాటమునకు సంబంధించిన యనుమానముచే రామనాథుని నుదయము

ననే చెఱఁదీసికొనిపోవుటచే రామానాథుఁ డింటికడ నుండకుండుటయే గాక, యతని తండ్రియగు శంకరదాసుగూడఁ గాలుగాలిన పిల్లివలె వాని విడుదలకొఱకుఁ దిరుగుచుండెను. వైద్యుఁడు వచ్చుసరికి రోగికి కలువరింతలు హెచ్చి, ముక్కు గోఁకుకొనుట, చేతులు పిసుకుకొనుట, బట్టలు మూటలుగట్టుట మొదలగు లక్షణము లన్నియుఁ గనుపట్టఁ జొచ్చెను. వైద్యుఁడు నాలుకను, నాడిని, రెప్పలను బరీక్షించి "విరేచన మేమైన నైనదా! మధ్యాహ్న మేమైనదనా!" యని ప్రశ్నించెను. "విరేచనములేదు. మధ్యాహ్నము గొంచె మెంగిలిపడి యున్నాఁడు" అని తల్లి జవాబిచ్చెను. "ఇది యెంతయుఁ దీవ్రమగు జ్వరము. అదనముగా నితనికి గుండెదడగూడఁ గలదు. మందిచ్చెదను తరువాత మన యదృష్టము" అని వైద్యుఁడు చెప్పి నాగానందుని దనతోఁ దీసికొనిపోయెను. వైద్యునిమాటలు వినినతోడనే సీతమ్మకు బైప్రాణములు బైటనే లేచిపోయెను. మొగమున గత్తిరవేటున కైనను నెత్తురుచుక్క లేదు. మగఁడు చనిపోవునేమో యని యామెకు భయము హెచ్చెను. హిందూవనితకు భర్తయే గతి. హిందూదేశమునందేగాక యన్నిదేశముల యందునుగూడ సుదతికిఁ బతియే గతి యనుట నిజమే కాని, హిందూసంఘమున విధవయొక్క స్థితిమాత్ర మనిర్వాచ్యము. ఆమె సకల సౌఖ్యములకును గూడ దూర మగును. మహమ్మదీయ క్రైస్తవాది మతావలంబకుల యందును, హిందూమతమునందు గొంత మందికిని గూడ స్త్రీపునర్వివాహము సమ్మతమే యైయున్నది. శాస్త్రసమ్మత మగుటచేతనో, పరంపరాగత మగుటనో, లేక పురుషుని యసాధారణక్రౌర్యముచేతనో, మఱి యేకారణముచేతనో గాని కేవల సాంఘికనియమ మగు వివాహమును మతసంబంధమగు నిబంధనగా మార్చి, దుర్లంఘ్యములైన నియమముల నొనరించి స్త్రీపురుషుల

కాసందర్భమున సమానస్వాతంత్ర్యము నియ్యక యొకరిస్వేచ్ఛనుజంపి మతధర్మరక్షకుల మని పేరు పెట్టుకొను వారందఱును స్త్రీలయెడఁ బెద్ద ద్రోహము నొనరించియున్నారు. అదిగాక యాకాలమందుసహగమన మనునాచారముగూడఁ గలదు. భర్తగతించిన కొందఱుస్త్రీలు భర్తయందలి ప్రేమచేతనో, సంసారమునందలి విరాగముచేతనో, భర్తతోడిదే లోక మని యెంచియో, లేక విధవ పడవలసిన బాధలను బడి సహించలేకయో తమశరీరముల నగ్ని కాహుతి యొనరించి ప్రపంచమునుండియు, క్రూరసంఘమునుండియు గతించుచుండిరి. అట్లొనరించుటవలన నెంతయో పుణ్యమువచ్చు నని యెంచి యనేక మూర్ఖమానవులు దమబంధువులను సహగమన మొనరించుట కొప్పించుచుండిరి. ఒక్కొక్కప్పుడు బలవంతముగా, జవాబిచ్చి సంఘమును, దమ బంధువులను దిరస్కరింపఁజాలని ముగ్ధలను బలిచితిపై దగ్ధ మొనరించుట యాచారమై యుండెను. భర్తయొక్క బంధువు లందఱును, బురోహితుఁడును, తుదకు వధువుతల్లిదండ్రులునుగూడ స్త్రీలను సహగమనముచేయుటకుఁ బురికొల్పుచుండుట యలవాటు. ఇది యంతయు విని కనియుండుటచే సీతమ్మ కెంతభయముగా నుండెనో చెప్పుటకు వీలులేదు. గ్రుడ్లను నీరు గ్రుక్కుకొనుచు మంచముచాటున గూరుచున్న యామె మొగమున దీనత్వము దాండవమాడు చుండెను. 'ఎంత మూర్ఖుఁడైనను బతిలేని సతిజీవన మగునా? ఆకులును బూవులును రాలి లోనిపచ్చి యంతయుఁ బోఁగా మోడయిపోయిన పూలమొక్కవలె విధవయై జీవించుట యెంతయు దుర్ఘటము. జీవనముపోయినకట్టెనైనను గొంచెముసే పింటిలో నుండనిత్తురు గాని మగఁడు గతించినతరువాత జీవించు మందభాగ్య నొక్కనాఁడైననిలువనీయరు.' అని తలఁచుకొనుచు కొరవిపెట్టి కాల్చుచున్నట్లు మండుచున్న హృదయముతో మంచముదగ్గఱఁ గూరుచున్న సీతమ్మను

జూచి యత్తగారు 'అమ్మాయీ! వోఘాయత్తంగా యేడవకూడదు; ఉష్ణము నిమ్మళంగా నుంటుంది' అని చెప్పెను గాని యామెకుమాత్రము గడుపులో బెంగ లేకుండెనా? కాని యప్పటిపరిస్థితులనుబట్టి కన్నదానికంటె కట్టుకొనిన దానికే చిచ్చు హెచ్చినయట్లు గన్పట్టుచుండెను.

ఇంతలో నాగానందుఁ డౌషధము దేఁగా దాని నరగఁదీసి యనుపానమును జేర్చి నోటిలోఁ బోసిరి గాని లాభము లేకపోయెను రాత్రి సుమారు పండ్రెండుగంటల వేళఁ జంద్రచూడునకుఁ గాళ్ళు చేతులు చల్లబడెను. కొంచెముసేపులో నూర్ధ్వలోకమునకుఁ బ్రయాణమయ్యెను. దగ్గఱఁగూరుచుండి యాస్థితి నంతయుఁ గన్నులారఁ గాంచుచున్న సీతమ్మ పెద్దమూర్ఛఁ జెందెను. ఇల్లంతయును రాగములతో నిండిపోయెను, గాని యిరుగుపొరుగువా రెవ్వరును రారైరి. చంద్రచూడుఁడు చనిపోవుట విని శంకరదాసు వచ్చెను. ఉదయమున దనకుమారునకుఁ గారాగారవాసశిక్షయు- దమ్మునికుమారుఁడు రాత్రి చనిపోవుటయు సంభవించుటచే శంకరదాసు భ్రాంతమానసుఁడయ్యెను వారి నందఱి నోదార్చెను. పురోహితుని కీవార్తను దెల్పి యాతనిఁ దీసికొని వచ్చుటకు శంకరదాసరిగినతరువాత సీతమ్మకు స్మృతివచ్చెను తాను కాపురమునకు వచ్చినప్పటినుండియు సీతమ్మ, భర్తకు వ్యాయామ మొనరించుచు శరీరదార్ఢ్యమును నిలువఁబెట్టుకొనవలసి దని చెప్పుచున్నను నాయన వినక, దేహమును రుగ్మతపాలు చేసికొనెను. దానికిఁ దగినట్లుల నాతనితండ్రియు మంచిమందిప్పించక యపథ్యము చేయించి చంపివేసెను. బ్రతికియున్నంతకాలమైనను, సీతమ్మ తెలివితేటలను గాని చదువును గాని భర్తయింటివా రెవ్వరును మెచ్చుకొనలేదు. కాని దారిలేక యామె దనసౌశీల్యముచే కలుపుఁగోరుఁదనముచే విశ్వాసముచే వారి నందఱను మెల్లఁగా దిద్దుకొనుచు, దుఃఖములను

సౌఖ్యములఁగానే భావించుకొనుచు, మెల్లఁగాఁ గాలము గడపుచుం డెను. వీని నన్నిటిని మనస్సునకుఁ దెచ్చుకొని యా మంచముకడఁ గూరుచుండి యిట్లు లోఁదలఁచుకొనుచు నేడ్చుచుండెను. "పరమేశ్వరుఁ డేదియో సంబంధమును గూర్చెనుగదా! మనస్సునకు శాంతి నిచ్చి యిన్నినాళ్లును సౌఖ్యము నీయకున్నమానె. అయ్యయో! ఆ సుఖలేశమునకుఁగూడ నేను నోచుకొనలేకపోయితినిగదా! ధైనమా! విద్య యున్నను లేకున్నను, రూపవంతుఁడైనను గాకున్నను. జెనిమిటి యల యొకఁ డున్నాఁ డని సంతసించునా శాయానందమును గూడఁ ద్రోసిపుచ్చి, దుఃఖసాగరమునఁ బడద్రోసితివిగదా! పరమేశ్వరా! అయ్యయ్యో! ఇప్పుడు వారు నన్ను సహగమనముగూడఁ జేయు మందురేమో! ఈవిధమునఁ బ్రతికియుండుటకంటె కాలి చచ్చిపోయినను గూడ యుక్తమే గాని యాజ్వాలలను దలఁచుకొనునప్పటికి నా యొడలు కంప మెత్తుచున్నది. వారందఱును నన్ను సహగమనము చేయవలసిన దని బలవంతముచేయునప్పు డేమి చెప్పవలయును. నన్ను వేసికొన మాటలాడుటకుఁ దలిదండ్రు లైన లేరుగదా!"

ఇట్లుండ నుదయము మూఁడుగంటలకు పురోహితుఁడు సర్వోపరికరములతో వచ్చెను. అక్కడకుఁ బోయిన శంకరదాసును బురోహితుఁ డిట్లడిగెను. "అయ్యా! చనిపోయినయాతఁడు వివాహితుఁడే గదా! ఆయన భార్యసహగమన మొనరించుట శాస్త్రవిహితమైన ధర్మము, అట్లొనరించునా! ఒనరింపదా!" ఆప్రశ్నకు శంకరదాసేమియు జవాబు చెప్పలేకపోయెను, గాని సహగమనముమాత్రమాతని కిష్టముగాదు. ఆ కారణమునఁ బురోహితుఁడు నాగానందునే యాప్రశ్న వేయఁగా దుఃఖసముద్రమున మునిఁగి యుండియుఁ గూడ దంపతు లిరువు రిట్లు జవాబు చెప్పిరి. "నాయనా! మా వంశము మహోన్నత వంశము. ఆహితాగ్నికుటుంబము, మా యింటికోడం డ్రెవ్వరును

విధవాత్వ మనుభవింపలేదు. పూలచెండ్లవలె పుంస్త్రీ పసుపులుగానే భర్తలతో వెళ్ళిపోయిరి." అయ్యా; అట్లయినయెడల, సహగమనము చేయు నవిధయొక్క యొప్పిదము లేకుండ సహగమనము చేయంచకూడదని శాసనము. ఆమెనే నేనడిగి తెలిసికొనియెదను." అని చెప్పి నిస్పృహఁజెంది భయకంపితయై నోటమాట రాక కొయ్యయై యున్న సీతమ్మదగ్గఱకుఁ బురోహితుఁ డేగెను. ఆమెదుస్స్థితిని గాంచి యాపురోహితపిశాచమునకు లేశమునూ కృపగలుగలేదు. శవములు మోయువాఁడు కూలికి చేరవాడునా! లేదా! ఆచారప్రాబల్యముచే నాతనికి మానవత్వమే తొలఁగిపోయెను. బాధ యనునూహ మొదలే లేదు. స్త్రీయొక్క ప్రత్యేకవ్యక్తిత్వమును, ఈశ్వరునిసమాన కారుణ్యమును, పక్షపాతరాహిత్యమును నాతని మనస్సునకుఁదట్టలేదు. ఆయమ్మను జూచి సహగమనమున కాతఁడిట్లు పురికొల్పెను. "అమ్మా! ఈలోకమున భర్త గతించినస్త్రీ కేమియును లేదు. అతని వెన్నంటుటయే పరమధర్మము. మహాసౌఖ్యముల కాలవాలమును, నిత్యకళ్యాణమును, బచ్చలతోరణమునునై యున్న స్వర్గమున నీకొఱకు వేచి యున్నభర్తను గలసికొని శాశ్వతసౌఖ్యము ననుభవింపుము. సహగమనమువలన రెండుకులములవారును దరింతురు." ఈమాటలుకరఁగిన సీసమువలె చెవిలో నిక్కఁ బడుటతోడనే సీతమ్మశరీరము భయముచే కంపించెను. ఒడలంతయు చెమర్చెను. భయోద్రేకముచే దుఃఖమాఁగిపోయెను. మనస్సునందు మహాజ్వాలలు ప్రత్యక్షమయ్యెను అయ్యో! మరణవేదన! జీవించుచుండఁగా దహనము! అని తలచు, కొని మరల మూర్ఛపోయెను. జవాబీయకుండుటజూచి యాపురోహితవ్యాఘ్రము మరల నామెను బురికొల్పుట కారంభించెను. అది విని యత్తగారును మామగారును వారితో నిట్లనిరి. "ఆమె జవాబీయగలదా! ఆమె నడుగుట వద్దు." ఈమాట విని, మూర్ఛదే

ఱిన సీతమ్మ అతిభయముతో "మా వాళ్ళకు కబురంపుము. వారు
వచ్చినతరువాత నాలోచింపవచ్చును" అనెను. పురోహితుఁడును
నాగానందుఁడును శవము నంతవఱకును నుంచుట ధర్మలోప మని
చెప్పి యట్లు చేయుట వీలులే దనిరి. ఇది యంతయును విని శంకర
దాసు ప్రక్కనున్న పురోహితునితోను దమ్మునితోను ఆమెకు సహ
గమన మిష్ట మున్నట్లు లేదా. మనఃపూర్తిగా శరీరమును ధ్వంస మొన
రించుకొనుట కెవ్వ రొప్పుకొందురు? కావున నట్టిపనికి మీరు పూను
కొనక యామెను పుట్టినింటికిఁ బంపివేయుఁడు" అనెను. అనుసరికి
నాగానందుఁడును నాతనిభార్యయు "నాయనా! నీ కేమి పోయినది.
నరక మనుభవించువాఁడు నాకొడుకు. మా పేరు ప్రతిష్ఠలనుపూర్తిగా
ధ్వంసముచేయ నెంచుచున్నావు. దానిక లేని యభ్యంతరము నీకేల!
నీకొడు కున్నాఁడుగదా యని నీకు ధైర్యము" అని పలుకుసరికిశంకర
దాసున కసహ్యము పుట్టి మెల్లఁగా నింటికి లేచిపోయెను. తనప్రక్క
మాట లాడుచున్న శంకరదాసుగూడ వెడలిపోవుటచే సీతమ్మ కాశా
పాశములు తెగిపోయెను. ఇంతలో దహనకార్య మూరికి రెండుమైళ్ళ
దూరమున నున్న దమతోఁటలో చేయించవలయు నని పురోహితు
నకు నాగానందుఁడు చెప్పెను. సాధారణముగా దహనముచేయుశ్మశా
నమున శవమును గాల్చునెడల, నెవ్వరైనఁ జూతురేమో యనియు,
నొకప్పు డక్కడి కేఁగినతరువాత నాజ్వాలలఁ జూచి సీతమ్మ తిరుగఁబ
డినను బోధించి యెట్లయిన సహగమనము చేయింపవచ్చు ననియు
నాశతో నాగానందుఁ డీయుపాయమును బన్నెను. పురోహితుఁడును
దక్షిణకొఱకును, సహగమనమును జేయించితి ననుకీర్తికొఱకును,
ఈకార్యము మతమునందుఁ జెప్పఁబడిన యుత్కృష్టకార్య మనునమ్మ
కచేతను దాని కొప్పుకొనెను. క్రొత్తచోట దహనముచేయుదురన్న
మాట విని యున్నయాశకూఁడ తొలఁగిపోవుటచే సీతమ్మ కొంచె

ముసే పుంకీ పెరటిలోనికిఁ బోయెను. అక్కడి దాసి యగు గిరిజమ్మ కూరుచుండెను. ఇఁక నొక గంటకు సూర్యుఁ డుదయించు ననఁగా నామె వచ్చి తనపని చేసికొనుట చులవాటు గావున నప్పుడే పెరటి తలుపుద్వారా వచ్చెను. గిరిజమ్మ యింటిలోనికి వచ్చినతోడనే జరిగినసమాచారము గనిపెట్టెను. గాని సీతమ్మ పాప మేమగునా యని విచారించుచు నట్లే కూరుచుండెను. గిరిజమ్మకు సీతమ్మ యిదివఱకప్పుడప్పుడు డబ్బిచ్చి యాదరించుటచే నామె యనిన నెంతయు నభిమానము. సీతమ్మను జూచి గిరిజమ్మ "అమ్మా నిను సహగమనము చేయింతురఁట! నీకది యిష్టమేనా? వద్దని వారితోఁ జెప్పవేల??' అనెను. అది విని 'గిరిజా! వారితో చెప్పి యేమిలాభము? వారు విందురా? నేను చెప్పలేను. నన్ను రక్షించవలె నని నీ కున్నయెడల నేను చెప్పినట్లు చేయుదువా?'' అని సీతమ్మ యడిగెను.

గిరిజమ్మ—నీకొఱకు ప్రాణములనైన విడిచెదను. ఏమిచేయవలెనో చెప్పు.

సీత—అట్లయినయెడల నీవు పోయి చక్రవర్తితో నాస్థితిమనవిచేయుము. దుర్బలులకు రాజే బలము. నాయసహాయస్థితియు, దహనముచేయుస్థలమును తెలుపుము. వచ్చి రక్షింపవలసిన దని చెప్పుము. చక్రవర్తిదగ్గఱకు నేనెట్లుపోవుదు నని నీవు సంశయింప నవసరము లేదు. కోటద్వారముకడ నొక గొలుసున్నది. అక్కడ నిద్దఱు సిపాయి లుందురు. వారి నడిగి యాగొలుసు లాగినయెడల చక్రవర్తిదగ్గఱ నొకగంట వినఁబడును. ఆసిపాయిలు నిన్ను లాగనీయనియెడల వారికీకంటె నిచ్చివేయుము.

అని మెడలోనికంటె దీసి సీతమ్మ యామె కిచ్చెను.

ఆమాట విని, యిచ్చినకంటె తీసికొని గిరిజమ్మ పెరటివైపునఁ బాఱిపోయెను. తరువాత సీతమ్మ యింటిలోనికిఁ దిరిగి వచ్చునరికిఁ

పురోహితుఁడు మొదలగువారు గావలసిన యేర్పాటులు చేయుచుండిరి. వాహకులు వచ్చిరి. తుద కింటికడఁ జేయవలసిన క్రియలనైనఁ జేయకుండఁ జితిగట్టి శవమును బరుండఁబెట్టుకొని ప్రోలఁగఁ గొనిపోఁదొడఁగిరి. తెల్లవాఱకుండ శవము నక్కడకుఁ జేర్చుట వారిముఖ్యోద్దేశము. సహగమనచిహ్నములును, అనుమానము నెట్టిం గిట్టి యను లేకుండ తెల్లవాఱుసరికే ఊరుగడచి వారు దాఁటిపోయిరి. రాత్రి యుక్తగా నుండుటచే ప్రభాతవాతపోతముల సోఁకి యనిద్రించి జనులెవ్వరును లేవలేదు. నిశ్శబ్దముగా నున్నవీధులలో నుండి నసక నసక చీకటిలో వారందఱు నూరు దాఁటిరి. ఊరుదాఁటిన వెంటనే యొక ప్రాంత మార్గమును బట్టి వారందఱొక చెట్లగుంపులోఁబడి యదృశ్యులైరి.

---

## ముప్పదియొకటవ ప్రకరణము

### సహగమనము

ఏమి చేయవలయునో సంపూర్ణముగా నెఱుఁగకున్నను గిరిజమ్మ సీతమ్మపై నున్నయభిమానముచే నక్కార్యమును జేయఁ బూనుకొనెను. ఎట్లయినను సీతను రక్షింపవలె ననుకోరిక యామెకు బలముగా నుండుటవలనఁ ద్వరగాఁ బోఁజొచ్చెను గాని చక్రవర్తికోట సీతమ్మయింటి కెంతయు దూరమున నుండుటచే వేగము చేరలేకపోయెను. కొంచెముదూరము పోవుసరికి తూరుపునఁ దెలుపులుపొడముచుంట గ్రహించి యామె పరుగుపరుగున కోటదేవిడీకడకుఁ బోఁజొచ్చెను. ఆలస్యమైనయెడల సీతమ్మను బలవంతముగా నెక్కడ సాహుతిచేయుదురో యన్నభయముచే నామెకు గుండె ఢీమఢీమనుచుండెను. అప్పుడే సూర్యకిరణములు రాజప్రాసాదమాలికలశిఖరములకు

మొఱుఁగులు వెట్టుచుండెను. గిరిజమ్మ కోటద్వారముకడ కేఁగి యక్కడ నున్న సిపాయితో నిట్లు మాట్లాడెను.

గిరి—నాయనా! చక్రవర్తితో స్వయముగా మాట్లాడవలయు నన్న నొకగొలుసును లాగవలయునఁట ఆగొలు సెక్కడ? నే నొక్క యనాథయువతినిరక్షించు నుద్దేశముతో వచ్చియున్నాను. అతిత్వరలో నన్నాస్థలమునకుఁ బిలిచికొనిపోయి యాపుణ్యముగట్టుకొమ్ము నాయనా!

సిపాయి—నీ దేయూరు ? పేరేమి ?

గిరి—నాది యీనగరమే. పేరు గిరిజమ్మ.

ఆమాట విని యాతఁ డింకొకసిపాయిని తోడిచ్చి లోనికిఁ బంపెను. ఆపురుషుఁడు గిరిజమ్మ నొకచావడిలోనికిఁ దీసికొనిపోయి విడిచెను. అందొకత్రాడు గోడనుండి వ్రేలాడుచుండెను. ఆత్రాటిని లాగినతోడనే చక్రవర్తియుండెడు నభ్యంతరమందిరములో నొకగంట మ్రోఁగును. అప్పుడు చక్రవర్తి విని వాయించినవారికి దర్శన మిచ్చును. త్రాడులాగిన కొన్నినిముషములలో నొకసేవకుఁడు లోనుండి వచ్చి యామెను దీసికొనిపోయెను. పాదుషా స్నాన మొనరించి దైనిక ప్రార్థనకుఁ బోవుచున్నవాఁడయ్యు నద్దాని నాఁపి గిరిజమ్మపలుకులను వినుటకు సంసిద్ధుఁడై వేచియుండెను. ఆమె వచ్చినతరువాత "ఏమి కావలయును?" అని యాతఁడు ప్రశ్నించెను. గిరిజమ్మ యింతకు ముందు చక్రవర్తిని దూరమునుండి చూచినదే కాని యింతదగ్గఱ నుండి యెన్నఁడును జూచి యెఱుఁగదు. ఆకారణమున గద్గదస్వరము వచ్చెను. గాని కార్యావసరమునుబట్టి పుట్టినతొందరతోడను నాత్రముతోడను నిట్లు పల్కెను.

"మహాప్రభూ! ఏలినవారు కటాక్షింపకున్నయెడల మాయజమానురాలగు సీతమ్మగారు నిష్కారణముగా నిప్పులోఁబడి మరణింపవలసివచ్చును. ఆమెను బలవంతముగా సహగమనము చేయించు

టకుఁ బ్రయత్నించుచున్నారు" గిరిజమ్మమాటలు వినుసరికి పాదు షాకుఁ గల్గిన కినుకచే బొమలు ముడివడెను. "హా హా! నేను పాలించు రాజ్యమున నింకను సహగమనములు బలవంతముగా జరుగు చున్నవా?" యని ప్రశ్నించుకొని రాజోద్యోగులెవరైన వచ్చియున్నా రేమో చూడవలసిన దని సేవకున కాజ్ఞ యొసంగెను. రాత్రి యేదో కార్యములను జూచుటకుఁ బెడలకడ రావలసిన దని పాదుషా చెప్పినమాట ననుసరించి. కొత్వాలు రాజామానసింగు లప్పటి యచ్చట వేచియుండిరి. వారిరువురను సేవకుఁడు రమ్మని పిలుచుకొని వచ్చెను. వచ్చినవారిని జూచి వారి నతులైన గ్రహియింపకుండ యీయువతితోఁ బోయి యామె చెప్పువారిని రక్షించి తీసికొని రండు నేనే స్వయముగా వచ్చియుందును గాని యీశ్వరప్రార్థనము నకు వేళయైనది." అని చెప్పి యక్బరు లోనికిఁ బోయెను. కొత్వాలు రాజామాన్‌సింగులు గిరిజమ్మను ముందిడుకొని వెనుకఁ బదిమంది రాజభటులతో నాగానందుని యారామమునకుఁ బోవుచుండిరి. గిరిజమ్మ యిట్టివారితో నెప్పుడును గలసిపోయియుండినదిగాదు గాని కార్య భారముచేత నామెకును ధైర్యము వచ్చెను. వీరందఱును నడచుచుఁ బోయి యూరిని దాఁటి కాలిపుంతను జేరుసరికి సుమారొక యర గంట యయ్యెను. దానిదాఁటి వారు చెట్లగుంపులలోఁబడి పోవుచుండ నొకచో వారికి రెండుగుఱ్ఱములు చెట్లకుఁ గట్టఁబడి కనఁబడెను. ఒకటి రెండు చెట్లను దాఁటి వారు ముందునకుఁ బోవుసరికి ఖడ్గధారులై హోరాహోరిగాఁ బోరు పురుషవరు లిద్దఱు కూడఁ గానుపించిరి. వారిని జూచి మాన్‌సింగు కొత్వాలులు గుఱ్ఱములను బరుగెత్తించి వారు చందనదాసు రహీము లగుట గుర్తెఱింగి "శ్రీయక్బరు సార్వ భౌముని యానతిపై మీరు పోరాటమును మాని కత్తుల నొరలలోఁ బెట్టవలయును లేనిచో శిక్షార్హు లగుదురు" అని పల్కిరి. వారిరువురు

నాయానతిబ్రతికారకులు పోరాటము నిలిపిరి గాని యిరువురు చాలసేవ నుండి పోరుటచే గత్తులు మొరలుపోయెను. జాన్లి నలువురుపట్టెను శరీరమున గాయములు తగిలి యిరువురికును రక్తము వచ్చుచుండెను. వారు యుద్ధము గాని దమయుజమానుండగు హనుసింహునకు సలాముచేసి ప్రక్కకు త్రిగిలి నిలువబడిరి. అప్పుడు కొత్వాలు వారికి జానకి సూరసింహునితో నిట్లనెను. "వీరు పట్టణపరిసరముల యందు దౌర్జన్యము నొనరించి శాంతికి భంగకరముగా బ్రవర్తించు చున్నారు గావున దోషులు. వీరి నేమి చేయవలయును" ఆమాటకు నామాన్యుడు నేమి చేయుదురో అట్లే చేయుండని సూరసింహు చెప్పిన మాట విని కొత్వాలు వారితో నిట్లనెను. "మీరు సార్వభౌముని ఖైదీలు, ఖడ్గము నందిచ్చి ఖైదీలుగా నడువుడు. సార్వభౌములే మిమ్ము విచారణచేసి తీర్పు చెప్పగలరు" తరువాత వారందరును గిరిజమ్మ ననుసరించి నాగానందుని యారామమును చేరిరి.

నాగానందుడును వాహకులును గలసి సీతమ్మను శవమును దీసికొనిపోయి తోటలో విడిచిరి. స్మశానమును విడిచి తోటలో దహనకార్యమును చేయుటయందు నాగానందునకు రెండుమూడభి ప్రాయము లుండెను. ఆతోట యన్యజనరహితమై యుండును గాన సాధ్యమైనంతవఱకు జితి నెక్కవలసిన దని సీతమ్మకు బోధింపవచ్చు ను. వీరిబోధనలచే నొప్పుకొని చితి నెక్కినతరువాత నొక వేళసగము కాలి, యఖండమగు జ్వాలకు భయపడి బైటికి బరుగెత్తుకొని వచ్చు నెడల గఱ్ఱలతో నడచి పట్టుకొనవచ్చును. తమ తోటలో దా మేమి చేసికొన్నను బైవారికి ప్రశ్నించుటకుగాని వచ్చి చూచుటకు గాని ప్రసక్తి యుండదు గావున నాగానందుడట్టి యూహకు బాల్ప డెను. ఒకటిరెండు జెడినమామిడిమ్రోకుల నిదివఱకే నొట్టించి యుం టికి దెప్పించునభిప్రాయముతో నక్కడ గుప్ప వేయించి యుంచెను

గాని వాని నే కారణమువలననో చెప్పఁజాలుటకు వీలుపడినదిగాదు. ఆకట్టియలును, దోఁటలోని నిగుడుబావియందలి జలమును దహనాదికార్యములకుపయోగింపనిశ్చయించుకొనిరి. ఇంటికడ శవమునకు స్నానాదులఁ జేయించి వెడలవలసినది నగారాగా నిక్కడనే యిన్నియును జేయించునూహతో బయలుదేఱిరి గావునఁ బ్రథమమున శవమునకు గావలసిన సంస్కారమంతయు సల్పిరి. సీతమ్మకుఁగూడ స్నానము చేయించి సిద్ధముగా నిలువఁబెట్టిరి. సహగమనముఁ జేయించు స్త్రీని గుఱ్ఱముపై నెక్కించి గొప్పసంబరముతో నూరేగించి తీసికొనివచ్చుట యాచారమైనను, నామెస్వభావము నెఱింగినవాఁడగుటచేతను, ఎవరైన దారిలో సహగమనము వలదని బోధింతురేమో యనుభయముచేతను నాగానందుఁడట్లు తీసికొని వచ్చుట మానివేసెను. సీతమ్మశరీరముపైఁ బెట్టుకొన్న నగ లన్నియును దీసి పసుపుగుడ్డలను గట్టించిరి. గిరిజమ్మ వెళ్లెనో! లేదో! వెళ్లినను సరియైన స్థలమునకుఁ బోయెనో లేదో! చెప్పినను గూడ చక్రవర్తి యామెమాటను విని తన్ను రక్షించుటకు వచ్చునో లేదో! యను ననుమానములు హెచ్చయియామెను బాధింపఁజొచ్చెను. ఎంతసేపునకును గిరిజమ్మగాని చక్రవర్తి మనుష్యులుగాని వచ్చుజాడ లేకపోవుటచే నామె కమితముగా భయమయ్యెను. శవమునకు నిప్పంటించిరి. మహాభీకరమైన జ్వాలలు గోతినిండ వ్యాపించెను. తన్ను బ్రహరించినవానిఁ జంపవలయు నని కాలాహిఁ జాచునాలుకలవలె నగ్నినుండి జ్వాలలు వెడలుచుండెను. సీతమ్మ నాయగ్నియందు దుముకవలసిన దని యందఱును జెప్పిరి. ఇంతవరకును నామెకుఁగల మాంద్యము, దుఃఖము పిఱికితనము నీస్థితియందెక్కడకో పాఱిపోయెను. శరీరమునందున్న ప్రతికణమునందును జీవితాశతప్ప మఱియొకటి లేదు. ఎదుట నున్న మహాజ్వాల లామెను మఱింత ధైర్యమునకుఁ బురికొల్పెను. మామగారు కాదు. త్రిలోకాధి

పతి వచ్చినను గూడఁ దన నిండుప్రాణము నగ్నిహోత్రమున కాహుతి యొనరించుటకు సీతమ్మ యొప్పుకొనలేదు. ప్రమాణముననే నేను సహగమనము చేయు నని చెప్పెను. దగ్గఱనున్నవా రందఱును నామెను, మంచిమాటలచేతను, శాస్త్రవచనములచే సుఖములచేతను, శాపముల చేతను, కుటుంబమునకు గాఁగల యశస్సును చెప్పుటచేతను—ఇట్లైన సరిదోఁచినమాటలను వారు చెప్పి—యామె నొప్పించుటకుఁ బ్రయత్నించుచుండిరి—ఆహా! ఆచారప్రాబల్యము మానవు నెంతమట్టునకైనను దింపును; మనస్సునకు యుక్తాయుక్తవివేచనముఁ బుట్టనీయదు. ధర్మముగూ! యధర్మముగూ! యనునూహ గలుగనే కలుగదు. అట్టియాచారము మతముపేర ప్రబలినప్పుడు వేఱ చెప్పవలసిన దేమున్నది? అగ్నికత్తోడైన వాయువువలె, నిట్టిమతసంబంధ మగు నమ్మకము, మానవుల మానసములను గాల్చి సంఘమును ధ్వంసము చేయును—ఎంతసే పెన్నివిధముల నొప్పించినను గూడ సీతమ్మ యొప్పుకొనునట్లు గనుపింపలేదు. ఆమె శిరీషకుసుమ కోమలశరీరమును, ప్రతి జీవకణమునందు నుబుకుచుండు జీవనమున దలియాకను, కేవల మొక పిచ్చినమ్మకమునకై దహించుట కొప్పుకొనలేదు. తుదకుఁ దన్ను బలాత్కరింతురేమో యను భయముగూడ నామెకుఁ బుట్టుచుండెను. ఇంతలో మనుష్యులు వచ్చుచున్నసడి వినరాఁగా నందఱును జెవులు రిక్కించి వినుచుండిరి. దోషసహితమైన మనస్సుగలవారు గావునఁ బురోహితుఁడు మొదలగువా రందఱికిని గుండెలు తటతటఁ గొట్టుకొనఁజొచ్చెను. ఒక్కనిమిసములోఁ గొత్వాలు మొదలగువా రందఱు నచ్చోటికి వచ్చి నిలిచిరి. వారివెంట వచ్చినరక్షకభటులు పాఱిపోవు యత్నములో నున్న పురోహితుని నాతనియనుచరులను బంధించిరి. ఇదిగాంచి నాగానందుఁ డత్యుద్రేకముతో వారల నందఱను దిట్ట నారంభించెను. "బ్రాహ్మణులదహనకార్యములలో నితురక లడ్డ

గించినయెడల ధ్వంసమై పోవుదురు" అను నాగానందుని మాటలను లెక్కించక యాతనికిఁగూడ బేడీలు వేసిరి. సీతమ్మ గిరిజమ్మలను మాత్రము బంధింపకుండఁ దమవెంట నడిపించుకొనుచు రాజసభ కెల్లరను దోడ్కొని పోయిరి.

పాదుషా దసపూజావిధానమును బూర్తి జేసికొని యాసహాగమనము నొనరించువారెప్పుడు వత్తురా! యని సభలోఁ జూచుచుండెను. సుమారు తొమ్మిది గంటలు ప్రొద్దుమించెను. ఫైజీపాజలులతోను, దక్కవపండితదండ రాధవైణికాదిజనసమర్దముచేతనుసభ కిటకిటలాడుచుండెను. ఇంతలో ఖైదీల నందఱును వెంటఁబెట్టుకొని కొత్వాలు మానసింగులు లోని కరుగుదెంచిరి. రక్తసిక్తమైన దుస్తులతో చేతులు నలంకరించుచున్న సంకెలలతో నున్న చందనదాసు రహీములను గాంచి "ఏమీ! వీరు! నేరము నొనరించువారు!" అని చక్రవర్తి ప్రశ్నించెను. అప్పుడు మాన్‌సింగుఁ మహాప్రభూ! ఏలినవారనుకొనినట్లు వీరు సహగమనపు నేరము వారు గారు. పట్టణ ప్రాంతమున నాయుధపాణులై పోరాడుచు శాంతికి భంగము గలిగించుచున్నారని వీరిని బంధించి తెచ్చితిమి. మేము కొంచె మాలస్యముగాఁ బోయినయెడల వీరిలో నొక్కరో లేక యిరువురునో యీదినముననే చావవలసియుండును." దానికి చక్రవర్తి సరియే! వీరిని తరువాత విచారింపవచ్చును, ప్రథమమున నాసహగమనమునకు సంబంధించిన నేరమును విచారింతుము"

నేరము విచారణకు వచ్చెను. గిరిజమ్మ సీతమ్మల వాఙ్మూలములు పుచ్చుకొనిరి. తరువాత నాగానందుని పరీక్ష యారంభమయ్యెను.

అక్బరు—ఎందుల కిట్టి నేరమునకుఁ బూనుకొంటివి. సహగమనము చేయించునప్పు డాయువిదయొక్క యిష్టానిష్టముల నొకయది

కారికడఁ జెప్పింపవలయు నని నీకుఁ దెలియునా! లేదా! పద్ధతికి విరుద్ధముగా నామె కిష్టములేని సహగమనమునకు నీ వేల ప్రోత్సహించితివి? శ్మశానమును గాని యస్పృష్టలమున దహన మేల ప్రారంభించితివి!

నాగానందుడు—నామతవిధుల ప్రకారము నేను చేయుటకుఁ బూనుకొంటిని. ఈమె సహగమనము చేయకున్న నాపుత్రునకు స్వర్గలోకము లుండవు. ఇంతకును నామతవ్యాపారములో నింకొకరుజోక్యము గలుగఁ జేసికొనుట న్యాయ మగునా?

అక్బ—మతవిషయకవ్యాపారములయందన్యు లడ్డురాఁగూడదని నేను శాసించినది సత్యమే గాని సహగమనమునకు సంబంధించిన విధులు నీకుఁ దెలియునా! లేదా! మత మను పేరు పెట్టి యింకొక మనుష్యుని బలాత్కారముగా దహించుట యేమి న్యాయము! ఇంకెవరో వారి మతవిధి యని చెప్పి నిన్ను దహియించుటకుఁ బూనుకొన్నయెడ నీవేమి యొనరింతువు? ఎట్లు సహింతువు?

చక్రవర్తి వేసిన సవాలునకు నాగానందునికి జవాబు తోఁపలేదు. తాను జేసినతప్పునకు నిశ్చయముగా శిక్ష తప్ప దని యాతఁ డెఱుఁగును. ఆభయముచేతను సవాలునకు జవాబు దోఁచకుండుటచేతను నిట్లు జవాబిచ్చెను.

నాగానం—తప్పని యెఱిఁగి సహగమనమునకుఁ బురికొల్పలేదు. మత మనునమ్మకముతో మాత్రము చేసియుంటిని.

అక్బరు—అట్లైన నిప్పుడు పశ్చాత్తాపతప్తుఁడ వయ్యెదవా?

నాగానందుఁడు జవాబు చెప్పుటకు యోచించుచుండ, పాపము సీతమ్మ తనసహజసరళస్వభావముతో నిట్లు పలికెను.

సీతమ్మ—మహాప్రభూ! వారు నన్ను బలవంతముగాఁ జితిపై ద్రోయుటకు యత్నింపలేదు. నాకు సహగమనమునుగుఱించి బోధింపఁదొడఁగిరి. నేను గోరినది రక్షణమాత్రమే గనుక వారిని క్షమింపవలె నని యేలినవారిని ప్రార్థించుచున్నాను.

సీతమ్మమాటలను వినియు నామెవైపు చూడకయే యక్బరు దన ప్రశ్నను రెట్టించి నాగానందునివైపు చూచెను. ఏదజవాబుఁ జెప్పినయెడల శిరస్సుపోవు నను భయమును, దనకంటె నెన్నియో రెట్లు విద్యావంతులును నుదారస్వభావులు నైన వారితోఁ బ్రసంగింపవలసినపుడు సాధారణముగాఁ గలుగు మనస్సంకోచమును, ఆసభయొక్క యౌన్నత్యమును, దనకోడలిచ్చటనైనఁ దనపక్షమే మాటలాడి తన్ను రక్షించుటకు బ్రయత్నపడుచున్న దను సంశయమును, గలిసి యొక్కసారిగా నాతని మనస్సును మార్చివేయుటచే నాగానందుఁడు 'నిశ్చయముగాఁ బశ్చాత్తాపము నందితి' నని యుత్తర మొసంగెను.

'అట్లయినఁ గానిమ్ము. నిన్నీసారికిఁ బ్రాణము తీయకుండ విడిచితిమి. ఈసిపాయిలతో వెడలి యూరంతయును వీథులవెంబడి డప్పులతో నీవు చేనేరమును జెప్పవలెను. ఇట్టితప్పు నికముందెవ్వరైనఁ జేసినయెడలఁ దప్పక శిరశ్ఛేదమే శిక్ష యని చెప్పుచు రావలెను' అని చక్రవర్తి యాజ్ఞాపించి ప్రక్కనున్న యుద్యోగిని సాభిప్రాయముగా వీక్షించెను. ఇతఁడు నాగానందునిఁ దీసికొనిపోయెను. సీతమ్మను దలిదండ్రులకడ విడిచి రావలసిన దని యాజ్ఞాపించియామె వెడలిపోవుచుండఁగా నిట్లు పల్కెను 'హిందూయువతుల కష్టములు తలఁచుకొనినయెడల నెవ్వరికైనఁ గన్నుల నీళ్లు రాక తప్పదు. పునర్వివాహ మొనరించుకొను నెడల నీకుఁ గావలసిన సాహాయ్య మొనర్చుటకు మేము సిద్ధముగ నున్నాము. నీవు యోచించుకొని జవాబు నీయవచ్చును.'—తరువాత నచ్చటిపురోహితుఁజూచి యిట్లనియెను, 'వీరు సంఘమునంతను గోతఁ బడఁద్రోసి తమకు నమ్మిక లేనిమాటలనుగూడఁ బ్రజల మనస్సుల కెక్కించి ధనాశయే ప్రధానముగా వర్తించుచున్నారు. దినమున కెన్నియో దహనకార్యములఁ జేయిం

చుచుండుటచే సహగమనము దోషమని యెఱింగియుఁగూడ వీరకా-ర్యమునకుఁ దోడుపడుట, ధనాశచేతను, నాచార ప్రాబల్యమును నశింపకుండ స్థాపనఁజేయు నభిప్రాయముచేతను నై యున్నది. వీరికి కారాగారశిక్ష విధించితిమి.' వెంటనే యిరువురు సిపాయిలు వారిని సభలో నుండి నెట్టుకొనిపోయిరి.

ఆవ్యవహారము ముగిసినతరువాత. పాదుషా యసంతృప్తిని జూపించు నయనములతో, 'ఉన్నతమైన యుద్యోగములయందుండి సర్వజనులకును నీతి జూపింపవలసినమీరే కారణముచే నిట్లుగొట్లాడు చున్నారు?' అని చందనదాసు నడిగెను. జవాబు సెప్పుట కొక్క త్రుటికాలము తటపటాయించి "మా కిరువురకును యుద్ధము జరుగుటకుఁ గారణ మీతఁడే! నిన్నప్రాతఃకాలమున మాయింటికి డకు వచ్చి యుద్ధమునకు రమ్మని నన్నుఁ బిలిచెను. ఆతఁడు తప్పు దనుటచేతను, వీరధర్మమును నేను త్యజింపలేకపోవుటచేతను నీయపరాధమునకుఁ బాలైతిని" అని నమ్రుడై చందనదాసు మాఱుపలికెను.

అంత చక్రవర్తి "ఇది నిజమేనా" యని రహీము నడిగెను.

"అవును మహాప్రభూ! నేను ప్రేమించినయువతి నీతఁడును ప్రేమించుటచే మాయిరువురలో నెవరో యొక్కరే జీవించియుండ వలెనను నూహ గలిగి యీతనిని యుద్ధభూమికిఁ బిలుచుట సత్యము" అని రహీము పలికెను.

ఆమాట వినినతోడనే యక్బరుచక్రవర్తి చిన్న నవ్వు నవ్వి "ఓహో! దీనివెనుకఁ బెద్దకథగూడ నున్నదా? మీ రిరువురు నొక్క యువతినే ప్రేమించితిరా? ఆమె మీయిరువురలో నెవ్వరిపై నైన ననురాగముఁ జూపించుచున్నదా! ఆమె నడిగినయెడల తేలిపోవుసందర్భములో యుద్ధమునకు దిగితిగదా! ఇంతకును పడుచుప్రాయంపుఁ గార్యంబు లిట్టివే యనఁ వేరె చెప్పనేల? మీయిరువురమనములను

నాకర్పించి మీకు యుద్ధమును గల్పించిన యావనిత యెవ్వరు ?" ఆమాటలు విని చందనదాసు, పాదుషా గేలిచేయుచున్నాఁ డని యెఱింగి తల వంచుకొని యూరకుండెను. రహీముమాత్రము—— ఫహ్మిదా——యని జవాబిచ్చెను. వెంటనే సభ యంతయు నాశ్చర్యమగ్న మయ్యెను. పాదుషాయు విశాఘనడ్ ఫైజీఫాజులవైపు చూచెను. వారును బాప మీసందర్భము నెప్పుడు నెఱుఁగనివా రగుటచే నాశ్చర్యముతో నిండి చక్రవర్తి కేజవాబును నీయలేకపోయిరి. సభ్యు లందఱును వారివైపె చూచుచుండుటచే ఫైజీఫాజులులు మఱింతవింతపడసాగిరి. తరువాత నక్బరు ఫైజీనిగని "అయ్యా! మీశిష్యురాలినివివాహమాడుటకునన్నిసందర్భములలోసఖ్యముతో నున్న మహావీరులుగూడ కత్తులను గల్పుచున్నారు. ఈవిషయము మీకేమైనఁ దెలియునా అనెను ?" ఆప్రశ్నకు జవాబుగాఁ దనకుఁగాని తనయింటి యందు మఱి యెవరికిఁగాని యీయుదంతము తెలియనే తెలియ దని ఫైజీ యొప్పుకొనవలసివచ్చెను. "ఓహో! ఇది మఱియు చిత్రము వారు ప్రేమించు యువతిగాని యామెసోదరసమానులను నామెను గాపాడువారునుసగు ఫైజీఫాజలులుగాని యెఱుఁగకుండ వీరు పోరాడుచున్నారు. ఇఁక నీవివాహసంబంధ మగు తగవులాట నాఁపవలెనన్న మన మాయువతియిష్టమును గనుఁగొని యెవరికో యొకరికి వివాహ మొనరింపకున్న పట్టణప్రాంతములలోనే కాక మాయెదుటనే వీరు యుద్ధముచేతురు. ఏమి! మరల నిచ్చట కత్తులు దీసికొని సిద్ధపడరా!" యని చక్రవర్తి వారి నిరువురను గేలిసేసెను. సభవారందఱును నవ్విరి. "సరియే, మా సివాదము మేమే నిర్ణయించువారము" అని చెప్పి యక్బరు ఫైజీవైపు సంజ్ఞచేసి, యొకదాసిచే, ఫహ్మిదా యభిప్రాయము గనుఁగొనవలసిన దని యంబర్ రాజకన్యకుఁ గబురంపెను. ఫైజీయు నింటికేఁగి ఫహ్మిదాను దీసికొనివచ్చి యం

తఃపురముకడ విడిచెను. ఫైజీ సభలోనికి వచ్చి కూరుచున్న గొంత సేపటికి లోపలినుండి జనానాదాసి వచ్చి ఫర్హామీందా యభిప్రాయమును వెల్లడించెను. ఆయభిప్రాయమును విని చందనదాసు గెలుపొందినందులకభినందించి యాతనితో నక్బరిట్లు పలికెను.

"నీవు హిందూమతమునకుం జేరినవాఁడవుగదా! మహమ్మదీయుల కన్యకను బెండ్లియాడుదువా?" అంత చందనదాసు "మహా ప్రభూ! నేను ప్రభువులవారికొలువులోఁ జేరినతరువాత జ్ఞానాభివృద్ధి నందితిని. పండితులవాదముల వింటిని. ఎన్నిదినములనుండియో నా మనస్సామెయందు లగ్నమై యున్నను గూడ మతవిషయకమగు పిచ్చినమ్మకములు పోకుండుటచే వివాహమునుమాట తలపెట్టఁజాలనైతిని. ఇప్పుడు నామనస్సు మారినది. సత్యమతమును గనుఁగొంటిని ఇట్టి సందిగ్ధసమయములలో నెప్పుడును దామే నాకు మార్గదర్శకులు." ఆమాట విని పాదుషా తిరిగి ఫైజీవైపు ప్రశ్నపూర్వకముగ మొగమెగుర వేసెను. ఆతఁడు లేచి "చందనదాసు నాకుఁ బరమ మిత్రుఁడు; విద్వాంసుఁడు; వీరుడు; ఉత్తమశీలముగలవాఁడు. అట్టి వానికి వివాహార్థియై నాయింటిపడుచును గోరినప్పు డిచ్చుటకంటె మాకేమి ఘనత గలదు? ఏలినవారి పాదచ్ఛాయల ననుసరించి మేము కృతకృత్యులమయ్యెదము." ఆమాటల నన్నిటిని విని మహానందమున మునిఁగిన యక్బరుచక్రవర్తి సభలో నిట్లుపలికెను. "మన దేశమున నున్న యెల్ల మతములవారును గలసిమెలసి యేభేదములు లేకుండ నొకేసంఘమువారుగా నుండినయెడల మనకష్ట మంతయు ఫలించును. పండితులలోఁ బండితులైన ఫైజీఫాజలులవలె, విద్వాంసులును దక్కిన యుద్యోగులును, దేశమందలి ప్రజలును మతాంతర వివాహముల నొనరించుట కెప్పుడు సిద్ధముగా నుందురో యప్పుడే దేశమునకు క్షేమము గలుగును. రాజ్యమున కౌన్నత్యము లభియిం

చును.” చందనదాసును మెచ్చుకొనుసందర్భమున రహీమునను బలుక రించువారే లేకపోయిరి. కాని చక్రవర్తిమాత్ర మాతనిం జూచి యిట్లనియెను. “యుద్ధ మక్కఱలేకుండ మీవివాదము రెండునిముసములలోఁ బరిష్కార మైనది. మీరు ప్రేమించుచున్న యువతి మానస మెవరియందు లగ్నమైనదో తెలిసికొనినయెడల నీయుద్ధమునకవకాశ ముండియుండదు. నీకింక నేమైన నాశ యున్నదా ? నిష్కళంకమైన హృదయముతో నీవధూవరుల క్షేమాభివృద్ధులను గోరుదువా ?” అందులకు రహీము “మహాప్రభూ ! నన్నుఁ బ్రేమింపక యింకొకనిఁ బ్రేమించుచున్న తరుణిని బెండ్లియాడి నేనేమి సుఖమనుభవింపఁగలను ? తప్పక వధూవరులను రక్షింపవలసిన దని నేనీశ్వరునిఁ బ్రార్థించుచున్నాను” అనెను. ఆమాటలు వినిన తరువాత కొత్వాలువైపు చూచి వీరు నేర మొనరించు నుద్దేశముతో యుద్ధ మొనరింపలేదు. గావున వీరిని దోషులుగాఁ బరిగణింపఁజాలము” అని చెప్పి విముక్తులఁ గావించెను. తరువాత నొక్కక్షణ మూరకుండి పశ్చాత్తాపతప్తుఁడై యున్న రహీము, తనలోని యున్నతస్వభావ మ్ముబికి రాఁగా “మహాప్రభూ! దయాసముద్రులై న్యాయమూర్తులైన యేలినవారియెదుట, నేఁ జేసిన యింకొక ఘోరమైన నేరమును దెలుపుకొనుచున్నాను. దానికి నన్ను క్షమించినను సరే! శిక్షించినను సరే! శిక్షకుమాత్రము నేను దగుదును. మొన్నరాత్రి చందనదాసును జంపుటకు వచ్చినమనుష్యులు నాప్రేరేపణచేతనే యాకార్యమునకుఁ గడంగిరి కావున నేనే శిక్షకుఁ బాత్రుఁడను. వారిని క్షమించి నన్ను శిక్షింపఁగలందులకు నేను ప్రార్థించుచున్నాను.” ఈమాటలు విని “ఇదియేమి” అను నభిప్రాయముతో చక్రవర్తి కొత్వాలువైపు చూచెను. అప్పు డాతఁడు జరిగిన యుదంత మంతయును పాదుషాకు నివేదించి యాఖైదీలను దెప్పించి వారిముందు

పెట్టెను. అంత చందనదాసు లేచి "మహాప్రభూ! నన్నుఁ జంపుటకు వారు ప్రయత్నించినను దైవవశముచే రక్షింపఁబడితిని. ఇంతకును మాసహోద్యోగి యగు రహీముగారు తమ పశ్చాత్తాపమును జెప్పుచున్నారు. గావున వారు క్షంతవ్యు లని మనవి చేసికొనుచున్నాను." ఆమాటలు విని సభయంతయును జక్రవర్తి నట్లే చేయవలసిన దని కోరిరి. "ఈ సంతోషసమయమున నందఱను క్షమింపవలయును" అను వాక్యముల విని చక్రవర్తి గౌతమ్యాలువైపు చూచి "ఇందఱు వారిపక్ష మగుటచే నీసారికి క్షమించితిమి. వీరిపేర్లు నేరగాండ్ల జాబితాలో వ్రాసి యుంకే నేరమైన వీరిపై వచ్చినయెడల శిక్షను త్రిగుణీకృత మొనరింపవలయును. ఇఁక రహీము జాగ్రత్తగా మెలఁగవలయును. ఈవివాహమును స్వయముగా మేమే జరిపింతుము." అని చెప్పుచు సభనుండి లేచెను.

సమాప్తము

## ఆంధ్రప్రచారిణీ గ్రంథమండలివారి

| | | | |
|---|---|---|---|
| సీతారామరాయలు | 1 8 | వంగవిజేత | 1 8 |
| రాజసింహ | 2 0 | దుర్గేశనందిని | 2 0 |
| మృణాళిని | 1 8 | నౌకాభంగం 1 వ భా॥ | 2 0 |
| విషవృక్షము | 1 8 | డిటో 2 వ భా॥ | 2 0 |
| మృణ్మయి | 1 8 | [illegible]ప్రతిజ్ఞ | 1 8 |
| కృష్ణకాంతుని మరణశాసనం | | ఇందుమతీ వసంతము | 2 0 |
| (అపరాధ పరిశోధక | | [illegible] | 2 0 |
| నవల) | 1 8 | అపరాధిని | 1 8 |
| శ్రీకృష్ణ చరిత్ర (భాగవతసారం | | అల్లాహో అక్బరు | 1 8 |
| వచనం) 1 వ భా॥ | 1 8 | ప్రణయచాంచల్యం | 1 8 |
| డిటో 2 వ భా॥ | 1 8 | జమీందారు - రామరాజు | 1 8 |
| కమలాకాంతుడు | 0 6 | అపరాజిత | 1 8 |
| రజని | 1 0 | క్షమార్పణ | 1 8 |
| శకుంతల | 1 0 | [illegible] | 1 8 |

## వేగుచుక్క గ్రంథమండలివారి

| | | | |
|---|---|---|---|
| వాదేవీడు 1 వ భా॥ | 1 8 | కోటీశుతనయ | 1 8 |
| నేనే 2 వ భా॥ | 1 8 | వేంకటరావు | 1 8 |
| కాలూరాయి 3 వ భా॥ | 1 8 | | |

## తేతవరపు రామకృష్ణశాస్త్రిగారి

| | | | |
|---|---|---|---|
| ఘోరప్రతిక్రియ | 2 0 | భీషణప్రతిహింస | 1 8 |

వలయువారు:—

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో. రాజమండ్రి.